# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 8 సంచిక : 10 హైదరాబాద్ 111 అక్టోబర్ 2010 పేజీలు : 60 రు. 10

- ఫోకస్ : రాజకీయ వ్యవస్థను బాగుచేయడం ఎలా?
- అక్రమాల పుట్ట ఎ.పి.పి.ఎస్.సి.
- అణు పరిహార బిల్లు ఎవరికోసం?
- కుళ్లిపోతున్న తిండిగింజలు
- స్విస్ బ్యాంక్ నిల్వలకు ప్రభుత్వ అండ
- హింస - ప్రతిహింస - ఒక అవగాహన
- స్వేచ్ఛాకాంక్షే జీవిత ధ్యేయం

## మన గురించి మనం తెలుసుకుందాం!
## ప్రాంతాలనూ ప్రజలనూ అర్థం చేసుకుందాం!

ఎనిమిది సంవత్సరాలుగా తెలుగు సమాజం తన గురించి తాను చేసుకుంటున్న సంభాషణకు అద్దం పడుతూ, ప్రతిఫలిస్తూ, ఆ సంభాషణకు తనవంతుగా కొత్త అంశాలు చేరుస్తూ వస్తున్న వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక జనవరి 2011 సంచిక నుంచి ఒక కొత్త ప్రయత్నాన్ని ప్రారంభిస్తూ మీ అందరినీ అందులో భాగం పంచుకోవలసిందిగా కోరుతున్నది. తెలుగు సమాజంలో ఉన్న వనరులు ఏమిటి? ఆ వనరులు ఉపయోగపడవలసిన ప్రజలు ఎవరు? ఆ ప్రజల చరిత్ర ఏమిటి? ఆ ప్రజల మధ్య వైవిధ్యం గాని, వైరుధ్యాలు గాని ఎలా ఉన్నాయి? ఆ ప్రజలు తమ నిత్య జీవితంలో ఎటువంటి సమస్యలు ఎదుర్కొంటున్నారు? ఆ సమస్యలకు మూల కారణాలు, ఆ సమస్యలను తీవ్రతరం చేస్తున్న కారణాలు ఏమిటి? ఆ సమస్యల పరిష్కారం కొరకు ప్రజలు ఏయే ప్రయత్నాలు చేస్తున్నారు? ఆ ప్రయత్నాల ఫలితంగా తెలుగు సమాజంలో వస్తున్న మార్పులు ఏమిటి? రాజకీయార్థశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే ఇవాళ్టి తెలుగు సమాజంలో ఉన్న ఉత్పత్తి సాధనాలు ఏమిటి, ఉత్పత్తి శక్తుల స్థితి ఏమిటి, ఉత్పత్తి సంబంధాల స్థితి ఏమిటి? ఈ ప్రశ్నలకు వాస్తవ భౌతిక పునాది ఆధారంగా జవాబులు చెప్పుకుంటే మనకు మన గురించి అవగాహన పెరుగుతుంది. మనం ఎక్కడి నుంచి ఇక్కడికి వచ్చామో, ఇవాళ ఎక్కడ ఉన్నామో, రేపు ఎటు వెళ్లవలసి ఉందో, అక్కడికి చేరగల మార్గాలేమిటో తెలుస్తుంది.

ఈ కృషిలో భాగంగా వీక్షణం రాష్ట్రంలోని ఒక్కొక్క జిల్లాను ప్రాతిపదికగా తీసుకుని పరిశీలన జరపాలని అనుకుంటున్నది. ఆ జిల్లాలో

**భౌతిక, ప్రకృతి వనరులు** (భూమి, అడవులు, నదులు, ఖనిజాలు, వ్యవసాయం, పరిశ్రమలు, వగైరా)

**ప్రజలు** (చరిత్ర, ఉత్పత్తి సంబంధాలలో మార్పులు, కుల-మత-వర్గ పొందిక, రవాణా, విద్య, వైద్యం, వగైరా)

**ప్రజాసమస్యలు** (సాధారణంగా అంతటా ఉన్న సామాజిక సమస్యలు, ప్రత్యేకంగా ఆ జిల్లాలోనే ఉన్న సమస్యలు)

**ప్రజా పోరాటాలు** (ప్రజల ఆకాంక్షలు, వాటి పరిష్కారం కోసం జరిపిన, జరుపుతున్న పోరాటాలు)

ఈ పరిశీలనలో భాగమవుతాయి.

**స్థూలంగా ప్రకృతి, ప్రజలు, ప్రజాసమస్యలు, ప్రజాపోరాటాలు అనే నాలుగు వ్యాసాలుగా గానీ, ఒకటి రెండు వ్యాసాలు అదనంగా గానీ ఈ పరిశీలన ఉంటుంది.**

ఈ కృషిలో తెలుగు సమాజంలోని ఆలోచనాపరులు, ప్రజా ఉద్యమ కార్యకర్తలు, ప్రజల అభ్యున్నతి గురించి శ్రద్ధాసక్తులు ఉన్న ప్రతిఒక్కరూ పాల్గొనాలని వీక్షణం కోరిక. ఈ ప్రణాళిక గురించి చర్చించడానికి వీక్షణం కార్యాలయంలో నవంబర్ 13, శనివారం జరిగే సమావేశానికి అందరూ ఆహ్వానితులే.


వివరాలకు సంప్రదించవలసిన చిరునామా

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,

హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www:veekshanam.wordpress.com

వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

అక్టోబర్ 2010
సంపుటి : 8
సంచిక : 10

### సంపాదకీయం

# రాజకీయ వివాదాన్ని న్యాయవ్యవస్థ తీర్చగలదా?

బాబ్రీమసీదు–రామజన్మభూమి వివాదాన్ని పరిష్కరించవలసిన సమాజమూ, రాజకీయవ్యవస్థా ఆ బాధ్యతనుంచి తప్పుకుని న్యాయవ్యవస్థవైపు చూస్తున్నాయి. ఆ వివాదాన్ని సమగ్రంగా పరిష్కరించడానికి తగిన శక్తి సామర్థ్యాలు లేని న్యాయవ్యవస్థ ఆ వివాదపు విస్తృతినీ, చరిత్రనూ విస్మరిస్తూ, దాన్ని ఒక చిన్న ఆస్తివివాదంగా మార్చి తీర్పు ఇవ్వడానికి ప్రయత్నిస్తున్నది. విచిత్రమైన విషయమేమంటే న్యాయవ్యవస్థ ముందర ఉన్న వ్యాజ్యాలు బాబ్రీమసీదు గురించో రామజన్మభూమి గురించో, ఆ పేరుమీద ఈ దేశంలోని రెండు ప్రజాసమూహాల సహజీవనానికి పెడుతున్న చిచ్చు గురించో కాదు. ఇవాళ న్యాయస్థానం ముందున్నవి బాబ్రీమసీదు అనే కట్టడం నిలిచి ఉన్న స్థలం యజమాని ఎవరు అనే వ్యాజ్యాలు మాత్రమే. అసలు దేశంలో పద్దెనిమిదో శతాబ్దానికి ముందు భూయాజమాన్య వివరాలే లేవు. ఎక్కువలో ఎక్కువ అంతకు ముందు రాజ్యంలోని భూమంతా రాజుదే. అలా చూస్తే ఆలయం నిర్మించారని చెపుతున్న చంద్రగుప్త విక్రమాదిత్యుడికి ఆ భూమి మీద ఎంత అధికారం ఉన్నదో, ఆ తర్వాత వెయ్యి సంవత్సరాలకు ఆ ఆలయాన్ని కూలగొట్టి మసీదు నిర్మించారని చెపుతున్న బాబర్ చక్రవర్తికీ అంత ఉన్నది. తర్వాత రెండు వందల సంవత్సరాలకు బ్రిటిష్ ప్రభుత్వం భూమి మీద వ్యక్తిగత యాజమాన్యాన్ని నమోదు చేయడం మొదలుపెట్టి చట్టపరమైన రక్షణ కల్పించింది. ఆ చట్టాలు అమలులోకి వచ్చిన తొలిరోజుల్లోనే 1885లో మొదటిసారి ఈ భూవివాదం న్యాయస్థానం ముందరికి వచ్చింది. ఆ భూమి తమకు చెందినదంటూ, అక్కడ తమ ఆలయం కట్టుకోనివ్వాలంటూ పూజారి రఘువర దాస్ వేసిన వ్యాజ్యాన్ని ఆనాటి న్యాయస్థానం – ఫైజాబాద్ సబ్ జడ్జి, జిల్లాజడ్జి, అవధ్ జుడిషియల్ కమిషనర్ మూడు స్థాయిలలో – కొట్టివేసింది. అంటే భూయాజమాన్య తగాదా అప్పుడే సమసి పోయింది. కనుక ఇప్పుడు అలహాబాద్ హైకోర్టు ముందర ఉన్న వ్యాజ్యాలకు అర్థమే లేదు. ఇక మిగిలినది లక్షల ఏళ్ల కింద శ్రీరాముడు అక్కడే నివసించాడనే విశ్వాసమూ, సరిగ్గా ఆ చోటును వెతికి పట్టుకుని ఆలయం నిర్మించారనే విశ్వాసమూ, 1992 డిసెంబర్ 6 దాకా అక్కడ ఉండిన బాబ్రీమసీదును ఆ ఆలయ శిథిలాలపై నిర్మించారనే విశ్వాసమూ మాత్రమే. ఈ విశ్వాసాలలో ఏ ఒక్కదానికీ చారిత్రక, పురావస్తు, సాహిత్య ఆధారాలు లేవని గత నాలుగైదు దశాబ్దాలుగా ఎందరో నిపుణులు నిరూపించారు. అసలు శ్రీరాముడు వాస్తవ వ్యక్తేనా, రామాయణం అనే కాల్పనిక కావ్యపు నాయకుడా అనే దగ్గరి నుంచి, అదే అయోధ్యలో డజనుకు పైగా గుళ్ల పూజారులు తమ ఆలయమే రామజన్మభూమి అని నమ్మబలికే దాకా అదంతా అసత్యాల, అర్ధసత్యాల, నమ్మకాల పుక్కిటి పురాణం. ఆ మసీదును 1528లో నిర్మిస్తే ఆ అయోధ్యలోనే 1532లో జన్మించి, ఆ పరిసరాలలోనే తిరుగాడి, రామచరిత మానస్ రాసిన ప్రఖ్యాత రామభక్తుడు తులసీదాస్ ఆలయం గురించీ, విధ్వంసం గురించీ మాటమాత్రం కూడ రాయలేదంటే అక్కడ ఆలయం లేకపోయి ఉండాలి. లేదా ఆ ఆలయం అంతగా పరిగణనీయమైనది కాకపోయి ఉండాలి. ఈ దేశంలో బౌద్ధ, జైన, శైవ, వైష్ణవ, ఇస్లాం మతాలన్నీ తమకన్న ముందున్న మతాల చిహ్నాలను ధ్వంసం చేసీ, ఆ మతాలను పాటించినవాళ్లపై హింసాకాండ సాగించీ వచ్చినవే. కనుక ఒకవేళ అక్కడ ఆలయం ఉండి దాన్ని ధ్వంసం చేసి మసీదు నిర్మాణం జరిగినా అది అన్ని మతాలూ పాటించిన సంప్రదాయం ప్రకారం జరిగిందే. అక్కడ ఆలయం ఉన్నా, మసీదు ఉన్నా ప్రజలకు ఒరిగిందేమీ లేదు. కాని పదహారో శతాబ్ది నుంచి 1992 వరకూ అక్కడ మసీదు ఉన్నదనేది మాత్రమే కళ్ల ఎదుట ఉన్న వాస్తవం. ఆ రకంగా అది ఈ దేశపు చారిత్రకసంపద. ఆ సంపదను సంఘ పరివారం ధ్వంసం చేసింది. కనుక ఇప్పుడు ఎవరయినా మాట్లాడితే ఆ విధ్వంసకారులకు ఇంకా శిక్ష పడకపోవడం గురించి మాట్లాడాలి. కాని నూట ముప్పై ఏళ్ల కింద సమసిపోయిన, అరవై ఏళ్లకింద మళ్లీ ఒకసారి న్యాయస్థానానికి ఎక్కిన ఆస్తి తగాదానే ఇప్పుడు చర్చనీయాంశం చేస్తున్నారు. మళ్లీ ఒకసారి విభిన్న మతాల ప్రజల మధ్య చీలికలు, విద్వేషాలు రెచ్చగొట్టి తమ పబ్బం గడుపుకోవడానికి రాజకీయవర్గాలు ఆడుతున్న కుటిల నాటకం ఇది. బ్రిటిష్ పాలకుల 'విభజించి పాలించు' సూత్రాన్ని తాము కూడ ఉపయోగించవచ్చునని 1947 నుంచీ కూడ భారత పాలకులు వేస్తున్న పాచికలలో భాగమే ఈ వివాదం. అందువల్లనే 1949లో బాబ్రీమసీదులో దొంగతనంగా విగ్రహాలు ప్రవేశపెట్టడం, మళ్లీ ఆస్తి తగాదాను న్యాయస్థానం ముందుకు తీసుకుపోవడం, తర్వాత మూడు దశాబ్దాలు ఆ సమస్యను ఆరని చిచ్చులా రగిలించడం, చివరికి బాబ్రీమసీదు గేటు తాళాలు తెరిపించి రామపూజకు అవకాశమివ్వడం, శిలాన్యాస్ పేరుతో శంకుస్థాపనకు అనుమతి ఇవ్వడం, హింసాత్మకమైన రామజన్మభూమి రథయాత్రను, రెచ్చగొట్టే ఉపన్యాసాలను అనుమతించడం, దేశమంతటినుంచీ తీసుకొచ్చిన మూకలతో బాబ్రీమసీదును నేలమట్టం చేస్తుంటే మౌన సాక్షులుగా ఉండిపోవడం – ఇటు కాంగ్రెస్, అటు సంఘ పరివారంలోని భారతీయ జనతా పార్టీ ఇటువంటి అనేక నేరాలు చేశాయి. ఇవాళ సమస్య ఆ భూమి ఎవరిదనేది కాదు, అక్కడ ఏ నిర్మాణం ఉంటుందనేది కూడ కాదు. మన పాలకవర్గాల హింసా, హత్యా, రక్తపిపాస రాజకీయాలకు అయోధ్య ఒక ప్రత్యక్ష నిదర్శనం. భిన్న మతాల ప్రజలమధ్య వందల సంవత్సరాలుగా కొనసాగుతున్న శాంతి సామరస్యాలను భగ్నంచేయడం లోనే పాలకుల ప్రయోజనాలున్నాయి. ఈ పాలకుల మతోన్మాద రాజకీయాలను తిరస్కరించి శాంతి సామరస్యాలను కాపాడుకోవడమే ఇవాళ ప్రతి ఒక్కరి కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని నెరవేర్చే శక్తి ప్రజలకే ఉంది గాని న్యాయస్థానాలకు లేదు. వీ

గౌరవ సంపాదకులు :
**వి. హనుమంతరావు**

సంపాదకులు :
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు :
**డి.వి.రామకృష్ణారావు**

కరస్పాండెంట్ /
సర్క్యులేషన్ మేనేజర్ :
**వై. రామచంద్రం**

కరస్పాండెంట్/సబ్ఎడిటర్ :
**సి. రాజశేఖర్**

ఆఫీస్ అసిస్టెంట్ :
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రు. | 120 |
| 3 సంవత్సరాల చందా | రు. | 350 |
| 5 సంవత్సరాల చందా | రు. | 550 |
| 10 సంవత్సరాల చందా | రు. | 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

వీక్షణం అకౌంట్ నెంబర్ –
**013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్,
హైదరాబాద్

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**, హైదరాబాద్.
ఫోన్ : 98484 28516
92468 26191

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

## కాశ్మీర్ ప్రజల ఆకాంక్షలు - ఢిల్లీ రక్తదాహం

ఒకదేశాన్ని ఆ దేశ ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా మరొక దేశ పాలకులు తమ అధీనంలో పెట్టుకోవడానికి ఎన్ని వేలమంది ప్రాణాలు తీయాలి, ఎన్ని లక్షల మందిని గాయ పరచాలి, ఎన్ని వందల మంది స్త్రీల మీద అత్యాచారాలు చేయాలి? కర్ఫ్యూలతో, నిషేధాజ్ఞలతో, ప్రజల మీద దౌర్జన్యానికి సాయుధ బలగాలకు ప్రత్యేక అధికారాలతో జనజీవనాన్ని ఎట్లా అతలాకుతలం చేయాలి? ఈ హింసా పాఠాలను భారత ప్రభుత్వం కాశ్మీర్ లో నేర్పుతున్నది. వేల సంవత్సరాలుగా సాగుతున్న దురాక్రమణల, దుర్మార్గాల చరిత్రలో కొత్త అధ్యాయం రచిస్తున్నది. తన రక్తదాహాన్ని సమర్థించుకోవడానికి, ఆ రక్తదాహానికి మధ్యతరగతి మద్దతు పొందడానికి పచ్చి అబద్ధాలను ప్రచారం చేస్తున్నది. ఇంత కర్కశత్వానికి తెగబడుతున్న ప్రభుత్వం తనను తాను ప్రజాస్వామిక ప్రభుత్వాన్నని చెప్పుకోవడం, ఆ ప్రభుత్వ పాలనలో ఉన్న మనందరం నోరెత్తకపోవడం ఇంకా దుర్మార్గంగా ఉన్నాయి. ఎక్కడెక్కడి ప్రజల స్వేచ్ఛాకాంక్షను సమర్థించే మనం మన పొరుగు ప్రజల స్వేచ్ఛాకాంక్ష పట్ల మాత్రం మౌనంగా ఉండడం, ప్రభుత్వ అబద్ధాలను అక్షరాలా నమ్మడం అత్యంత దుస్సహంగా ఉన్నది. ఇవాళ మనం కళ్లు మూసుకుని ఈ దుర్మార్గాలన్నీ జరగడం లేదని అనుకోవచ్చు. ఇవాళ మనం తాత్కాలిక మతిమరపును తెచ్చుకుని జరిగిన చరిత్రను జరగలేదని అనుకోవచ్చు. కాని చరిత్ర సాక్ష్యంగా నిలుస్తుంది. ప్రపంచం మన నేరాలను నమోదు చేస్తుంది. శతాబ్దాల పాటు స్వతంత్ర రాజ్యంగా బతికిన కాశ్మీర్, భారత ఉపఖండంలో అత్యధిక భాగాన్ని జయించిన మొఘల్ చక్రవర్తులకు కూడ లొంగని కాశ్మీర్, ఒక కుట్రపూరిత ఒప్పందం ఫలితంగా బ్రిటిష్ అధికార పరిధిలోకి వచ్చిన కాశ్మీర్ మౌంట్ బాటన్ ప్రణాళిక కన్న ముందే నయా కాశ్మీర్, ఆజాద్ కాశ్మీర్ కలలు గన్నది. ఆ కలలను ధ్వంసం చేస్తూ పాలకుడు తీసుకున్న విలీన నిర్ణయాన్ని ఆమోదించవలసినది అంతిమంగా ప్రజలేనని ఢిల్లీ ప్రభుత్వం కూడ అంగీకరించక తప్పలేదు. ఆ మాట అటు ఐక్యరాజ్యసమితి ముందర చెప్పింది. ఇటు కాశ్మీరీలకు వాగ్దానం చేసింది. ఆ వాగ్దానానికి కట్టుబడి ఉంటానని సూచించడానికే రాజ్యాంగంలో అధికరణం 370 చేర్చింది. కాని దేశంలో అవకాశవాద మతోన్మాద రాజకీయాలు పెచ్చరిల్లిన కొద్దీ ఈ అంతర్జాతీయ ఒప్పందాలు, ప్రజలకు ఇచ్చిన హామీలు వమ్మయిపోయాయి. అప్పటినుంచి ఇప్పటిదాకా గడిచిన అరవై సంవత్సరాలలో కేవలం ఆ హామీలు అమలు చేయమని కోరినందుకే డెబ్బై వేలమంది కాశ్మీరీ యువకులు ప్రాణాలు బలిపెట్టవలసివచ్చింది. గత మూడు నెలల శాంతియుత నిరసనల మీద దుర్మార్గమైన అణచివేత సాగుతోంది. వందకుపైగా కాశ్మీరీ యువకులను భారత ప్రభుత్వం పొట్టనపెట్టుకుంది. ఉక్కుపాదంతో స్వేచ్ఛాకాంక్షను ఆపలేమని ప్రపంచచరిత్ర వినిపిస్తున్న సత్యం చిదంబరాలకు, మన్మోహన్ లకు, భారత పాలకులకు ఎప్పుడు చెవికెక్కుతుంది?

## ఇరాక్ నుంచి అమెరికా ఉపసంహరణ?

ఎట్టకేలకు ఇరాక్ నుంచి అమెరికా సైనికుల ఉపసంహరణ వేగం పుంజుకుంది. ఇరాక్ పై 2003 మార్చ్ 20న దురాక్రమణ జరిపిననాటినుంచీ అక్కడ తిష్ట వేసిన తన సైనిక బలగాలలోని చివరి దళం 2010 ఆగస్ట్ 31 లోపు అక్కడినుంచి వెనక్కి వచ్చేస్తుందని ఇచ్చిన హామీని నిలబెట్టుకున్నానని అమెరికా ప్రభుత్వం ప్రకటిస్తోంది. యుద్ధాన్ని ఆపుతామని, సైనిక బలగాలను వెనక్కి రప్పిస్తామని అధ్యక్షుడు బారక్ ఒబామా చేసిన ఎన్నికల వాగ్దానం, ఆ తర్వాత అనేక సార్లు పునరుద్ఘాటించిన వాగ్దానం ఇప్పటికైనా అరకొరగా అమలవుతోంది. ఈ ఉపసంహరణ తర్వాత కూడ కనీసం యాభై వేల మంది అమెరికన్ సైనికులు ఇరాక్ లో ఉంటారనీ, వారు 'సలహాదారు పాత్ర'లో అక్కడ ఉంటారనీ స్వయంగా ఒబామా చెపుతున్నాడు. లేని జన విధ్వంసక ఆయుధాలను పట్టుకోవడానికనే పచ్చి అబద్ధాలతో ఏడున్నర సంవత్సరాల కింద ఇరాక్ లో ప్రవేశించిన అమెరికా పాలకులకు – వాళ్లు అప్పటి రిపబ్లికన్లయినా, ఇప్పటి డెమొక్రాట్లయినా – ఆ దేశాన్ని వదలాలని లేదు. పశ్చిమాసియాలో చమురు సంపన్న దేశాల పాలకులను బెదిరించడానికి, ప్రజలను నిర్మూలించి అక్కడి సహజ వనరులను కొల్లగొట్టడానికి, ఆ చమురు క్షేత్రాలన్నిటినీ తమ ఇంటి పెరడుగా మార్చుకోవడానికి బహుళజాతి సంస్థలు, సామ్రాజ్యవాద ప్రభుత్వాలు సాగిస్తున్న స్వార్థపూరితమైన దాడి ఇది. ఏడున్నర సంవత్సరాల దురాక్రమణలో, యుద్ధంలో అమెరికాతో పాటు మరొక 24 దేశాల సైన్యాలు పాల్గొన్నాయి. మొత్తం రెండు లక్షల మంది సైనికులు పాల్గొన్నారు. ఈ యుద్ధం వల్ల పద్నాలుగు లక్షల మంది ఇరాకీలు చనిపోయారని ఒక అంచనా. యుద్ధంలో ఆక్రమణ సైన్యాల సైనికులు ఐదువేల దాకా చనిపోయారు. ఈ యుద్ధానికి నిజంగా ఎంత ఖర్చయిందో ఎప్పటికీ బయటపడదు గాని ఒక్క అమెరికా అధికారికంగా 750 బిలియన్ డాలర్లు ఖర్చయిందని చెపుతుండగా మొత్తం మూడు ట్రిలియన్ డాలర్ల (లక్షన్నర కోట్ల రూపాయల) పైనే ఖర్చయిఉంటుందని జోసెఫ్ స్టిగ్లిట్జ్ అంటున్నాడు. ఇతర ఆస్తి నష్టం చెప్పనక్కరలేదు. ఇంత విధ్వంసం, బీభత్సం ఒక అబద్ధం మీద ఆధారపడి జరిగిందనే కనీస వాస్తవాన్ని అంగీకరించని, కనీసం క్షమాపణ కోరని ఒబామా ప్రభుత్వం ఇప్పుడు సైనికులను వెనక్కి రప్పించానని ప్రకటిస్తోంది. లక్షలాది మంది ప్రజలను బలి ఇచ్చి, దారుణ హింసకు ఎర అయి, ఇరాక్ సమాజం ప్రపంచం ముందర అమెరికన్ సామ్రాజ్యవాద పాలకవర్గాల దుర్మార్గాన్ని నగ్నంగా బయటపెట్టింది. అంతకు ముందరి దారుణాలన్నీ అలా ఉంచినా, జార్జ్ బుష్, డిక్ చెనీ, రమ్స్ ఫెల్డ్ వంటి అరడజను మంది కాపాడదలచిన ప్రయోజనాల కోసం ఇంత భస్మీపటలం ఎందుకు జరగవలసి వచ్చిందని అడిగే తరుణం ఇది. ఈ అనుభవంతోనైనా, ఈ విషాద చరిత్రతోనైనా అమెరికన్ పాలకవర్గాలను, వాటి అంటకాగే దేశదేశాల పాలకవర్గాలను బోనెక్కించక తప్పదనే నిర్ణయం తీసుకోవలసింది ప్రజలే.

వీ

# లోపలి పేజీల్లో...

## ఫోకస్ : రాజకీయ వ్యవస్థను బాగు చేయడం ఎలా?

భారత రాజకీయ వ్యవస్థలో మార్పులు రావాలంటే ఆర్థిక, సామాజిక రంగాలలో విప్లవం, పెనుమార్పు రావలసి ఉంటుంది. ఆ విప్లవం మౌలికంగా, సమగ్రంగా వర్గ అణచివేతనూ, కుల అణచివేతనూ రద్దు చేయవలసి ఉంటుంది. ఏ రూపంలో ఉన్న అసమానతలనయినా నిర్మూలించవలసి ఉంటుంది. రాజకీయ వ్యవస్థలో దోపిడీ పీడనలకు అవకాశమిచ్చే అన్ని రకాల ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక దోపిడీ పీడనలను తొలగించవలసి ఉంటుంది. రాజకీయ రంగంలో అణగారిన వర్గాలకు వాటా కోసం పోరాడాలి. ఇవాళ్టి రాజకీయ రంగం నిజంగా ప్రజానుకూలమైనదీ, ప్రజా ప్రయోజనాలకోసం పనిచేసేదీ కాదనే వాస్తవాన్ని ప్రచారం చేయాలి. విడిగా రాజకీయ వ్యవస్థ సంస్కరణ సాధ్యం కాదనీ, ఆర్థిక వ్యవస్థను మార్చినపుడే దానికి తగిన రాజకీయ వ్యవస్థ, నిజమైన ప్రజా రాజకీయ వ్యవస్థ నిర్మాణమవుతుందనీ స్పష్టం చేయాలి.



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు.
'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్

(ఉ.10 నుంచి సా. 6 గం. వరకు) 040-66843495








- **మార్క్సిజం – కుల సమస్య** – ఒక పరిచయం – సి.పి.– సమత ప్రచురణ – 62 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : సమత ప్రచురణలు, డోర్ నెం. 26–14–164, రఘురామ్‌నగర్, నగరంపాలెం, గుంటూరు – 4
- **విద్యా విజ్ఞానం** – వ్యాస సంకలనం – సమన్వయకర్త : కె.ఎన్. రావు – ప్రగతి ప్రచురణలు, 48 పేజీలు, 1/8 డెమీ, రు. 18, ప్రతులకు : కె.ఎన్. రావు, ప్రగతి మెస్ పై అంతస్తులో, సుభాష్‌నగర్, నిజామాబాద్. సెల్ : 9912980686
- **యుద్ధం అనివార్యమైనచోట** – కవిత్వం – కె. బాబ్జీ – విప్లవ రచయితల సంఘం – 32 పేజీలు, 1/8 డెమీ, రు. 45, ప్రతులకు: కె. మోహన కుమారి, ఉదయ్ నిలయం, బి.వి. పల్లె, పనపాకం, చంద్రగిరి మం., చిత్తూరు – 517502; ఫోన్ : 08585–276850, సెల్ : 9966853375, email : babjik@yahoo.com
- **పెల్లుబుకుతున్న కోరాపుట్ ప్రాంత ఆదివాసీ ఉద్యమంపై పెత్తందార్ల, ఆరాచకవాదుల, ప్రభుత్వాల ముప్పేట దాడులు** – ఎస్. ఝాన్సి, – సి.పి.ఐ. (ఎం.ఎల్.) ప్రచురణ – 36 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : మైత్రీ బుక్ హౌస్, జలీల్ వీధి, కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ – 2
- **మార్క్సిజం – దాని సారమూ పునాదులు** – థియొడోర్ ఒయ్‌జెర్మన్ – లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణ, 71 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, డి. రాధాకృష్ణమూర్తి, ఇ.నెం. 5–85–4/బి, పండరీపురం, 1వ లైను, గుంటూరు – 522002; ఫోన్ : 9985377760; విశాలాంధ్ర బుక్ హౌస్, ప్రజాశక్తి బుక్ హౌస్, మైత్రి, దిశ, సహచర, నవయుగ, మణి బుక్‌స్టాల్స్
- **ప్రత్యేక తెలంగాణ** – ఉద్యమ కెరటం – జీవన్ – ప్రతిభా ప్రచురణలు, 90 పేజీలు, 1/8 డెమీ, రు.50, ప్రతులకు : జీవన్, ప్రతిభ ప్రచురణలు, ఇ.నెం. 4–1–25, రోటరీనగర్, ఖమ్మం – 507002, సెల్ : 9948908230, email : jeevantelugu@gmail.com
- **పని సమస్యలు** – వాసిరెడ్డి భాస్కరరావు – ప్రజాహిత ప్రచురణలు – 76 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : ప్రజాహిత ప్రచరుణలు, 1–7–454, రెవెన్యూ కాలనీ, సుబేదారి, హనుమకొండ – 506001; ఫోన్ : 0870–2431361, సెల్ : 9390101251, email : bhaskararaovasireddy@yahoo.com; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, నవోదయ, బుక్‌బర్డ్
- **సమాజం – టీవీ సంస్కృతి** – విరసం ఆవిర్భావ దినోత్సవం సందర్భంగా (4, జూలై, 2010) కాకరాల – విప్లవ రచయితల సంఘం నెల్లూరు జిల్లా ప్రచురణ, 11 పేజీలు, 1/8 డెమీ, రు. 3, ప్రతులకు : వి. చెంచయ్య, సాహితీ నిలయం, 10–40–15ఎ/1, జనతాపేట్ నార్త్, కావలి, శ్రీ పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా – 524201, ఫోన్ : 08626–242277, సెల్ : 9440638035
- **తెలంగాణ ఉరుములు – మెరుపులు** – సంపాదకులు : డా. వి. వీరాచారి – వరంగల్లు రచయితల ఐక్య వేదిక– 98 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : డా. వి. వీరాచారి, కన్వీనర్, వరంగల్ రైటర్స్ యునైటెడ్ ఫోరం, 3–83, శ్రీ వెంకటేశ్వర కాలనీ, గోపాలపురం మం. హనుమకొండ, వరంగల్ – 506015
- **భారత రాజ్యాంగం, రాజకీయ వ్యవస్థ** – బి. కృష్ణారెడ్డి, ఎస్. రమాదేవి– 488 పేజీలు, 1/5 క్రౌన్, రు. 200, ప్రతులకు : జి.బి.కె. పబ్లికేషన్స్, ఇ.నెం. 12–2–506/1, ఫ్లాట్ నెం. 203, విండ్సర్ కాసల్, గుడిమల్కాపూర్, మెహదీపట్నం, హైదరాబాద్ – 500 028 సెల్ : 9849434647, 9959361278








వీక్షణం రెగ్యులర్‌గా చదువుతున్నా. అందులో వివిధ అంశాలపై వస్తున్న వ్యాసాలు చాలా ఎడ్యుకేటివ్‌గా ఉంటున్నాయి. అంతేగాకుండా మరెక్కడా ప్రచురితం కాని (తెలుగులో) వ్యాసాల్ని అనువదించి వీక్షణంలో ప్రచురించినందుకు నా ధన్యవాదాల్ని తెలియజేస్తున్నా. ముఖ్యంగా మార్క్స్ కాపిటల్‌పై వ్యాసాలు, ఆజాద్ రాసిన వ్యాసాలు బాగున్నాయి.

**– సి. పటేల్**
గుంటూరు

డా. జి. లచ్చయ్య 'ఆత్మహత్యల్ని ఆపలేమా?' వీక్షణం, సెప్టెంబర్ 2010 తెలంగాణా ఉద్యమం మీద ఆలోచింపజేసే వ్యాసం రాశారు. నిజానికి విడిపోవడం వల్ల ఏర్పడేది తెలంగాణ కాదు, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రమే. తెలంగాణలో కొందరు సెక్రటరీ/డైరెక్టర్ స్థాయి ఉద్యోగులకు ప్రమోషన్‌లు రావచ్చు కాని కొత్తగా వచ్చే ఉద్యోగాలు తక్కువ. ఉద్యమానికి కారణాలుగా చూపుతున్న నీరు, ఉద్యోగాలు, భూమి గురించి కార్యక్రమం తెరాసకు గాని జెఏసిలకు గాని ఉన్నట్లు కనిపించదు.

ప్రత్యేక రాష్ట్రం వస్తే ప్రభుత్వ కాంట్రాక్టులు పొంది కోటీశ్వరుల జాబితాలో కొందరు స్థానిక నాయకులూ చేరుతారు. కింది స్థాయి అనుచరులు సిండికేట్లలో స్థానం పొందుతారు. కొందరు మధ్యతరగతి మేధావులు శాసనమండలిలోనో, రాజ్యసభలోనో పదవులు పొందవచ్చు. కాని ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతులు, నిరుద్యోగులు ఆత్మహత్యలు చేసుకుంటూనే ఉంటారు. ఏ పరిస్థితులు ఉద్యమానికి కారణమో వాటితో తలపడే కార్యక్రమం వైపు వామపక్ష సంస్థలైనా కదలాలి – అంటే లంచాల దగ్గర, కాలువల దగ్గర నిలిచిన సాగుదల పథకాలు పారదర్శకంగా పూర్తిచేయాలి. ఔట్‌సోర్సింగ్, ప్రైవేటీకరణ, ఓపెన్ కాస్ట్‌లు, ప్రత్యేక ఆర్థిక మండలాలు నిలిపివేయాలి. విత్తనాలు, ఎరువులు రైతులకు సకాలంలో అందే ప్రక్రియ చేపట్టాలి.

ఒక ప్రాంతానికి చెందిన వారంతా అంతర్గత విభేదాలు లేని ఒకే సమూహం (ఫోల్క్/వోల్క్) అనే ప్రచారం చేయడం, లేదా అటువంటి భావం ప్రోత్సహించడం జాతీయ దురహంకారులు, ఫాసిస్టులు చేసే పని. ఈ ప్రజాస్వామిక కోరికల వైపు ఆందోళన సాగితే, అటువంటి భావజాలంలోని బోలుతనం బయట పడుతుంది. విడిపోవడం వల్ల కొంతైనా న్యాయం జరుగుతుంది.

**కె. నరేంద్ర మోహన్**
మెల్‌బోర్న్, ఆస్ట్రేలియా

బెర్నార్డ్ డిమెల్లో 'ఏది సరైన భారత విప్లవ మార్గం' వ్యాసం నాకు చాలా సంతృప్తినిచ్చింది. బొంబాయి విద్యార్థి ఉద్యమంలోనో, సి.పి.డి.ఆర్.లోనో ఇరవై సంవత్సరాల కింద ఆయనను కలిసినట్టు గుర్తు. భారత విప్లవ మార్గాన్ని సంబంధించిన సీరియస్ విషయాలెన్నిటినో ఆయన ఈ వ్యాసంలో లేవనెత్తారు. ముఖ్యంగా, భారత బూర్జువా వర్గంలో సామ్రాజ్యవాద వ్యతిరేక సెక్షన్ ఉందా అని ఆయన వేసిన ప్రశ్న చాలా ముఖ్యమైనది. మన చిన్న పట్టణాలలో ఎదుగుతున్న వ్యాపారులు కూడా సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలతో సంబంధం పెట్టుకోవడానికి ఉత్సాహం చూపుతున్న వాస్తవం కనబడుతోంది. అలాంటి వారు దేశ భక్తియుత జాతీయ బూర్జువాగా ఎదగగలరా? ఈ వ్యాసం మీద చర్చ జరిగితే బాగుంటుంది.

**డా. ఎం.ఎఫ్. గోపీనాథ్**
ఖమ్మం

జాహిద్ రఫీక్ రాసిన 'కాశ్మీర్ – శాంతి కాముకుడి ఆగ్రహం' వ్యాసం బస్సు ప్రయాణంలో పూర్తి చేసి, గుండె బరువెక్కి చెబుతున్నాను. ఈ వ్యాసాన్ని ప్రచురించి వీక్షణం చాలా ఉపయోగకరమైన పనిచేసింది. దీన్ని కరపత్రంగా అచ్చు వేసి వీలయినంత ఎక్కువ మందికి పంచాలి. నా పరిధిలో అందరికీ ఇది చదవమని చెబుతున్నాను. కవి మిత్రుడు ఉదయమిత్ర ఈ వ్యాసం చదివి కన్నీటి పర్యంతమై మంచి కవిత రాశాడు. ఇంతగా కదిలించిన రచయిత జాహిద్ రఫీక్‌కు అభినందనలు.

**ఎం. రాఘవాచారి**
మహబూబ్‌నగర్

వీక్షణం సెప్టెంబర్ 2010 సంచిక బరువుగా, విలువైనదిగా అనిపించడానికి కారణం జాగ్రత్తగా ఆలోచిస్తే తెలిసింది ఈసారి సంచికలో నాలుగుకు పైగా వ్యాసాలు ఆయా ప్రాంతాల నుంచి రాసిన రచయితల తెలుగు అనువాదాలు ఇవ్వడమే అనిపించింది. మన తెలుగు వ్యాస రచయితలు సరిగ్గా రాయట్లేదని ఫిర్యాదు చేయడం లేదుగాని, విలువైన వ్యాసాలు ఏ భాషలోంచి అయినా తెలుగులో వచ్చినపుడు కచ్చితంగా ఆలోచన పెంచగలుగుతున్నాయని వీక్షణం తాజా సంచిక రుజువు చేసింది. ఇలాంటి వ్యాసాలు విరివిగా ప్రచురించాలని కోరుతున్నాను.

**దుప్పల రవికుమార్**
శ్రీకాకుళం

వీక్షణం సెప్టెంబర్ 2010 సంచికలో వచ్చిన 'తెలంగాణ ప్రత్యామ్నాయ రాజకీయాలు' పిట్టల రవిందర్ గారి వ్యాసం బాగుంది. ఉప ఎన్నికల ఫలితాలు రాష్ట్ర రాజకీయాల్లో, తెలంగాణ రాజకీయాల్లో ప్రకంపనలు సృష్టించాయని చెప్పక తప్పదు. పైకి ఎన్ని బీరాలు పలికినా, ఎంత మేకపోతు గాంభీర్యాన్ని ప్రదర్శించినా, తెలంగాణలో తెలుగుదేశం పార్టీకి మిగిలింది గత చరిత్రే అన్నది ఎవరు కాదనలేని వాస్తవం. ఉప ఎన్నికల ఫలితాల ముందు వరకు చంద్రబాబు నాయుడే మా నాయకుడు, ఆయన నాయకత్వంలోనే తెలంగాణ కోసం ఉద్యమిస్తామంటూ ఘంటాపథంగా చెప్పుకున్న తెలంగాణలోని తెలుగుదేశం సీనియర్ నాయకులు ఇప్పుడు డైలమాలో పడ్డారు. ఉప ఎన్నికల ఫలితాలు ఏకపక్షంగా రావడం, తమ పార్టీ తరఫున పోటీ చేసిన వారికి ఒక్కరికి కూడా డిపాజిట్ దక్కకపోవడంతో దేశం నేతలు ఖంగుతిన్నారు. ఫలితాలు చూసి కార్యకర్తలు కూడా డీలాపడిపోయారు. నవంబర్ ఉద్యమం తరువాత టి.ఆర్.ఎస్. ఎంత బలపడిందో టి.డి.పి. అంతగా దిగజారింది. దీనికి తోడు టి.ఆర్.ఎస్. అధ్యక్షులు కె. చంద్రశేఖరరావు తెలుగుదేశంనే టార్గెట్ చేసుకుని వలసల్ని ప్రోత్సహించడంతో పార్టీలోని నాయకులంతా వలస బాటపట్టారు. ప్రస్తుత ఎం.ఎల్.సి.లు, ఆ స్థాయి నాయకులు కొందరు తప్ప అందరూ పార్టీని వదిలేస్తుండడంతో పార్టీలో నియోజకవర్గాల వారిగా నాయకత్వ లోపం స్పష్టంగా కనిపిస్తోంది. వలసల్ని ఆపడానికి జిల్లాల వారీగా ఆ పార్టీ పెడుతున్న టెలికాన్ఫరెన్స్‌లు, సమావేశాలు కూడా పెద్దగా ఫలితాలను ఇవ్వడం లేదు. తెలంగాణ పై పార్టీకి స్పష్టమైన వైఖరి లేకపోవడం కూడా పార్టీకి భారీ నష్టాన్ని మిగులుస్తోంది. రానున్న మునిసిపాలిటీ, స్థానిక సంస్థల ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ అడ్రస్ లేకుండా పోయినా ఆశ్చర్యపోవాల్సిన అవసరం లేదు.

**డా. పులిగిల్ల నర్సింగ్‌రావు**
ముత్తాయికోట, మెదక్

వీక్షణంకు చందాలు, వీక్షణం పబ్లికేషన్ పుస్తకాల కోసం మీరు ఆన్‌లైన్ ద్వారా డబ్బులు కట్టడానికి వీలుగా
వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175**, ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

**వీక్షణం పత్రికను వెబ్ పేజీల్లో కూడా చూడవచ్చు!**
www.veekshanam.wordpress.com

మీ అభిప్రాయాలను, సూచనలను ఎప్పటికప్పుడు మాకు తెలియజేయండి!
తెలుగు సమాజం తన గురించి తాను చేసుకుంటున్న అన్వేషణలో మీరూ పాలుపంచుకోండి!

Email : veekshanam2003@gmail.com

## ఆజాద్‌ది దారుణ హత్య

మావోయిస్టు పార్టీ కేంద్ర అధికార ప్రతినిధి ఆజాద్, ఢిల్లీ జర్నలిస్టు హేమచంద్ర పాండేల ఎన్‌కౌంటర్ పచ్చి బూటకమని ప్రజాస్వామ్య హక్కుల సంస్థ సమన్వయ కమిటీ ఆరోపించింది. ఇదొక దారుణ హత్య అని, దీనిపై సుప్రీంకోర్టు సిట్టింగ్ లేదా రిటైర్డ్ న్యాయమూర్తితో విచారణ జరిపించాలని డిమాండ్ చేసింది. జాతీయ పౌరహక్కుల సంఘాల నాయకులతో కూడిన నిజనిర్ధారణ బృందం ఎన్‌కౌంటర్ జరిగిన ప్రాంతం పర్యటించి సేకరించిన వివరాలను ఆగస్ట్ 22న హైదరాబాద్‌లోని విలేకరుల సమావేశంలో వెల్లడించారు. ఈ సందర్భంగా జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ ప్రొఫెసర్ అమిత్ భాదురి, సుప్రీంకోర్టు సీనియర్ కౌన్సిల్ సభ్యులు ప్రశాంత్ భూషణ్‌లు మాట్లాడారు. ఈ సమావేశంలో ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి క్రాంతి చైతన్య, నాయకులు డి. సురేశ్ కుమార్, నిజనిర్ధారణ కమిటీ సభ్యులు కవితా శ్రీవాత్సవ్, గౌతం నవల్ఖా, ఒ.పి.డి.ఆర్. నాయకులు డి. వెంకటేశ్వర్లు పాల్గొన్నారు.

## రాష్ట్రానికి కొత్త డి.జి.పి.

రాష్ట్రానికి కొత్త డి.జి.పి.గా కె. అరవిందరావును నియమిస్తూ ఆగస్ట్ 31న రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీ అయ్యాయి. ఆయన గతంలో పది జిల్లాలకు ఎస్.పి.గా పనిచేశారు. స్పెషల్ ఇంటెలిజెన్స్ బ్రాంచ్ (ఎస్.ఐ.బి.)లో డి.ఐ.జి.గా పనిచేశారు. గ్రేహౌండ్స్‌కు నేతృత్వం వహించారు. నక్సలైట్లపై గత ఇరవైఏళ్లుగా కొనసాగుతున్న విధానాన్నే కొనసాగిస్తానని ఆయన తెలిపారు. అరవిందరావు స్వగ్రామం అనంతపురం జిల్లాలోని కమ్మవారి పల్లె.

## ఆనంద్‌కు అస్తిత్వ సమస్య

భారత్ చదరంగ క్రీడాకారుడు, నాలుగుసార్లు ప్రపంచ ఛాంపియన్ విశ్వనాథన్ ఆనంద్‌కు మాతృదేశంలో అవమానం ఎదురైంది. హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ గౌరవ డాక్టరేట్ వ్యవహారంలో కేంద్ర మానవ వనరుల శాఖ ఆనంద్ జాతీయతను ప్రశ్నించడం వివాదాస్పదం అయింది. దీంతో మనస్తాపం చెందిన ఆనంద్ పురస్కారం స్వీకరించడం ఇప్పట్లో సాధ్యపడదని స్పష్టం చేశారు. అంతర్జాతీయ గణిత మేధావుల సదస్సులో పాల్గొనేందుకు ఆగస్ట్ 24న ఆనంద్ హైదరాబాద్ విచ్చేసారు. ఈ పరిణామాల క్రమంలో డాక్టరేట్ ప్రదానానికి ఏర్పాట్లు చేసినా ఆనంద్ సున్నితంగా తిరస్కరించారు.

## తెలంగాణ లాయర్ల డిమాండ్లకు ఓకే!

ప్రభుత్వ న్యాయవాదుల నియామకాలలో తెలంగాణ వారికి 42 శాతం ప్రాతినిధ్యం కల్పించాలని కోరుతూ సెప్టెంబర్ 13 నుంచి ఆరు రోజుల పాటు కొనసాగిన లాయర్ల ఆందోళన మంత్రి వర్గ ఉపసంఘం లిఖిత పూర్వక హామీతో సెప్టెంబర్ 18న ముగిసింది. ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ, మహిళలకు లా ఆఫీసర్ల నియామకాలలో తగిన ప్రాతినిధ్యం కల్పిస్తామని, తద్వారా సమాజంలోని అన్ని వర్గాలు న్యాయం చేస్తామని కూడా స్పష్టం చేసింది.

## లానినా ప్రభావంతో వర్షాలు

ఈసారి రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలో సాధారణం కంటే రికార్డు స్థాయి వర్షపాతం నమోదయింది. ప్రాంతాల వారీగా చూస్తే – తెలంగాణ ప్రాంతంలో 26 శాతం, రాయలసీమలో 75 శాతం, కోస్తాంధ్రలో 47 శాతం ఎక్కువ వర్షపాతం నమోదయింది. జూన్ 1 నుంచి సెప్టెంబర్ 30 దాకా ఉన్న కాలాన్ని నైరుతి రుతుపవనాల సీజన్‌గా పరిగణిస్తారు. పసిఫిక్ మహా సముద్ర ఉపరితల ఉష్ణోగ్రతలు తగ్గడాన్ని 'లానినా' అంటారు. దీని వలన తేమ గాలులు వీస్తాయి. ఈ వర్షాల ఫలితంగా ఈసారి ఆహార ధాన్యాల ఉత్పత్తి 220 లక్షల టన్నులు దాటవచ్చునని అంచనాలు వేస్తున్నారు.

## గ్రూప్ -1 ను రద్దు చేయాలి!

తెలంగాణ ప్రాంతానికి గ్రూప్–1 పోస్టుల్లో 42 శాతం కేటాయించాలంటూ విద్యార్థుల ఆందోళన, తెలంగాణ బంద్ పిలుపుల నడుమ సెప్టెంబర్ 5న భారీ పోలీసు పహారాలో గ్రూప్–1 ప్రిలిమ్స్ పరీక్షలు జరిగాయి. 1.9 లక్షల మందికి అర్హత ఉండగా, 84 వేల మంది పరీక్షలకు హాజరయ్యారు. ప్రాంతాల వారీగా – ఆంధ్రలో 49.5 శాతం, రాయలసీమలో 49 శాతం, తెలంగాణలో 41.5 శాతం అభ్యర్థులు పరీక్షకు హాజరయ్యారు. ఈ సందర్భంగా ఉస్మానియా యూనివర్సిటీలో చోటు చేసుకున్న సంఘటనల క్రమంలో ఐదుగురు ఎం.పి.లతో సహా యాభై మంది విద్యార్థులపై ఒ.యు. పోలీసులు నాన్ బెయిలబుల్ కేసులు నమోదు చేశారు.

## యూరియా కొరత

రాష్ట్రంలో ఖరీఫ్ సాధారణ సాగు విస్తీర్ణం 78.23 లక్షల హెక్టార్లు కాగా, ఈసారి 82 లక్షల హెక్టార్లకు చేరింది. ఈ ఖరీఫ్‌లో 13.5 లక్షల టన్నుల యూరియాను పంపిణీ చేయాలని వ్యవసాయ శాఖ లక్ష్యంగా పెట్టుకుంది. కేంద్రం నుంచి అందాల్సిన కోటా సకాలంలో రాకపోవడంతో రైతులు రాష్ట్రవ్యాప్తంగా ఆందోళనలు చేస్తున్నారు. రోజుల తరబడి పడిగాపులు కాస్తున్నారు. చివరకు ప్రభుత్వ కార్యాలయాలపై దాడులకు, లూటీలకు దిగుతున్నారు. గతంలో లాగా యూరియా రవాణాకు ప్రభుత్వం చార్జీలు చెల్లించకపోవడం, వ్యాపారులు అక్రమంగా నిల్వచేసి నల్లబజారుకు, మిక్సర్ ప్లాంట్‌లకు తరలించడం కృత్రిమ కొరతకు కారణమవుతున్నాయి. వీ

## బిల్లా రమేష్ బాబు

ఏప్రిల్ 2008 నుంచి వీక్షణంలో అసహజ మరణాల సూచి – కృష్ణా జిల్లా రచయిత, మిత్రుడు బిల్లా రమేష్ బాబు సెప్టెంబర్ 2న విజయవాడలోని నాగార్జున హాస్పిటల్‌లో న్యూమోనియాతో చనిపోయారు. ఆయన సెప్టెంబర్ 18, 1966న ప్రకాశం జిల్లా టంగుటూరులో ఒక దళిత కుటుంబంలో బాలకోటయ్య, నవనీతమ్మ దంపతులకు మొదటి సంతానంగా జన్మించారు. హైస్కూలు, ఇంటర్మీడియెట్ లు టంగుటూరులో పూర్తి చేశారు. డిగ్రీ కావలిలో చదువుతున్న క్రమంలో ఆయనకు బి.ఎస్‌సి. (హార్టికల్చర్)లో సీటు రావడంతో 1985లో హైదరాబాద్ రాజేంద్రనగర్‌లోని ఆచార్య ఎన్.జి.రంగా విశ్వ విద్యాలయంలో చేరారు. చదువుకుంటున్న క్రమంలో విప్లవ రాజకీయాలపట్ల ఆకర్షితులై, విద్యార్థి ఉద్యమాలలో చాలా చురుకుగా పాల్గొన్నారు. అనేక కవితలు, గల్పికలు, వ్యాసాలు రాసారు. ఉపన్యాసాలు ఇచ్చారు. తానే స్వయంగా రాసి, దర్శకత్వం వహించి ర్యాగింగ్‌కు వ్యతిరేకంగా యూనివర్సిటీ లో ఒక నాటకాన్ని ప్రదర్శించారు. విద్యార్థుల సమస్యలపై చేపట్టిన అనేక ఉద్యమాలలో క్రియాశీలంగా పాల్గొన్నారు. కొన్ని కథలు కూడా రాశారు. 1993లో ఉద్యానవన శాఖలో హార్టికల్చర్ ఆఫీసర్ గా చేరారు. చనిపోయే ముందు కృష్ణా జిల్లాలోని నందిగామలో పనిచేస్తున్నారు. 2003లో ఆయన రెండు కిడ్నీలు చెడిపోవడంతో చెల్లెలు ఇచ్చిన కిడ్నీతో ఇప్పటిదాకా నెట్టు కొచ్చారు. గత రెండేళ్లుగా వారానికి రెండుసార్లు డయాలిసిస్‌పై ఆధారపడి ఉన్నారు. ఆయనకు భార్య, కుమారుడు ఉన్నారు.

ఎ.పి.పి.ఎస్.సి. నియామకాలలో ఏళ్ల తరబడి కొనసాగుతున్న అవినీతి, కోస్తాంధ్ర, రాయలసీమ అగ్రకుల పక్షపాతాలను ఆధారాలతో వివరిస్తున్నారు **శ్రీధరరావు దేశ్‌పాండే**

# అక్రమాల పుట్ట ఎ.పి.పి.ఎస్.సి.

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్‌కు వెంకట్రామిరెడ్డి ఛైర్మన్‌గా నియమితులైన తర్వాత కమిషన్ నిర్వహించిన పరీక్షల్లో, ఇంటర్వ్యూలలో, అభ్యర్థులకు కేటాయించిన పోస్టులలో తీవ్రమైన అవకతవకలు, అక్రమాలు జరిగినట్లుగా ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. పార్లమెంట్ చట్టం ద్వారా ఏర్పాటు అయిన ఎ.పి.పి.ఎస్.సి. స్వతంత్రంగా, నిష్పక్షపాతంగా, రాగద్వేషాలకు, కుల మతాలకు అతీతంగా పరీక్షలు నిర్వహించి నియామకాలు జరపాలి. ఎ.పి.పి.ఎస్.సి.లో జరుగుతున్న నియామకాలలో అవకతవకలు, అక్రమాలు ప్రాంతీయ, కుల పక్షపాతం స్పష్టమవుతున్నకొద్దీ ఎ.పి.పి.ఎస్.సి.పై ప్రజలకు విశ్వాసం తగ్గిపోతున్నది. వెంకట్రామిరెడ్డి హయాంలో ఇది పరాకాష్టకు చేరుకున్నట్లు సాక్ష్యాధారాలు నిరూపిస్తున్నాయి. ఛైర్మన్‌పై ఆరోపణలు వెల్లువెత్తుతున్నాయి. ఆయనపై విచారణ జరపాలని అయిదారు నెలలుగా విద్యార్థులు, బి.సి. సంఘాలు, రాజకీయపక్షాలు డిమాండ్ చేస్తూనే ఉన్నాయి. ఫిర్యాదు భారత రాష్ట్రపతికి కూడా చేరింది. రాష్ట్రపతి నుండి విచారణకు ఆదేశాలు రాష్ట్ర ప్రభుత్వానికి చేరిన తర్వాత గానీ ప్రభుత్వం కదలలేదు. విచారణకైతే ఉత్తర్వులు జారీ చేసింది గానీ అందులో అవకతవకలకు, అక్రమాలకు పాల్పడిన ఉద్యోగులపై విచారణకు ఆదేశించిందే తప్ప ఆరోపణలు ఎదుర్కొంటున్న ఛైర్మన్‌పై విచారణకు ఆదేశాలివ్వలేదు. ఇంత తీవ్రమైన ఆరోపణలు వస్తున్నా రాజీనామా చేసి తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకునే బదులు పదవిని అంటిపెట్టుకుని అపఖ్యాతిని మూటగట్టుకుంటున్నాడు. ఎ.పి.పి.ఎస్.సి. చరిత్రలో ఇంతగా అవినీతి ఆరోపణలు ఎదుర్కొన్న ఛైర్మన్ మరొకరు లేరు. ఇతని హయాంలో ఎ.పి.పి.ఎస్.సి.కి పట్టిన మలినం మరొకరి హయాంలో కానరాదు.

వెంకట్రామిరెడ్డి ప్రాంతీయ పక్షపాతం, కులాభిమానం ఎంతటిదో ఇటీవలే సాక్ష్యాధారాలు బయటికి వచ్చినాయి. సమాచార హక్కు చట్టం కింద విద్యార్థులు సేకరించిన సమాచారం చూసి విశ్లేషకులు విస్మయం చెందుతున్నారు. ఎటువంటి పక్షపాతాలకు లోనుకాకుండా ప్రతిభావంతులను ఎంపికి చేయాల్సిన ఎ.పి.పి.ఎస్.సి. ప్రాంతీయ వివక్షకు, కుల పక్షపాతానికి పాల్పడిందని బయటపడిన ఆధారాలు రుజువు చేస్తున్నాయి.

గ్రూప్-1, గ్రూప్-2 లాంటి ఉన్నతస్థాయి ఉద్యోగాల నియామకాలు మూడంచెల పద్ధతిలో జరుగుతాయి. ప్రిలిమినరీ, మెయిన్స్, ఇంటర్వ్యూలు జరిపి వివిధ క్యాటగరీ పోస్టులకు అభ్యర్థులను ఎంపిక చేస్తారు. ఇవన్నీ రాష్ట్రస్థాయి పోస్టులు గనుక రాష్ట్రపతి ఉత్తర్వుల ప్రకారం స్థానిక రిజర్వేషన్‌లు వర్తించవు. రాత పరీక్షల్లో మార్కులు అందరికీ మొదటే ఎరుకైతాయి. ఎవరి ర్యాంకులు ఎంతో తెలుస్తుంది. అయితే ఇంటర్వ్యూలో ఎవరికి ఎన్ని మార్కులు వెయ్యాలో బోర్డు ఛైర్మన్ ఇష్టాయిష్టాలపై ఆధారపడి ఉంటుంది. రాత పరీక్షలో తక్కువ వచ్చినా ఇంటర్వ్యూలో అత్యధిక మార్కులు వేసి ఎంపికకు అర్హులను చెయ్యడం, కీలక పోస్టులకు ఎంపిక చెయ్యడం క్రితం సారీ గ్రూప్-1 ఎంపికలో జరిగినట్లు స్పష్టంగా రుజువైంది. సీమాంధ్ర ప్రాంతానికి చెందిన అభ్యర్థులకు ముఖ్యంగా రెడ్డి వర్గానికి చెందిన అభ్యర్థులకు ఇంటర్వ్యూలో అత్యధిక మార్కులు వేసి వారిని ఉద్యోగాలకు అర్హులను చేయడమే గాదు ఆర్.డి.ఒ., డిప్యూటీ కలెక్టర్, డి.ఎస్.పి. లాంటి కీలక పోస్టులకు ఎంపిక చేశారు. తెలంగాణ ప్రాంతానికి చెందిన అభ్యర్థులు రాతపరీక్షలో ఎక్కువ మార్కులు పొంది కూడా ఇంటర్వ్యూల్లో అతి తక్కువ మార్కులు వేయడం వల్ల ఉద్యోగావకాశాలు కోల్పోయారు. కీలక పోస్టులకు ఎంపిక కాలేకపోయారు. ఈ వివక్ష కారణంగా ఒక ప్రాంతానికి చెందిన ఒక సామాజికవర్గానికి చెందిన అభ్యర్థులు కీలకపోస్టులకు ఎంపికవుతున్నారు.

ఎ.పి.పి.ఎస్.సి. సెక్రటరీ ఎం.జి. గోపాల్ సమాచార హక్కు చట్టం కింద ఇచ్చిన సమాచారాన్ని పట్టికలలో చూడవచ్చు. ఇవి క్రితం సారి నిర్వహించిన గ్రూప్-1 ఉద్యోగాల ఎంపికకు సంబంధించినవి.

పట్టికలను పరిశీలిస్తే రాతపరీక్షలో 601 మార్కులు పొందిన అభ్యర్థి కంటే తక్కువ మార్కులు పొందిన అభ్యర్థి ఇంటర్వ్యూలో ఎక్కువ మార్కులు పొంది డిప్యూటి కలెక్టర్ కాగా, 610 మార్కులు పొందిన అభ్యర్థికి ఆ పదవి దక్కకపోవడం ఎంత విచిత్రం! రాతపరీక్షలో 678 మార్కులతో రెండో ర్యాంకులో ఉన్న తెలంగాణ బి.సి.-బి అభ్యర్థి

| క్ర.సం. | అభ్యర్థి పేరు | కులం | రాతపరీక్ష మార్కులు (900కు) | ఇంటర్వ్యూలో మార్కులు (90కి) |
|---|---|---|---|---|
| 1 | శివలింగయ్య | బి.సి.-బి | 687 | 32 |
| 2 | చంద్రశేఖర్ గౌడ్ | బి.సి.-బి | 678 | 28 |
| 3 | హరిత మంద్రాతి | బి.సి.-బి | 613 | 21 |
| 4 | గంగాధర్ | బి.సి.-డి | 649 | 21 |
| 5 | కె. రాజేశ్వరరావు | బి.సి.-డి | 628 | 21 |
| 6 | యాదగిరి రావు | బి.సి.-డి | 621 | 36 |
| 7 | సమైజన్ రావు | ఎస్.సి.-సి | 616 | 13.5 |
| 8 | ఎం. రేవతీదేదివ్య | బి.సి.-డి | 601 | 32 |

| క్ర.సం. | అభ్యర్థి పేరు | కులం | రాతపరీక్ష మార్కులు (900కు) | ఇంటర్వ్యూలో మార్కులు (90కి) |
|---|---|---|---|---|
| 1 | రాఘుస్వాతిరెడ్డి | ఒ.సి. | 535 | 88 |
| 2 | ఎం. రవికిరణ్ రెడ్డి | ఒ.సి. | 570 | 82 |
| 3 | వాసుదేవ పద్మజారెడ్డి | ఒ.సి. | 564 | 87 |
| 4 | జి. వాణిరెడ్డి | ఒ.సి. | 553 | 82 |
| 5 | కె. నాగేశ్వరరెడ్డి | ఒ.సి. | 564 | 87 |
| 6 | వేణుమాధవ్ రెడ్డి | ఒ.సి. | 565 | 81.5 |
| 7 | జి. మధుసూదన్‌రెడ్డి | ఒ.సి. | 588 | 87 |
| 8 | రాంసుందర్‌రెడ్డి | ఒ.సి. | 583 | 81 |
| 9 | ఎం. గౌతం రెడ్డి | ఒ.సి. | 588 | 85 |

ఇంటర్వ్యూలో 28 మార్కులే పొందడం వల్ల డిప్యూటి కలెక్టర్ పదవి చేజారింది. రాతపరీక్షలో 600ల లోపూనే ఉన్న సీమాంధ్ర రెడ్డి అభ్యర్థులు 90కి 85 మార్కులు పొందడం కుల పక్షపాతానికి, ప్రాంతీయ పక్షపాతానికి నిదర్శనం కాదా?

ఛైర్మన్ వెంకట్రామిరెడ్డిపై ఉస్మానియా విద్యార్థులు, బి.సి. సంఘాలు ఎప్పట్నుంచో ఆరోపణలు చేస్తున్నారు. ప్రభుత్వానికి చీమ కుట్టినట్లు కూడా లేదు. ఎ.పి.పి.ఎస్.సి.లో పేరుకుపోతున్న అవినీతి అక్రమాలను నియంత్రించే ఏ ప్రయత్నమూ జరగలేదు. అందుకే తెలంగాణ విద్యార్థులకు ఎ.పి.పి.ఎస్.సి.పై విశ్వాసం సడలింది. కాబట్టి గ్రూప్-1 పరీక్ష జరపడానికి ముందు మూడు డిమాండ్లు తేల్చాలని పట్టుబట్టారు.

1. గ్రూప్-1 పోస్టుల్లో తెలంగాణకు 42 శాతం వాటా ప్రకటించాలి.
2. రూల్ ఆఫ్ రిజర్వేషన్‌ను అమలు చెయ్యాలి.
3. ఛైర్మన్ వెంకట్రామిరెడ్డిని తొలగించాలి.

ఈ మూడు డిమాండ్లపై రాష్ట్రంలో విస్తృతమైన చర్చ జరిగింది. ఈ డిమాండ్లపై రాష్ట్రం నిట్టనిలువుగా చీలిపోయింది. తెలంగాణ ప్రాంతం డిమాండ్లకు మద్దతుగా నిలబడితే, సీమాంధ్ర ప్రాంతం డిమాండ్లకు వ్యతిరేకంగానే కాదు అవినీతిపరుడైన వెంకట్రామిరెడ్డి వెనుక నిలబడింది.

గ్రూప్-1 పోస్టులు రాష్ట్రస్థాయి పోస్టులు కనుక రాష్ట్రపతి ఉత్తర్వుల ప్రకారం వాటికి స్థానిక రిజర్వేషన్‌లు కల్పించడం సాధ్యం కాదని సీమాంధ్రుల వాదన. నిజమే. రాష్ట్రపతి ఉత్తర్వుల్లో మినహాయింపులను సాకుగా చేసుకొని సెక్రటేరియట్, డైరెక్టరేట్ల కమిషనరేట్లు, రాష్ట్రస్థాయి కార్యాలయాలు, పబ్లిక్‌రంగ సంస్థల్లో తెలంగాణకు చోటు దక్కకుండా చేసి పరిపాలనా యంత్రాంగాన్ని తమ గుప్పిట్లో పెట్టుకోవడం అబద్ధమా? ఆర్టికల్ 371 (డి) పేర్కొన్న సమన్యాయం ఎందుకు విలువలేనిదయింది? ఆర్టికల్ 371 (డి) ఆధారంగానే రాష్ట్రపతి ఉత్తర్వులు జారీ అయ్యాయన్న సంగతి వారికి ఎరుకేనా? రాష్ట్రపతి ఉత్తర్వులకు ఆధారభూతమైన ఆర్టికల్ 371 (డి) ఏది చెబుతుందో తెల్సుకోవాల్సిన అవసరం ఉంది.

**ఆర్టికల్ 371 డి : ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి చెందిన ప్రత్యేక అంశములు**

*'ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి సంబంధించి ఆ రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో ఉండు ప్రజలకు ప్రభుత్వోద్యోగాలలో, విద్యావకాశంల లోనూ సమతుల్యంగా న్యాయమైన ఏర్పాటు చేయు నిమిత్తం రాష్ట్రావసరాలను దృష్టిలో ఉంచుకొని రాష్ట్రపతి ఆదేశములను ఇవ్వవచ్చును. ఆ ఆదేశాములలోని నిబంధనలు రాష్ట్రమంతటికీ వర్తించు విధంగా లేక వివిధ ప్రాంతాలకు వేరు వేరు విధాలుగా వర్తించునట్లు ఉండవచ్చు.'*

ప్రభుత్వ ఉద్యోగాలలో, విద్యారంగంలో అన్ని ప్రాంతాల వారికి సమాన అవకాశాలు ఉండే విధంగా ఉత్తర్వులు జారీ చేయడానికి రాష్ట్రపతికి అధికారాలు ఈ ఆర్టికల్ ద్వారా దఖలు అయినాయి. దీని ఆధారంగానే రాష్ట్రపతి ఉత్తర్వులు జారీ అయినాయి. ఈ ఉత్తర్వులు జారీ చేసింది రాష్ట్రపతే అయినా ముసాయిదా ఉత్తర్వులను తయారు చేసి కేంద్రానికి పంపింది రాష్ట్ర ప్రభుత్వమే. వాటిని తయారు చేసింది సీమాంధ్రుల ఆధిపత్యంలో ఉన్న రాష్ట్ర సచివాలయం. కింది స్థాయి ఉద్యోగాలకు స్థానిక రిజర్వేషన్‌లు కల్పించినప్పటికీ నిర్ణయాధికారం కలిగిన కీలక పదవులను స్థానిక రిజర్వేషన్ల నుండి మినహాయించారు. అంటే రాష్ట్రస్థాయిని కల్పించి వాటిని స్థానిక రిజర్వేషన్ల నుండి మినహాయించినారు. అట్లనే రాష్ట్ర అధికార కేంద్రాలయిన సచివాలయం, కమిషనరేట్లు, డైరెక్టరేట్లు, రాష్ట్రస్థాయి కార్యాలయాలు, ప్రత్యేక కార్యాలయాలు, భారీ నీటిపారుదల ప్రాజెక్టులు, హైదరాబాద్ సిటీ పోలీసు చట్టం కింద నియమితులైన పోలీసు ఉద్యోగులను స్థానిక రిజర్వేషన్ల నుండి మినహాయించారు. ఈ మినహాయింపునే సాకుగా చేసుకొని ఆర్టికల్ 371 (డి) స్ఫూర్తిని గంగలో కలిపి పై కార్యాలయా లన్నింటిలో 90 శాతం సీమాంధ్రులే చొరబడినారు. ఎ.పి.పి.ఎస్.సి. ఎంపిక చేస్తున్న రాష్ట్రస్థాయి పోస్టులైన గ్రూప్-1, 2 లలో కీలక పదవులను సీమాంధ్రులే తన్నుకుపోతున్నారు.

పోనీ రాష్ట్రపతి ఉత్తర్వులనైనా సక్కగా అమలు చేసిన్రా అంటే అదీ లేదు. 1975లో రాష్ట్రపతి ఉత్తర్వులు వెలువడిన నాటి నుండి ఉల్లంఘనల పర్వం మొదలయింది. ఉల్లంఘనలు జరిగినాయని అంగీకరించిన ప్రభుత్వం 1985లో 610 జి.ఒ.ను జారీచేసింది. అదీ అమలు కాలేదు. 2004లో గిర్‌గ్లానీ కమిషన్ ఈ ఉల్లంఘనలు ఎట్లా జరిగినాయో 750 పేజీల తన రిపోర్ట్‌లో పూసగుచ్చినట్లు చెప్పుకొచ్చిందు. 2001లో ఏర్పాటైన రేవూరి ప్రకాశ్‌రెడ్డి అధ్యక్షతన శాసనసభా సంఘం, 2004లో ఏర్పాటైన ఉత్తంకుమార్ రెడ్డి అధ్యక్షతన శాసనసభా సంఘం అనేక ఉల్లంఘనల్ని నిర్ధారించి వీటిని సవరించినమని ఆదేశాలిచ్చింది. ఫలితం శూన్యం. గిర్‌గ్లానీ నిర్ధారణల్లో కొన్ని ముఖ్యమైనవి :

- 51 శాఖాధిపతుల కార్యాలయాలను కాలక్రమంగా 204 సంఖ్యకు పెంచారు.
- జిల్లా స్థాయి పోస్టులను జోనల్ పోస్టులుగానూ, జోనల్ స్థాయి పోస్టులను రాష్ట్రస్థాయి పోస్టులుగానూ మార్చారు. దీనివల్ల స్థానికులకు అన్యాయం జరిగింది.
- జోనల్ స్థాయి ఆఫీసులను రాష్ట్రస్థాయికి పెంచి స్థానిక రిజర్వేషన్‌లు లేకుండా చేశారు.
- అంతర్ జిల్లా, అంతర్‌జోన్ ట్రాన్స్‌ఫర్లు, డిప్యూటేషన్లను విచ్చలవిడిగా అనుమతించారు.
- అనేక నాన్‌గెజిటెడ్ పోస్టులను గెజిటెడ్ పోస్టులుగా మార్చి స్థానిక రిజర్వేషన్‌లను తగ్గించారు.

- రాష్ట్రపతి ఉత్తర్వుల్లో లేని ఏడవ జోన్‌ని, లేదా ఫ్రీజోన్‌ని సృష్టించి హైదరాబాద్ నగరంలో సీమాంధ్రులను దింపారు. స్థానిక సంస్థలైన జి.ఎచ్.ఎం.సి., ఎచ్.ఎం.డి.ఎ., ఎచ్.ఎం.డబ్ల్యు.డబ్ల్యు.ఎస్.బి. మొదలైన వాటిని ఫ్రీజోన్ పేరిట సీమాంధ్రులను దిగబెట్టినారు.
- 20 శాతం, 30 శాతం, 40 శాతం కోటాను ఓపెన్ మెరిట్‌గా పరిగణించాల్సి ఉన్నప్పటికీ వాటిని నాన్‌లోకల్ కోటాగా పరిగణించి తెలంగాణ జిల్లాలలో, జోన్‌లలో సీమాంధ్రులను నియమించారు.
- బ్యాక్‌లాగ్ పోస్టుల్లో వంద శాతం స్థానికులకే ఇవ్వాల్సి ఉండగా తిరిగి వాటిని లోకల్, నాన్‌లోకల్‌గా వర్గీకరించి నియామకాలు జరిపారు. ఇవి ముఖ్యమైన ఉల్లంఘనలు.

ఇక్కడ గమనించవలసిన విషయం ఏమిటంటే, శాఖాధిపతులు సంఖ్యను పెంచినపుడు, పోస్టుల, కార్యాలయాల స్థాయిని పెంచినపుడు, ఫ్రీజోన్‌ని, ఏడవజోన్‌ని సృష్టించినపుడు రాష్ట్రపతి అనుమతి తీసుకోలేదు. ప్రభుత్వ ఉత్తర్వుల ద్వారానే ఈ మార్పులన్నీ జరిగిపోయినవి. ఇది రాజ్యాంగ ఉల్లంఘనగానే గిర్‌గ్లానీ అభిప్రాయపడినాడు. ఇవ్వాళ, గ్రూప్-1లో 42 శాతం వాటా ఇవ్వడం కుదరదు, రాష్ట్ర ఉత్తర్వులకు విరుద్ధం అంటున్న లగడపాటి, రాయపాటి, మేకపాటి లాంటి ఘనా'పాటీ'లు, నన్నపనేని, దేవినేని, చలసాని లాంటి సీమాంధ్ర 'నేనీ'లు ఏ ఉత్తర్వుల ఆధారంగా ప్రభుత్వం పైన పేర్కొన్నటువంటి మార్పులు చేస్తూ జి.ఒ.లు జారీ చేసిందో చెప్పగలరా? 56 ఏండ్ల సమైక్యాంధ్ర రాష్ట్రంలో ఒప్పందాలను ఉత్తర్వులను, జి.ఒ.లను, కమిటీల, కమిషన్ల సిఫారసులను తుంగలో తొక్కి ఇష్టారాజ్యంగా వ్యవహరించి, ఇపుడు రాజ్యాంగబద్ధ హక్కును అడుగుతుంటే, ఇన్నాళ్లు తుంగలో తొక్కిన రాష్ట్రపతి ఉత్తర్వులనే ఉటంకించడం ఎంతటి కుట్రరాజకీయం! గ్రూప్-1 తదితర నియామకాలన్నింటిలో 42 శాతం వాటా డిమాండ్ చెయ్యడం పూర్తిగా రాజ్యాంగబద్ధమే. రాష్ట్రపతి ఉత్తర్వులను సవరించి అయినా సమాన అవకాశాలను ప్రభుత్వం కల్పించవలసి ఉన్నది. అంత దాకా గ్రూప్-1 పరీక్షను రద్దు చెయ్యక తప్పదు.

ఈ సందర్భంలోనే రాష్ట్ర న్యాయశాఖ వ్యవస్థలో కూడా తెలంగాణకు జరుగుతున్న వివక్షను ప్రస్తావించుకోవాలి. 56 ఏండ్ల సమైక్య రాష్ట్రంలో ఇప్పటిదాకా అడ్వోకేట్ జనరల్ పోస్టులో - రాష్ట్ర పబ్లిక్ ప్రాసిక్యూటర్ పోస్టులో తెలంగాణ వ్యక్తిని నియమించలేదు. అదే విధంగా న్యాయవ్యవస్థలో వివిధ పదవుల నియామకాలలో కూడా తెలంగాణ న్యాయవాదులు వివక్షను అనుభవిస్తున్నారు. న్యాయ వ్యవస్థలో అవి ప్రభుత్వ పదవుల్లో తెలంగాణ న్యాయవాదులకు 42 శాతం వాటా ఇవ్వాలని రెండు దఫాలుగా పోరాటం జరిగింది. న్యాయం చేస్తామన్న ప్రభుత్వ లిఖితపూర్వక హామీతో వారు పోరాటాన్ని విరమించారు. విద్యార్థుల, అడ్వోకేట్ల పోరాటాన్ని స్ఫూర్తిగా తీసుకొని తెలంగాణ ఉద్యోగులు కూడా సచివాలయం, శాఖాధిపతులు, రాష్ట్రస్థాయి కార్యాలయాలు, పబ్లిక్ రంగ సంస్థల్లో కూడా తమకు 42 శాతం వాటా ఇవ్వాలన్న డిమాండ్‌తో పోరాటానికి సన్నద్ధమవుతున్నారు. ఇంతకు ముందే చెప్పుకున్నట్లు 42 శాతం వాటా ఇవ్వాలన్న డిమాండ్ రాజ్యాంగ బద్ధమైనదే.

ఇక మళ్లీ ఎ.పి.పి.ఎస్.సి. వ్యవహారం విషయానికి వస్తే, విద్యార్థుల రెండో డిమాండ్ 'రూల్ ఆఫ్ రిజర్వేషన్' ని ప్రిలిమనరీ, మెయిన్స్‌లో కూడా అమలుపర్చాలి. యు.పి.ఎస్.సి. ఈ విధానాన్నే అమలు చేస్తోంది. వెంకట్రామిరెడ్డి ఛైర్మన్‌గా రాక మునుపు కూడా రూల్ ఆఫ్ రిజర్వేషన్ అమలులో ఉండేది. ఆయన వచ్చాక ఏకపక్షంగా ప్రిలిమినరీ, మెయిన్స్‌లో రిజర్వేషన్లను రద్దు చేసి చివరి ఎంపికలో మాత్రమే పాటించే పద్ధతిని ప్రవేశపెట్టినాడు. ఇది రాజ్యాంగ విరుద్ధమని హైకోర్టులో కేసు వేస్తే హైకోర్టు కూడా రూల్ ఆఫ్ రిజర్వేషన్లను పాటించాలని ఎ.పి.పి.ఎస్.సి.ని ఆదేశించింది. విద్యార్థులు, బి.సి., ఎస్.సి., ఎస్.టి. సంఘాలు ఎంత మొత్తుకున్నా మితిమీరిన అహంభావం తో హైకోర్టు నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ సుప్రీంకోర్టులో అపీలుకు వెళ్లాడు. ఆ కేసు సుప్రీంకోర్టులో నలుగుతూ ఉండగానే మళ్లీ గ్రూప్-1 పరీక్షలు రానే వచ్చాయి. విద్యార్థులు తిరిగి ఆ డిమాండ్‌ని ఎ.పి.పి.ఎస్.సి. ముందు పెట్టవలసి వచ్చింది. ఫైనల్ సెలక్షన్లలో రూల్ ఆఫ్ రిజర్వేషన్లు అమలు చేస్తున్నపుడు. ప్రిలిమినరీ, మెయిన్స్‌లలో అమలు చేయకపోతే నష్టం ఏమిటి? అనే ప్రశ్న వస్తుంది. తెలంగాణ బి.సి., ఎస్.సి., ఎస్.టి.లకు తీవ్రంగా నష్టం వాటిల్లుతున్నదని గత గ్రూప్-1 సెలెక్షన్స్‌ని పరిశీలించినపుడు అర్థమైంది. వాటిని రద్దు చేయడంలోనే ఒక కుట్ర దాగి ఉన్నది. ప్రిలిమినరీ, మెయిన్స్‌లలో సాధ్యమైనంత ఎక్కువ మంది అగ్రకులాల వారిని ఇంటర్వ్యూ దశకు తీసుకువెళ్లడం - ప్రిలిమ్స్‌లో, మెయిన్స్‌లో సాధ్యమైనంత ఎక్కువ మంది బి.సి., ఎస్.సి., ఎస్.టి.లను ఇంటర్వ్యూ దశకు రాకుండా అడ్డుకోవడం ఈ కుట్రలో ఇమిడి ఉన్న రహస్యం. గత గ్రూప్-1 ఎంపిక లిస్టును పరిశీలిస్తే దారుణంగా నష్టపోయింది తెలంగాణ ప్రాంత బి.సి., ఎస్.సి., ఎస్.టి.లే నన్నది స్పష్టమైంది. అందుకే తెలంగాణ విద్యార్థులు 42 శాతం వాటాతో పాటూ రూల్ ఆఫ్ రిజర్వేషన్‌ని అమలు చేయమంటున్నారు. రెండు డిమాండ్లు రాజ్యాంగ బద్ధమైనవే. అయినా ఎ.పి.పి.ఎస్.సి. గానీ, ప్రభుత్వం గానీ పట్టించుకోకుండా జబర్‌దస్తీగా పోలీసు బూట్ల పహారాలో పరీక్షలు నిర్వహించడం సీమాంధ్రులకు సమంజసంగా తోచడం విస్మయం కలిగిస్తున్నది.

గ్రూప్-1 పరీక్షని వాయిదా వెయ్యమని, విద్యార్థుల డిమాండ్లని పరిశీలించమని తెలంగాణ ఉద్యమ సంస్థలతో పాటు తెలంగాణ ఎం.పి.లు, తెలంగాణ మంత్రులు ఎ.పి.పి.ఎస్.సి.కి, ముఖ్యమంత్రికి విజ్ఞప్తి చేసినారు. నా పరిధిలో లేని విషయం అని ముఖ్యమంత్రి తప్పించుకున్నాడు. మరోవైపు ప్రభుత్వం వాయిదా వెయ్యమని ఆదేశిస్తే వాయిదా వేస్తాం అని ఛైర్మన్ ప్రకటించాడు. ఇదంతా కూడబలుక్కొని చేసిన విషయంగా కనబడుతోంది. పరీక్ష ఎంత భయంకరమైన పరిస్థితుల్లో జరిగిందో అందరు చూసారు. తెలంగాణ అంతటా అప్రకటిత యుద్ధవాతావరణం. తెలంగాణలో బందు జరుగుతున్నది. వేలాది మంది విద్యార్థులు బందు కారణంగా హాజరు కాలేకపోయినారు. వేలాది మంది స్వచ్ఛందంగానే నిరసనగా పరీక్షను బహిష్కరించారు. ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులు గంటలోపల్నే పరీక్ష పేపర్‌ని బట్టబయలు చేసిన్రు. ఎ.పి.పి.ఎస్.సి. పరీక్షను రద్దు చేయాల్సింది పోయి లీకైన పరీక్ష కేంద్రంలోనే తిరిగి పరీక్ష నిర్వహిస్తామని, హాజరు కాలేని విద్యార్థులకు మరొక అవకాశం ఇస్తామని ప్రకటించింది. ఒకే సెలక్షన్‌కి రెండు పరీక్షలు నిర్వహించి విద్యార్థుల ప్రతిభను ఎట్లా మూల్యాంకనం చేస్తారు? ఇది సమంజసమేనా? శాస్త్రీయమేనా? ఇది మరీ

*ఇటీవల ప్రభుత్వం ప్రవేశపెట్టిన అణు నష్టపరిహార బిల్లు కూడా భోపాల్ తీర్పునకు కొనసాగింపుగా పాలకుల ప్రజా వ్యతిరేక ధోరణికి అద్దం పడుతుందని అంటున్నారు* **పి.వి. రమణ**

# అణు పరిహార బిల్లు ఎవరికోసం?

సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీల ప్రయోజనాలను కాపాడడమే ధ్యేయంగా, మన పాలకులు అణు నష్టపరిహార బిల్లును ముందుకు తెచ్చారు. అమెరికా అధ్యక్షుడు బారక్ ఒబామా నవంబర్‌లో మన దేశంలో పర్యటించబోతున్నాడు. గతంలో ఇచ్చిన హామీల ప్రకారం అతని రాకకు ముందే ఈ అణుబిల్లు కార్యక్రమాన్ని పూర్తిచేసి మన స్వామిభక్తి పరాయణతను, విధేయతను తెలియచేయాల్సిన అవసరం కూడా ఈ బిల్లును ఇంత హడావుడిగా తేవడానికి ప్రధాన కారణం.

దేశ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని 24 సార్లు చర్చలు జరిపి 18 సవరణలతో 'అణు నష్టపరిహార బిల్లు'ను ఆగస్ట్ 25న లోక్‌సభ లోనూ, 30న రాజ్యసభలోనూ ఆమోదించినట్లుగా ప్రకటించారు మన పాలకులు. నిజానికి దేశ సార్వభౌమత్వంపైనా, భారతదేశ ప్రజల జీవించే హక్కుపైనా ఎదురవ్వబోయే ప్రమాదం గురించి ఏ మాత్రం పరిగణనలోకి తీసుకోకుండా, చర్చలను చాలా తెలివిగా కేవలం నష్టపరిహారం గురించి, సరఫరాదారుల జవాబుదారీతనం గురించి పట్టించుకొన్నట్లు నటిస్తూ చివరకు విదేశీ కంపెనీలకు అనుకూలమైన అంశాలతోనే బిల్లును ఆమోదించారు.

ప్రపంచంలో నేటివరకు జరిగిన అనేక అణు ప్రమాదాలకు ఈ బహుళజాతి కంపెనీలు సరఫరా చేసిన లోపభూయిష్టమైన, నాణ్యతలేని అణు సామాగ్రియే కారణం. ధనిక దేశాలలో ప్రజల నిరసన కారణంగా మూసివేయబడిన, అమ్ముడుపోని అణు సామాగ్రిని మనలాంటి దేశాలకు అంటగట్టే కార్యక్రమానికి సహకరించడమే ఈ బిల్లు ధ్యేయం.

ఈ బిల్లు ఆమోద ఫలితంగా ఇంతవరకూ ఎంతో పురోగతి సాధించిన మన దేశీయ అణుశక్తి సాంకేతిక పరిజ్ఞానాన్ని పూర్తిగా భూస్థాపితం చేసి, సామ్రాజ్యవాద దేశాలకు చెందిన బహుళజాతి కంపెనీల అజమాయిషీలో అణు కార్యక్రమాలు నిర్వహించే పరిస్థితికి దారి సుగమం అయింది. అణు రియాక్టర్ల సప్లై కోసం ప్రపంచ వ్యాప్త టెండర్లను పిలవాల్సిన సాధారణ వ్యాపార పద్ధతుల్ని కూడా తుంగలో తొక్కి, మనకు అనుకూలమైన ధరలు, నాణ్యమైన అణు సామాగ్రిని ఎంచుకొనే అవకాశాన్ని మూసేసి, కేవలం 4 బహుళజాతి కంపెనీలయిన జి.ఇ., వెస్టింగ్ హౌస్, అరెవా, అటోమ్‌స్ట్రోమెక్స్ లకు ప్రత్యేకంగా కేటాయింపు జరిగింది. ఈ కంపెనీల సూచనల మేరకు ఏర్పాటు చేయబోయే అణువిద్యుత్ కేంద్రాల కోసం స్థలాలను సేకరించడం కూడా ప్రారంభించారు. ఈ కంపెనీలు ప్రస్తుతానికి 60 బిలియన్ డాలర్ల ఖర్చుతో 22 అణు రియాక్టర్ల నిర్మాణానికి పూనుకుంటున్నాయి. మన అణు పరిహార బిల్లు ద్వారా ఈ కంపెనీలకు ఎటువంటి రిస్కు లేకుండా మొత్తం కోట్లాది రూపాయల లాభాల పంటను హామీ కల్పించింది మన ప్రభుత్వం.

ఈ బిల్లు దేశీయంగా అణుసాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రమాదపు అంచులోకి నెడుతుందని అణుశక్తి బోర్డు మాజీ ఛైర్మన్ గోపాలకృష్ణన్ అన్నారు. ఏమాత్రం ప్రయోజనం లేని, అత్యంత ఖరీదైన అమెరికా, ఫ్రాన్స్ లైట్‌వాటర్ రియాక్టర్ల అమ్మకానికి ఈ చట్టం ద్వారాలు తెరుస్తుందన్నారు. మన దేశంలో గల అపారమైన థోరియం నిల్వల సహకారంతో అణువిద్యుత్ తయారు చేయగల రియాక్టర్లను మన శాస్త్రవేత్తలు ఇప్పటికే నిర్మించి ఉన్నారు. థోరియం ఆధారిత విద్యుత్ ప్లాంట్ నిర్మాణం ద్వారా మన విద్యుత్ కొరతను తీర్చుకోవడమే కాకుండా విదేశీ శక్తులపై ఆధారపడే దుస్థితి నుండి బయటపడతామన్నారు. మరో పదేళ్లలో పది వేల మెగావాట్ల విద్యుదుత్పాదకతా సామర్థ్యం కలిగిన భారీ జల రియాక్టర్ల తయారీ సామర్థ్యాన్ని భారతదేశం సంతరించు

---

చర్చనీయాంశం అయింది.

మూడో డిమాండ్ ఛైర్మన్ వెంకట్రామిరెడ్డి తొలగింపు. ప్రభుత్వానికి నియమించే అధికారం ఉంటుంది గానీ తొలగించే అధికారం లేదు. రాష్ట్రపతి మాత్రమే తొలగించగలడు. రాష్ట్రపతే స్వయంగా అతని మీద విచారణ జరిపించమని ఆదేశాలిచ్చారు. కానీ సీమాంధ్ర ప్రభుత్వానికి అస్మదీయుడు గనుక విచారణ ఎ.పి.పి.ఎస్.సి. ఉద్యోగులపై చేయిస్తున్నది. కనీసం ఛైర్మన్ వెంకట్రామిరెడ్డికీ, ప్రభుత్వానికీ జవాబుదారీ తనం లేదు. తన మీద ఇంతమంది ఇన్నిరకాల ఆరోపణలు చేస్తున్నా పదవికి అంటిపెట్టుకొని కూర్చోవడం అతనికి ఎంత అప్రతిష్ఠ! అప్రతిష్ఠని భరించడానికి సిద్ధమే కానీ పదవిని వదిలి ఎ.పి.పి.ఎస్.సి. ప్రతిష్ఠని పెంచేందుకు సిద్ధపడడం లేదు. ఇన్ని అవినీతి, అక్రమ ఆరోపణలు ఎదుర్కొంటున్న వ్యక్తిని రాజ్యాంగబద్ధ సంస్థకు ఛైర్మన్‌గా కొనసాగనివ్వడం ప్రభుత్వానికి ఎంతటి అప్రతిష్ఠ! ప్రభుత్వం అతన్ని రాజీనామా చెయ్యమని కోరవచ్చు, సెలవుపై వెళ్లమని కోరవచ్చు. చివరికి అతన్ని తొలగించమని గవర్నర్ ద్వారా రాష్ట్రపతిని కోరవచ్చు. అయితే రాష్ట్ర ప్రభుత్వం అప్రతిష్ఠని భరించడానికే సిద్ధంగా ఉండడం శోచనీయం.

*(రచయిత నీటి పారుదల శాఖలో ఇంజనీరు, తెలంగాణ రచయితల వేదిక నాయకులు)* వీ

కొంటుందని, అటువంటి దేశీయ పరిజ్ఞానాన్ని ఈ విదేశీ అణు సంస్థల ప్రవేశం నాశనం చేస్తుందని గోపాలకృష్ణన్ ఆవేదన వ్యక్తం చేశారు.

ప్రపంచమంతా ప్రమాదభరితమైన అణువిద్యుత్ కేంద్రాలను మూసివేస్తుంటే, వారికి అక్కరలేని, పనికిరాని అణు విద్యుత్ కేంద్రాలను మన దేశంలోకి ఆహ్వానించి దేశ ప్రజల ప్రాణాలకు ప్రమాదం ఏర్పడే నిర్ణయాన్ని తీసుకుంది మన భారత ప్రభుత్వం. 12 లక్షల టన్నుల యురేనియం నిల్వలతో ప్రపంచంలోనే అగ్రస్థానంలో ఉన్న ఆస్ట్రేలియాలో ఒక్క అణువిద్యుత్ కేంద్రం కూడా లేదు. అమెరికాలో గత ముప్పై సంవత్సరాలలో ఒక్క అణువిద్యుత్ కేంద్రం కూడా నిర్మాణం జరగలేదు. 1979లో అమెరికాలో 'త్రీ మైల్ ఐలాండ్' అణురియాక్టర్ ప్రమాదం జరిగిన తర్వాత, అక్కడ ప్రజల ఆందోళన తీవ్రతరమైన కారణంగా 58 అణు విద్యుత్ కేంద్రాల స్థాపనను నిలిపివేశారు. 2003లో తీవ్రమైన వడగాలుల కారణంగా ఫ్రాన్స్‌లోని 17 రియాక్టర్లను తాత్కాలికంగానూ, పూర్తిగానూ నిలిపివేసారు. సోవియట్ యూనియన్ నాలుగు కోట్ల డాలర్లు ఖర్చుపెట్టి సగం నిర్మించిన క్రాస్నోడర్ అణువిద్యుత్ కేంద్రాన్ని రద్దు చేసుకొంది. స్వీడన్‌లో అణు కేంద్రాలు ఉండాలా వద్దా అని ప్రజాభిప్రాయ సేకరణ జరిపి, 2010 నాటికి ఉన్న అణు విద్యుత్ కేంద్రాలన్నీ తొలగిస్తానని ప్రకటించింది. ఆస్ట్రియా అణువిద్యుత్‌ని నిషేధిస్తూ, నిర్మాణం పూర్తి అయిన జ్వెంటెన్‌డార్ఫ్ రియాక్టర్‌ను వినియోగించడం ఆపేసింది. ఇంగ్లండ్‌లో, పశ్చిమ జర్మనీలో, ఫిలిప్పైన్స్‌లో ప్రమాద భరితమైన ఈ అణు విద్యుత్ కేంద్రాలను మూసివేసారు.

విదేశీ మార్కెట్లలో బడా అణుశక్తి కంపెనీల సరుకు అమ్ముడుపోని పరిస్థితుల్లో ఐ.ఎం.ఎఫ్., ప్రపంచబ్యాంక్‌ల ద్వారా అప్పులిప్పించి మనలాంటి దేశాలకు బలవంతంగా అంటగట్టే కార్యక్రమానికి పూర్తి సహకారం అందిస్తుంది మన ప్రభుత్వం.

పార్లమెంట్‌లో బిల్లు ప్రవేశపెడుతూ అణు ప్రమాదాల గురించి మనం ఆందోళన చెందాల్సిన అవసరం లేదని, శాస్త్ర సాంకేతిక విషయాల సహాయ మంత్రి పృథ్వీరాజ్ చౌహాన్ ప్రకటించడం చాలా తీవ్రంగా ఖండించాల్సిన విషయం. ఇప్పటికే ప్రపంచవ్యాప్తంగా అనేక ప్రమాదాలు జరిగి ప్రజలు బలైన సంఘటనలు అనేకం ఉన్నాయి. 1957లో ఇంగ్లండ్‌లోని లివర్‌పూల్ ప్లుటోనియం ప్రొడక్షన్ రియాక్టర్‌లో అగ్ని ప్రమాదం జరిగి, ఆ చుట్టుపక్కల ఉన్న అనేక గ్రామాలకు అణుధార్మికత వ్యాపించింది. 1983లో సంభవించిన 39 కాన్సర్ కారక మరణాలు ఈ అణుధార్మికత ప్రభావ ఫలితమేనని భావిస్తున్నారు. 1961 జనవరిలో అమెరికాలో 'ఇడాహో' జలపాతం దగ్గర ఎక్స్‌పెరిమెంట్ రియాక్టర్ ప్రమాదకారణంగా ముగ్గురు చనిపోయారు. 1966 అక్టోబర్‌లో అమెరికాలోని డెట్రాయిట్‌లో ఎక్స్‌పెరిమెంటల్ బ్రీడర్ రియాక్టర్ తగలబడిపోయింది. 1969 జనవరిలో స్విట్జర్లాండ్ లోని 'లుసినిన్‌వాడ్'లో ఎక్స్‌పెరిమెంటల్ రియాక్టర్ ప్రమాదం జరిగింది. 1969లోనే ఫ్రాన్స్‌లో సెయింట్ లారెన్ గ్యాస్ కూల్డ్ పవర్ రియాక్టర్ పాక్షికంగా తగలబడిపోయింది. 1974లో సోవియట్ యూనియన్‌లో షెవ్‌చెంకోలోని బ్రీడర్ రియాక్టర్‌లో పేలుడు సంభవించింది. 1979 ఆగస్ట్‌లో అమెరికాలోని ఎర్విన్‌లో అతి రహస్యంగా నడుపుతున్న అణు ఇంధన కేంద్రంలోంచి శుద్ధి చేసిన యురేనియం బయటపడడంతో కనీసం వెయ్యిమంది ప్రజలు అణు ధార్మికతకు గురయి ఉంటారని అంచనా వేశారు. 1981లో జపాన్‌లోని 'సురుగా'లో రియాక్టర్ చెడిపోయి అణుధార్మికత వెలువడడంతో 45 మంది ఆ ప్రమాదానికి గురయ్యారు. 1986 ఏప్రిల్‌లో సోవియట్ యూనియన్ చెర్నోబిల్‌లో రియాక్టర్ తగలబడి పోవడంతో దాదాపు రెండు వేల మంది చనిపోయి ఉండవచ్చని ఒక అంచనా. అంతేకాదు, ఆ అణుధార్మిక ప్రభావం 950 మైళ్ల వరకు వ్యాపించి ఉందని తేలింది. ఆ పరిధిలోని ఆహార పదార్థాలు వాడకానికి పనికి రాకుండా పోయాయి. గడ్డికి అణు ధార్మికత సోకడం వలన పశువుల పాలు, మాంసాహారం కూడా పనికి రాకుండా పోయాయి. 1985లో ఆ ఒక్క సంవత్సరమే అమెరికాలో మొత్తం చిన్నవీ, పెద్దవీ కలిపి మూడు వేల ప్రమాదాలు జరిగాయి. 1972లో మన తారాపూర్ అణు విద్యుత్ కేంద్రంలో జరిగిన అణు ప్రమాదంలో ఇద్దరు ఇంజనీర్లు మరణించారు.

పై విషయాలు గమనిస్తే ఇప్పటివరకు జరిగిన అణు ప్రమాదాల సంఖ్య తక్కువేమీ కాదని అర్థమవుతోంది. అంతేకాదు, వాటిలో కొన్ని చోట్ల తక్షణ మరణాలు లేకపోయినా, తర్వాత కాలాలలో విపరీతంగా కాన్సర్ కారక మరణాలు సంభవించాయి. నేటికీ సంభవిస్తున్నాయి కూడా. ఈ ప్రమాదాలన్నీ అభివృద్ధి చెందిన దేశాల్లోనే జరిగాయి. అత్యున్నత స్థాయి సాంకేతిక పరిజ్ఞానం కలిగి ఉన్న అగ్రదేశాల్లోనే ప్రమాదాన్ని అరికట్టలేక పోయారని స్పష్టంగా అర్థమవుతోంది. భారతప్రభుత్వం అణు పరిహార బిల్లు ద్వారా మన దేశ ప్రజల జీవితాల్ని బలిగా పెడుతూ ప్రజల రక్షణ కోసమేనని బుకాయించడాన్ని తిప్పికొట్టాలి.

అణువిద్యుత్ కేంద్రాలలో ప్రమాదాలు జరిగితే ప్రజలు సులువుగా పరిహారాన్ని పొందడానికి అవకాశం, హక్కును కలిగించేదిగా ఉండాలి బిల్లు. అణు నష్టపరిహార పరిమితిని రు. 500 కోట్ల నుంచి రు. 1500 కోట్ల వరకు పెంచుతూ, బాధితులు పరిహారం కోరే గడువును పది సంవత్సరాల నుండి ఇరవై సంవత్సరాల వరకు పొడిగించామని గొప్పలు చెప్పుకుంది ప్రభుత్వం. కాని జపాన్‌లో ఇలాంటి ప్రమాదం జరిగితే 120 కోట్ల డాలర్లు (రు. 5500 కోట్లు) నష్టపరిహారం ఉంది. అమెరికాలో దాదాపు కోటి డాలర్లు (రు. 46 వేల కోట్లు).

మొన్న ఏప్రిల్‌లో జరిగిన అమెరికా గల్ఫ్ ఆఫ్ మెక్సికో ఆయిల్ రిగ్ ప్రమాదంలో అమెరికా అధ్యక్షుడు స్వయంగా బ్రిటిష్ పెట్రోలియం కంపెనీ చేత ఇరవై బిలియన్ డాలర్లు అంటే దాదాపు 92 వేల కోట్ల రూపాయలు వెంటనే జమ చేయించిన సంగతి గుర్తు చేసుకుంటే మన దేశ ప్రజల ప్రాణాల్ని ఎంత చవకగా సమర్పించబోతున్నారో అర్థం అవుతుంది.

భోపాల్ సంఘటన తర్వాత భారత ప్రజలు చేస్తున్న నష్టపరిహార డిమాండ్ అమెరికన్ పాలకులకు తీవ్రమైన తలనొప్పిని కలిగిస్తోంది. భవిష్యత్‌లో అలాంటి ప్రమాదాలు ఇంకా ఎక్కువ జరిగే అవకాశాలున్నా యన్న సంగతి వారికి తెలుసు. నష్టపరిహారాన్ని చెల్లించే అనవసర కార్యక్రమాన్ని తప్పించుకోవడానికి, అమెరికాలో అణుపరిహారానికి సంబంధించి కన్వెన్షన్ ఆన్ సబ్ కన్వెన్షన్ (సి.ఎస్.సి.) పేరుతో ఒక నియమావళిని రూపొందించి, భవిష్యత్‌లో భోపాల్ లాంటి ప్రమాదాలు జరిగితే అతి తక్కువ నష్టపరిహారం చెల్లించే విధానం అమలు చేస్తూ, అణు సరఫరా కంపెనీల రక్షణకు పూనుకొంది అమెరికా ప్రభుత్వం. అమెరికాతో అణు ఒప్పందం కుదుర్చుకున్న మన దేశ నేతలు సి.ఎస్.సి.

*కోట్లాది ప్రజల ఆకలి కడుపులు ఒకవైపు, పాలకుల నిర్లక్ష్య వైఖరితో కుళ్లిపోతున్న వేల టన్నుల ఆహార ధాన్యాలు మరోవైపు ఉన్నాయని అంటున్నారు* **డి.వి. రామకృష్ణారావు**

# కుళ్లిపోతున్న తిండి గింజలు

దేశంలో, రాష్ట్రంలో భూములూ, నదీ జలాలూ, వనరులూ అన్నీ ఉన్నా సామాన్య ప్రజలకు బుక్కెడు బువ్వ దొరకట్లేదు. జీవించే హక్కుతో సహా అనేక హక్కులు రాజ్యాంగంలో పొందుపర్చుకున్నా, చేతికి పని, కడుపుకి ముద్ద లేక అనేకమంది ఆకలి బాధను అనుభవిస్తున్నారు. 'మిగులు మనుషులు'గా మిగిలిపోతున్నారు.

మనుషులు వేట, ఆహార సేకరణ దశలు దాటి వ్యవసాయం జీవన విధానంగా మారాక స్థిరనివాసం ఏర్పర్చుకున్నారు. పండిన పంటను వ్యక్తిగత స్థాయిలో నిలువ చేసుకొనే పరిస్థితి నుంచి సామూహికంగా నిలువ చేసుకోవడంలోకి జీవన విధానం ఎదిగింది.

ఇవాళ్టి పరిస్థితిలో సన్న, చిన్నకారు రైతులు తమ పంటలో కొంత భాగాన్ని తమకోసం  నిలువ చేసుకొనే పరిస్థితి కూడా లేకుండా పోయింది. అది ఇంకో పార్శ్వం. వ్యవసాయం కోసం చేసిన అప్పులు, ఎప్పుడూ దొరకని గిట్టుబాటు ధరల మధ్య మన రైతాంగం పడుతున్న అవస్థలు మనకు తెలిసినవే.

వ్యవసాయం చేయడానికి అష్టకష్టాలు పడుతూ, గత పదిహేనేళ్లలో దేశవ్యాప్తంగా రెండు లక్షల మందికి పైగా రైతులు ఆత్మహత్యల పాలయ్యారు. వ్యవసాయ రంగ సమస్యలను గాలికొదిలేయడమే కాదు, వారి కష్టంతో పండిన గింజలను కూడా గాలికొదిలేశారు.

ఇటీవల ఎఫ్.సి.ఐ. గోదాములలో వేల టన్నుల ఆహార ధాన్యాలు మురిగి పోయాయన్న విషయంపై సుప్రీంకోర్టు (ఇద్దరు న్యాయమూర్తుల) ధర్మాసనం ఆందోళన వ్యక్తం చేస్తూ 'లక్షలాది మంది ప్రజలు ఆకలి బాధలు పడుతుండగా, ఒక్క గింజ కూడా వృథా కావడం నేరమే'నని పేర్కొంది. అదే క్రమంలో ఆ దిశగా పలు సూచనలు చేసింది.

కరువు పీడిత, తుపాను బాధిత ప్రాంతాలలో ప్రజా పంపిణీ వ్యవస్థను పటిష్ఠం చేయాలనీ, చౌకధరల దుకాణాలను నెలలోని ముప్ఫై రోజులు తెరిచి ఉంచాలని సూచించింది. రాష్ట్ర స్థాయిలో ఒక పెద్ద గోదామును, జిల్లా డివిజన్ల స్థాయిలో చిన్న గోదాములను నిర్మించాలని సూచించింది. గోదాములలో ఆహార ధాన్యాలను మురగబెట్టే కంటే, సామాన్య ప్రజానీకానికి ఉచితంగానో, తక్కువ ధరకో పంచివ్వడం మంచిదని ఆజ్ఞాపించింది.

దేశంలో నలభై శాతం ప్రజలు ఆకలితో అలమటిస్తున్నారు. 46 శాతం మంది పిల్లలు పౌష్టికాహార లేమితో బాధపడుతున్నారు. ప్రతిరోజూ మన దేశంలో ఏడువేల మంది ఆకలితో చనిపోతున్నారు. ఆహారధాన్యాలు వృథా కావడంపై వ్యవసాయ శాస్త్రవేత్త ఎం.ఎస్. స్వామినాథన్ స్పందిస్తూ 'ఆహార భద్రతా చట్టం అంటూ ఆర్భాటంగా గొప్పలు చెప్పుకోవడమే కాని, అవి అవసరమైన ప్రజల కోసం గింజలు నిల్వ చేయలేక పోవడం

నిబంధనలకు కట్టుబడి పరిహార బిల్లును తెస్తామని హామీ ఇచ్చి ఉన్నారు. 2008 సెప్టెంబర్ 10న అప్పటి భారత విదేశాంగ శాఖ కార్యదర్శి శివశంకర్ మీనన్ అమెరికా విదేశాంగ శాఖ ఉపమంత్రి విలియం బర్న్‌కు రాసిన లేఖలో, సి.ఎస్.సి. కి కట్టుబడే అణు పరిహార బిల్లును తెస్తానని ఒప్పుకున్నారు. దీన్ని బట్టి మనం ఏం చట్టాలు చేసినా మన పిలక అమెరికా వాడి చేతిలోనే ఉందన్న సంగతి మరిచిపోకూడదు.

ఈ మధ్యనే ప్రపంచ బ్యాంక్ నుండి మరింత రుణ సహాయాన్ని కోరుతూ ప్రణాళికా సంఘ ఉపాధ్యక్షుడు మొంటెక్‌సింగ్ అహ్లూవాలియా పంపిన ఇ-మెయిల్‌కు జవాబిస్తూ అమెరికా జాతీయ భద్రతా ఉప సలహాదారు మైఖెల్ ఫ్రోమెన్ 'భోపాల్ నష్టపరిహారం గురించి ఒత్తిడి పెంచితే తమ రెండు దేశాల సంబంధంపై తీవ్రమైన ప్రతికూల ప్రభావం చూపుతుందని హెచ్చరిస్తూ జవాబిచ్చార'ని తెలుస్తుంది.

మహారాష్ట్ర రత్నగిరి జిల్లాలో జయతాపూర్‌లో ఏర్పాటు చేయబోతున్న అణు విద్యుత్ పార్క్ కోసం మన పర్యావరణ మంత్రిత్వ శాఖ కొనసాగించిన పర్యావరణ పరీక్షలన్నీ లోపభూయిష్టమని, ప్రపంచ పర్యావరణ చట్ట సంఘానికి చెందిన అణు శాస్త్రవేత్త మార్క్ బెర్నాయిన్ ప్రకటించడం గమనించాల్సిన విషయం. 'అమెరికాలో సెప్టెంబర్ 11 తర్వాత ఎక్కడ అణు కర్మాగారాలు నిర్మించినా, టెర్రరిస్టులు జరిపే భూతల దాడులు నుంచి గానీ, వైమానిక దాడుల నుంచి గానీ రక్షణ ఏర్పాట్లు తప్పనిసరిగా చేయాలని నిర్ణయించింది.' అటువంటి రక్షణ ఏర్పాట్ల గురించి భారతీయ పర్యావరణ అధికారులు ఏమీ పట్టించుకోలేదని ఆయన ఆరోపణ చేసారు. అంతేకాదు, ఈ అణు విద్యుత్ కేంద్రాలన్నీ అధిక శాతం సముద్రతీరాన నిర్మిస్తున్నారు కాబట్టి ఇక మీదట మన దేశంలో నిర్మించబోయే అణు విద్యుత్ కేంద్రాలన్నీ టెర్రరిస్టు దాడుల ప్రమాదానికి గురయ్యే ప్రమాదం ఉందని కూడా ఆయన హెచ్చరించడంలో మనకు అమెరికా విధానాల్ని పాటించడం తప్ప వేరే దిక్కులేదనే విషయం స్పష్టమవుతోంది.

పై రెండు సంఘటనల్ని గమనిస్తే మన అణు నష్టపరిహార బిల్లు అమెరికన్ సామ్రాజ్యవాదులకు మడుగులొత్తే కార్యక్రమంలో భాగంగానే ఉనికిలోకి వచ్చిందనేది అర్థం అవుతుంది. మన దేశ ప్రజల ప్రాణాల్ని బలిగా పెట్టి, హంతక అణు నష్టపరిహార బిల్లును, గతంలో జరిగిన అణు ఒప్పందంతో సహా పూర్తిగా రద్దు చేసే వరకు పోరాడాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)* వీ

సిగ్గుచేట'ని అన్నారు.

దేశంలోని పేదలకు సంబంధించిన అంచనాలలో ఒక్కొక్కరు ఒక్కోలాగా లెక్కించారు. ప్రణాళికా సంఘం 36 శాతం, టెండుల్కర్ కమిటీ 44 శాతం, ది నేషనల్ కమిషన్ ఫర్ ఎంటర్‌ప్రైజెస్ ఇన్ ది అనార్గనైజ్డ్ సెక్టర్ 77 శాతం మంది జనాభా పేదరికంలో ఉన్నట్లు తెలిపాయి. అయితే కేంద్ర మంత్రుల బృందం పేదరికాన్ని తక్కువగా చూపించడానికి ప్లానింగ్ కమిషన్ లెక్కల్నే పరిగణనలోకి తీసుకుంది. మరో రకంగా చెప్పాలంటే ప్రజా పంపిణీ వ్యవస్థ బాధ్యత నుంచి వైదొలగే లక్ష్యంతోనే ప్రభుత్వం ఇటువంటి ప్రజా వ్యతిరేక నిర్ణయాలు తీసుకుంటోంది.

ఆగస్ట్ 12న సుప్రీంకోర్టు ఇచ్చిన ఆదేశాలపై స్పందిస్తూ కేంద్ర వ్యవసాయ శాఖ మంత్రి శరద్ పవార్ 'ఉచితంగా ఇవ్వడం సాధ్యం కాద'న్నారు. దేశంలో ఆహార ధాన్యాల నిల్వ సామర్థ్యం కాస్త పెంచాల్సిన అవసరం ఉందన్నారు. గత ఏడేళ్లుగా కేంద్ర మంత్రిగా కొనసాగుతూ, అన్ని అధికారాలు ఉండి కూడా ఆ దిశగా చేసిన ప్రయత్నమేమీ ఈ కాలంలో లేదు.

ఈ క్రమంలో ప్రధాని మన్మోహన్ సింగ్ కలగజేసుకుంటూ 'విధాన నిర్ణయాలలో న్యాయస్థానాలు తలదూర్చకూడద'ని అంటూ సుప్రీంకోర్టు ఆదేశాలను సున్నితంగా తిరస్కరించారు.

మార్కెట్ డిమాండ్, లాభాలే లక్ష్యంగా వ్యవహరించే సామ్రాజ్యవాద స్వభావానికి మనిషి, మనిషి మనుగడ ముఖ్యమైన విషయాలు కావు. వేల టన్నుల గోధుమలను, ఆహార పదార్థాలను పేద దేశాలకు ఇవ్వకుండా సముద్రం పాలుచేసిన అమెరికన్ సామ్రాజ్య వాదుల చరిత్ర మనకు తెలిసిందే.

జనవరి 6, 2010న దేవాశీష్ భట్టాచార్య సమాచార హక్కు చట్టం కింద కుళ్లిపోతున్న నిల్వ ధాన్యాల స్థితిగతులపై ఒక ప్రజా ప్రయోజన వ్యాజ్యాన్ని కోర్టులో దాఖలు పరిచారు. ఆ క్రమంలో పలు వాస్తవాలు బయట పెట్టారు. ఆయన ఒరిస్సాలోని ఆకలి ప్రాంతంగా ప్రసిద్ధి గాంచిన కోరాపుట్ జిల్లాలో పర్యటించారు. అక్కడ సామాన్య ప్రజలు ఎలుకలను, ఉడకబెట్టిన వేళ్లను ఇంకా చీమలను కూడా తింటున్నారు. మరోపక్క ఆహారధాన్యాలను నిల్వచేయడంలోనే అనేక టన్నుల కుళ్లి పాడై పోతున్నాయి. సమాచారాన్ని ఎఫ్.సి.ఐ. నుంచి పొందడం ఒక ఎత్తైతే ఆ పొందిన సమాచారాన్ని విధానపరమైన నిర్ణయాలను ప్రభావితం చేసేలా ఉపయోగించడం మరొక ఎత్తని ఆయన అన్నారు. ఇది ఆయనకు ప్రేరణను కలిగించింది.

ఈ ఏడాది దేశం మొత్తంలో దాదాపు పదకొండు లక్షల టన్నుల ఆహార ధాన్యాలు ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (ఎఫ్.సి.ఐ.) గోదాములలో పాడైపోయినట్లు తెలుస్తోంది. మొత్తంగా 1997–2007 మధ్య చూస్తే 1.83 లక్షల టన్నుల గోధుమలు, 6.33 లక్షల టన్నుల బియ్యం, 2.2 లక్షల టన్నుల ధాన్యం, 111 లక్షల టన్నుల మొక్కజొన్నలు వేరు వేరు ఎఫ్.సి.ఐ. గోదాములలో చెడిపోయినట్లు తెలుస్తోంది.

ప్రాంతాల వారీగా ఎఫ్.సి.ఐ. నిల్వ సామర్థ్యం (లక్షల టన్నులు)

| క్ర.సం. | దేశంలోని ప్రాంతాలు | నిల్వ సామర్థ్యం | ప్రస్తుత నిల్వలు |
|---|---|---|---|
| 1 | ఉత్తర ప్రాంతం | 127.48 | 111.20 |
| 2 | దక్షిణ ప్రాంతం | 57.39 | 54.24 |
| 3 | తూర్పు ప్రాంతం | 23.99 | 17.10 |
| 4 | ఈశాన్య ప్రాంతం | 4.48 | 3.50 |
| 5 | పశ్చిమ ప్రాంతం | 43.30 | 32.29 |

దేశంలోని ఎఫ్.సి.ఐ. గోదాముల నిల్వ సామర్థ్యం 256.64 లక్షల టన్నులు కాగా, ప్రస్తుతం ఉన్న నిల్వలు 218.35 లక్షల టన్నులే. దీన్ని బట్టి వ్యవసాయ శాఖ మంత్రి పేర్కొన్నట్లు స్థలాభావం వల్ల గింజలు పాడవలేదు. నిర్లక్ష్యం, జాగ్రత్త వహించక పోవడం వల్లనే ఇంత నష్టం జరిగింది.

ప్రభుత్వం లెక్కల ప్రకారమే సరిగా నిల్వ చేయలేకపోవడం వల్ల అరవై వేల కోట్ల రూపాయలు విలువ చేసే ఆహార ధాన్యాలను ప్రతియేటా నష్టపోతున్నట్లు తెలుస్తోంది. ఆహార ధాన్యాలను నిల్వ చేయడానికి 243 కోట్లు ఖర్చవుతుండగా, చెడిపోయిన ఆహార ధాన్యాలను వదిలించు కోవడానికి ప్రభుత్వం మరో 2.6 కోట్ల రూపాయలు ఖర్చు పెడుతోంది. రెండు వందల లక్షల టన్నుల ఆహారం మనం ప్రతియేటా పందికొక్కుల వల్ల, బూజు పట్టడం వల్ల నష్టపోతున్నట్లు తెలుస్తోంది. ఈ మొత్తం మన దేశ ఉత్పత్తిలో పదో వంతు ఉంటుంది.

వాస్తవానికి 'మొదట నిల్వచేసిన గింజలను మొదట బయటకు పంపాలనే' సూత్రంపై గోదాములలో ఆహార ధాన్యాలను నిల్వ చేయాలని పలు కమిటీలు, శాస్త్రవేత్తలు సూచిస్తూనే ఉన్నారు. అయినా, అమలు చేయడంలో మన పాలకులకు ఆసక్తి, చిత్తశుద్ధి రెండూ లేవు.

కేవలం ఆహార ధాన్యాలే కాదు, తాగునీళ్లు, సాగునీళ్లు, విద్యుత్ ఇలా ఏ అంశాన్ని తీసుకొని విశ్లేషించినా మనకు అపారమైన వృథా కనబడుతుంది. ప్రజలకు సక్రమంగా అందించాలనే చిత్తశుద్ధే ఉంటే, ప్రణాళికలు, వాటి అమలు మరోలా ఉండేవి.

అనాదిగా ఈ దేశంలోని అట్టడుగు వర్గాల ప్రజలు, అందునా దళితులు అగ్రవర్గ, అగ్రకుల పాలకులను ఉద్దేశించి 'మీరు పశువుల్ని కూడా పూజిస్తారు కాని, మమ్మల్ని మాత్రం సాటి మనుషులుగా గుర్తించరేమిట'ని ఆత్మాభిమానంతో అనేక పోరాటాలు చేస్తూనే ఉన్నారు.

ఇప్పటి సందర్భానికి ఆ స్పృహను అన్వయించుకుంటే మనిషి శ్రమతో పండిన వేల టన్నుల ఆహార ధాన్యాలను పురుగులకూ, పందికొక్కులకూ, బూజు తెగుళ్లకూ ఆహారంగా వదిలేస్తారుగానీ, తమ శ్రమతో సర్వ సంపదలు సృష్టించే మనిషికి, శ్రమజీవికీ, ఆకలితో ఉన్న మనిషికీ పట్టెడు అన్నం పెట్టడానికి ఈ పాలకులు ఇష్టపడరని అర్థం చేసుకోవాలా?

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)*

ప్రజల ఓట్లతో ఎన్నికై, ప్రజా వ్యతిరేక చర్యలకు పాల్పడి కోట్లాది రూపాయల అక్రమ ధనాన్ని స్విస్ బ్యాంకులలో దాచుకుంటున్న వైనాన్ని వివరిస్తున్నారు **కె.వి. కూర్మనాథ్**

# స్విస్ బ్యాంక్ నిల్వలకు ప్రభుత్వ అండ

అలీబాబా నలభై దొంగలు కథలో దొంగల నాయకుడే గుహలో ఉన్న మొత్తం డబ్బంతా బయటకు తియ్యాలని, ప్రజలకు పంచిపెట్టాలని అన్నాడనుకోండి, ఎలా ఉంటుంది? డబ్బు పోగొట్టుకున్న ప్రజలకు ఎంతో హాయిగా ఉంటుంది. ఏళ్లుగా తాము పోగొట్టుకున్న డబ్బు, నగలూ తిరిగి వస్తాయన్న ఊహే గొప్పగా ఉంటుంది.

ఈ సంవత్సరం మొదట్లో ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ చేసిన ప్రకటన కూడా ప్రజలకు చాలా నచ్చింది. స్విట్జర్లాండ్‌తో సహా ఎన్నో దేశాల్లో దాగి ఉన్న మన నల్లధనాన్ని వెనక్కి తీసుకువస్తామని, ఇది సాధ్యపడడానికి ఆయా దేశాలతో ఒప్పందాలు చేసుకుంటామని ప్రకటించాడు. 'ఇంతకంటే ఏం కావాలి?' అనుకున్నారు ప్రజలు.

కానీ ఈ సంతోషం తొందర్లోనే ఆవిరైపోయింది. ఈ ఒప్పందాలు పాత డబ్బు గురించి కాదనీ, భవిష్యత్తులో పోగుపడబోయే డబ్బు గురించని ఆర్థిక శాఖ మంత్రి ప్రణబ్ ముఖర్జీ వివరణ ఇచ్చాడు. దీంతో తేలిందేమంటే విదేశాల్లో ఇప్పటికే మూలుగుతున్న మన నల్ల డబ్బు ఇకరాదు.

నల్లధనం అంటేనే మోసపూరితంగా కూడబెట్టుకున్న డబ్బు అని. ప్రజాధనాన్ని ప్రజలకళ్లు కప్పి మళ్లించారని అర్థం. నల్లధనం రెండు రకాలుగా ఉంటుంది. దొంగపేర్లతో ఇక్కడ కూడబెట్టుకున్నది. ఇంకా బయటి దేశాలకు తరలించేది. ఇక్కడే ఉన్న నల్లధనం గురించి విడిగా ఎప్పుడైనా చర్చించాలి. విదేశాల్లో మన నాయకులు, పారిశ్రామికవేత్తలు, అవినీతి అధికారులు దాచిన డబ్బు గురించిన వివరాలు బహుశా ఎప్పటికీ రావేమో.

స్విట్జర్లాండ్‌లోని బ్యాంకుల్లో ఉన్న డబ్బే డెబ్బై ఐదు లక్షల కోట్ల రూపాయలు. ఇంకో ఇరవై దేశాల్లో కూడా మన నల్లధనం ఉంది. వీటి గురించి కనీస అంచనాలు కూడా లేవు.

స్విస్ బ్యాంకుల్లోని డబ్బునే చూద్దాం. డెబ్బై ఐదు లక్షల కోట్లు అంటే ఎంతో మనలో చాలా మందికి ఊహించడం కష్టం. ఇది అర్థం కావాలంటే మన దేశ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన కొన్ని వివరాలు చూద్దాం. ఒక సంవత్సర కాలంలో మన దేశంలో ఉత్పత్తి అయిన వస్తువులు, సర్వీసులు మొత్తం విలువ (దీన్నే జి.డి.పి. అంటారు) యాభై ఎనిమిది లక్షల కోట్లు.

ఇవి మనం నిత్యం వింటున్న సంఖ్యలు కాబట్టి, వీటి సాపేక్షంగా స్విస్ బ్యాంకుల్లో ఉన్న మన డబ్బు రు. 75,00,000 కోట్లను ఊహించండి! ఈ డబ్బుతో మన రాష్ట్ర, కేంద్ర బడ్జెట్లు ఎన్ని తయారవగలవో ఊహించండి! మన దేశ మొత్తం అప్పును మూడు సార్లు తీర్చవచ్చు. ప్రజల ఆరోగ్యానికి, విద్యకి, ఉపాధికి, అభివృద్ధికి డబ్బు లేదని మొత్తుకునే ప్రభుత్వాలు స్విస్ బ్యాంకుల్లోని మన నల్ల డబ్బును తీసుకొస్తే సమస్యే ఉండదు కదా.

ఇంత డబ్బు అసలు ఎక్కడి నుంచి పుడుతోంది. ఎలా దేశం దాటి బయటకు వెళుతోంది?

నక్సలైట్లు ఏటా నాలుగు వేల కోట్ల రూపాయలు వసూలు చేస్తున్నారని, ఇది రాష్ట్రాల, దేశాల పన్ను వసూళ్లకు ఎంతో నష్టం కలిగిస్తోందని చిదంబరం ఆ మధ్య వాపోయాడు. కానీ ఈ నాలుగు వేల కోట్లను దేంతో హెచ్చ వేస్తే స్విస్ బ్యాంకుల్లోని డబ్బుతో సమానమో, ఆ డబ్బు మన దేశం ఎందుకు రావడం లేదో, ఇది ఎంత హింసకు సమానమో ప్రభుత్వం చెప్పదు. మనం కొనుక్కునే ఉప్పు మీద, హోటళ్లో మనం తినే ఇడ్లీల మీద, ఫోను బిల్లుల మీద, సంపాదన మీద విపరీతంగా పన్నులు విధించే ప్రభుత్వాలు జి.డి.పి.ని తలదన్నే నల్లధనం గురించి ఎందుకు పట్టించుకోవు? కనీసం ఎందుకు ప్రయత్నించవు? దాని గురించి మాట్లాడాలని కూడా మన ఆర్థికమంత్రికి ఎందుకు అనిపించదు?

ఎందుకంటే మన ప్రజాస్వామ్యం, ప్రభుత్వాల ప్రధాన కర్తవ్యం ఆస్తి రక్షణ. ధనికవర్గాల ఆస్తి రక్షణ హక్కును కాపాడడానికి ప్రభుత్వం

| | | | |
|---|---|---|---|
| స్విస్ బ్యాంకులో భారత నల్లధనం | రు. | 75,00,000 | కోట్లు |
| మన జి.డి.పి. | రు. | 58,00,000 | కోట్లు |
| కేంద్ర బడ్జెట్ | రు. | 10,00,000 | కోట్లు |
| రాష్ట్ర బడ్జెట్ | రు. | 1,00,000 | కోట్లు |
| కేంద్ర ప్రభుత్వ పన్ను వసూళ్లు | రు. | 7,50,000 | కోట్లు |
| స్విస్ బ్యాంకుల్లో నల్లధనం వస్తే వాటి మీద పన్ను | రు. | 10,00,000 | కోట్లు |
| మన మొత్తం అప్పు | రు. | 25,00,000 | కోట్లు |
| మన విదేశీ కరెన్సీ నిల్వలు | రు. | 15,00,000 | కోట్లు |
| ఉత్తర ప్రదేశ్ అప్పు | రు. | 2,21,000 | కోట్లు |
| పశ్చిమ బెంగాల్ అప్పు | రు. | 1,92,000 | కోట్లు |
| ఆంధ్రప్రదేశ్ అప్పు | రు. | 1,26,000 | కోట్లు |

అన్ని రకాలుగా ప్రయత్నిస్తోంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఆస్తి రక్షణ హక్కును కాపాడడమే దాని తక్షణ, అంతిమ లక్ష్యం.

ఈ విషయంలో అధికార పార్టీలకు, ప్రతిపక్ష పార్టీలకు అంగీకారం ఉంటుంది. మహిళా రిజర్వేషన్ బిల్లు పలుసార్లు ఆగిపోతుంది కాని, నల్లధనం గురించి పార్లమెంట్ ఒక్కరోజు కూడా బాధపడదు, ఆగిపోదు.

'ఆ దేశాల్లోని బ్యాంక్ డిపాజిట్ల వివరాలు వెల్లడించడానికి ఆ దేశాల చట్టాలు ఒప్పుకోవు. కాబట్టి తెలుసుకోవడం కష్టమ'ని ప్రణబ్ ముఖర్జీ ఈ మధ్య పార్లమెంట్‌లో ప్రకటించాడు.

అంటే మన ప్రభుత్వం వైపు నుంచి కనీస ప్రయత్నమేదీ కూడా జరగదని స్పష్టమైపోయింది. స్విట్జర్లాండ్ మెడలు వంచి డిపాజిట్ల వివరాలు తెలుసుకునే ఒప్పందం అమెరికా కుదుర్చుకోగలిగింది కానీ, మన ప్రభుత్వానికి ఆ ప్రయత్నం కూడా చెయ్యబుద్ధి కాదు. ఎందుకంటే అక్కడ ఉన్నవి తమ వారి డబ్బే కాబట్టి.

నిజానికి ఈ సమస్య కేవలం మన దేశానిదే కాదు. మొత్తం మూడో ప్రపంచ దేశాల సమస్య. అవినీతి ప్రభుత్వాలు నడిపే వారికి, పారిశ్రామికవేత్తలకు, అధికారులకు స్విట్జర్లాండ్, ఇతర ఇరవై దేశాలు స్వర్గధామంలాంటివి. ఎన్నో రకాలుగా నల్లధనంను ఈ దేశాల బ్యాంకులకు తరలిస్తుంటారు.

అసలు డబ్బుని బయటి దేశాలకు ఎలా తరలిస్తారు? మామూలుగా విదేశీ ప్రయాణాలు చేస్తున్నప్పుడు మనం తీసుకు వెళ్లగలిగే డబ్బు మీద ఆంక్షలు ఉంటాయి. మన దగ్గరున్న డబ్బు వివరాలను (అవతలి దేశాల నియమాలను బట్టి ఈ మొత్తం మారుతుంటుంది.) మన దేశానికి కూడా ఈ విషయంలో కొన్ని ఆంక్షలున్నాయి. రెవెన్యూ నిబంధనల ప్రకారం భారత ప్రజలు కూడా పెద్ద మొత్తంలో డబ్బు తీసుకు వెళ్లకూడదు. ఒక అంచనా ప్రకారం పదివేల డాలర్ల కంటే (దాదాపు ఐదు లక్షల రూపాయలు) ఎక్కువ మొత్తం ఒక ప్రయాణికుడి దగ్గర ఉండకూడదు. ఒకవేళ తీసుకువెళ్లాల్సి వస్తే ఆ అవసరాన్ని నిరూపించి, అనుమతి పొందాల్సి వస్తుంది. ఇవి మామూలు ప్రయాణికుల సంగతి. అవినీతి డబ్బుకు ఆంక్షలుండే అవకాశం లేదు. కాబట్టి బయటి బ్యాంకుల్లోకి నిరంతరంగా డబ్బు చేరుతూనే ఉంటుంది. ఇలా నేరుగా వెళ్లి బ్యాంకుల్లో జమ చేయడం ఖర్చుతో, శ్రమతో కూడుకున్న పని. దీనికి ఇతర మార్గాలు కూడా ఉన్నాయి. అక్కడ ఎకౌంట్ ఉన్న వాళ్లు తమ ఎకౌంట్లకు ఎక్కడి నుంచైనా మనియార్డర్ చెయ్యొచ్చు. చెక్ ద్వారాగానీ, డ్రాఫ్ట్ ద్వారా గాని, ఇంకా వెస్టర్న్ యూనియన్ (ఈ సర్వీస్ ద్వారా ప్రపంచంలో ఎక్కడి నుంచి ఎక్కడికైనా డబ్బును బదిలీ చెయ్యొచ్చు) ద్వారా, బ్యాంకు బదిలీ ద్వారా డబ్బును బదిలీ చేస్తారు.

వీటన్నిటికంటే శక్తిమంతమైన (అంటే ఎక్కువ మొత్తంలో డబ్బును బదిలీ చేయగల) మార్గాలున్నాయి. ఒకటి హవాలా (ఇక్కడ 'పని' జరిగితే ఆ సంకేతం తమవాళ్ల ద్వారా తెలుసుకుని అక్కడ ఎవరో ఒకరు ఎకౌంట్లలో డబ్బు జమ చేస్తారు. లేదా అక్కడ తమ ఎకౌంట్లలో డబ్బు జమ అయిందని తెలిసాక, ఇక్కడ పనులు పూర్తి చేస్తారు). రెండోది, ఇక్కడి ప్రభుత్వ పనుల్లో, విధానాల్లో తమకు అనుకూలంగా నిర్ణయాలు తీసుకున్న నేతలకు, అధికారులకు విదేశీ ప్రభుత్వాలు, కంపెనీలు నేరుగా వారి వారి విదేశీ ఎకౌంట్లలో జమ చేస్తాయి.

| స్విస్ బ్యాంకుల్లో ముఖ్య ఖాతాదార్లు | | | |
|---|---|---|---|
| ఇండియా | రు. | 75,00,000 | కోట్లు |
| రష్యా | రు. | 23,50,000 | కోట్లు |
| ఇంగ్లండ్ | రు. | 19,50,000 | కోట్లు |
| ఉక్రెన్ | రు. | 5,00,000 | కోట్లు |
| చైనా | రు. | 4,80,000 | కోట్లు |

మన దేశంలోని పారిశ్రామికవేత్తలు కూడా నాయకులను, అధికారులు సంతృప్తి పరచడానికి వారి వారి విదేశీ బ్యాంకుల ఎకౌంట్లు పెరిగేటట్టు చూసుకుంటారు. నిజానికి విదేశీ బ్యాంకు ఎకౌంట్లలోకి డబ్బును బదిలీ చేయడానికి, మేనేజ్ చేయడానికి కొన్ని ప్రొఫెషనల్ కన్సల్టెన్సీ సంస్థలున్నాయంటే ఇది ఏ స్థాయి వ్యవహారమో ఊహించవచ్చు.

డబ్బు బదిలీకి ఇంకొక పద్ధతి ఉంది. మన నాయకులు, పారిశ్రామికవేత్తలు, అధికారులకు విదేశాల్లో ఆస్తులు, వ్యాపారాలు ఇంకా ఇతరేతర ఆదాయ వనరులున్నాయి. ఆ వ్యవహారాల్లో పుట్టిన అదనపు ఆదాయం కూడా అట్నుంచి అటే స్విస్ ఇంకా ఇతర బ్యాంకుల్లోకి పోతుంటాయి.

మూడో ప్రపంచ దేశాల ప్రజల రక్తాన్ని పిండుకుని సంపాదించిన డబ్బుని తమ బ్యాంకుల్లో ఉంచడానికి అసలు ఆ ప్రభుత్వాలు ఎందుకు ఒప్పుకుంటాయి? ఎందుకంటే ఆ బ్యాంకుల్లో పోగుపడ్డ డబ్బుతోనే అక్కడి అభివృద్ధి సాధ్యమవుతుంది. నల్లధనంను విదేశాల్లో దాచుకునేవారు దానిమీద వచ్చే వడ్డీకి ఆశపడి దాచరు. అసలును పదిలపర్చుకోవడమే వాళ్ల లక్ష్యం. అంటే అభివృద్ధి చెందిన దేశాల అజమాయిషీలో అపారమైన చీప్ కాపిటల్ (చవకగా, తక్కువ వడ్డీకి దొరికే డబ్బు) ఉంటుంది. ఇది సాధ్యమవడానికి స్విట్జర్లాండ్ లాంటి దేశాల్లో బ్యాంకు ఖాతాల వివరాలపై అపరిమితమైన రహస్య పొరలుంటాయి. ఆ వివరాలు అక్కడి ప్రభుత్వాలు కూడా తెలుసుకోలేవు. (చట్టాల మాటున తెలుసుకునే ప్రయత్నం చెయ్యరు.) ఈ చట్టాలు అవినీతిపరులకూ, బ్యాంకులకూ, ప్రభుత్వాలకూ మూకుమ్మడిగా ఉపయోగపడుతున్నాయి.

పైగా ఈ బ్యాంకు ఖాతాలు తెరవడం కూడా పెద్ద కష్టమైన పనేం కాదు. పోస్టుద్వారా, ఫాక్స్ ద్వారా లేదా స్వయంగా గాని ఎవరైనా ఖాతా తెరవవచ్చు. ఖాతాదారులు తమ పేరుతో మాత్రమే కాకుండా ఒక సంఖ్యతో కూడా ఎకౌంట్లను తెరవొచ్చు.

అవినీతి ప్రభుత్వాలకు వ్యతిరేకంగా పోరాడే వారిని, జాతుల విముక్తి కోసం పోరాడుతున్న వారిని, వారికి వనరుల్ని సమకూర్చే వాళ్లను కూడా తీవ్రవాదులుగా ముద్రవేసే ప్రభుత్వాలు, ఈ ఆర్థిక తీవ్రవాదానికి పాల్పడుతున్న వాళ్లను ఎందుకు ఉపేక్షిస్తున్నాయి? కేవలం ఉపేక్షించడమే కాదు, వారి ఆస్తుల పరిరక్షణకు సర్వశక్తులను ఉపయోగిస్తున్నాయి.

అందుకే అన్ని దేశాల్లోని దొంగలు డబ్బులు దాచుకుంటున్న రహస్య స్థావరాలను కంటికి రెప్పగా కాపాడుకుంటాయి. ఆ హక్కులకు రక్షణ కల్పించే ప్రభుత్వాలను కాపాడుకుంటాయి. ప్రభుత్వాలు వాళ్లను కాపాడతాయి. నిజానికి ఇద్దరూ వేర్వేరు కాదు. ఇక శక్తియుక్తుల్ని ఉపయోగించి వీళ్లను ఓడించగల, బుద్ధిచెప్పగల అలీబాబాలు, అనుచరులు కల్పించుకుంటే తప్ప మన సొత్తు మనకు రాదు.

*(రచయిత పాత్రికేయులు)*

**కష్టించి పనిచేసే సామాన్యుల ఆదాయాన్ని, ప్రజా ప్రతినిధుల ఆదాయంతో పోలుస్తూ పాలకుల అవినీతి ఏ స్థాయిలో ఉందో వివరిస్తున్నారు వి. హనుమంతరావు**

# ఎం.పి.కి ఎందుకంత జీతం?

*'ఆర్థిక అసమానతలు పెరిగిపోవడం, సామాజిక ఉద్రిక్తతలు మతపరమైన వివాదాలు, ప్రాంతీయం, భాషా జాతి వివాదాలు పెను సవాలుగా నిలిచాయి'; 'పట్టణాల్లో ఒకవైపు షాపింగ్ మాల్స్, బహుళఅంతస్తుల భవనాలు పెరుగుతున్నాయి. అదే సందర్భంలో పౌష్టికాహార లోపంతో బాధ పడుతున్న అయిదేళ్ల లోపు పిల్లలు 43.5 శాతానికి పెరిగారు'; 'దేశంలో పేదరికం ఆఫ్రికా దేశాల్లో కంటే తక్కువగా ఉండటం శోచనీయం'; 'వివిధ రకాల సమస్యలపై నిర్వహించే ఆందోళనలు, ప్రజా ప్రదర్శనల సందర్భంగా జన బాహుళ్యాన్ని కట్టడి చేసేందుకు ఆయుధ రహిత ప్రమాణాలను అనుసరించాలి.'*

ఇవన్నీ ప్రతిపక్షాలు చేస్తున్న విమర్శలు కావు; స్వయాన ప్రధాని ఇటీవల దేశ పోలీసు అధికారుల సమావేశంలో చేసిన ప్రసంగంలో వ్యక్తపరిచిన అభిప్రాయాలు. అటు ప్రధాని, ఇటు ప్రతిపక్షాలు ఏకాభిప్రాయం కలిగి ఉండడం అపూర్వం. ఎటొచ్చీ, ఈ సమస్యలకు పరిష్కారాల విషయంలోనే అటు మావోయిస్టుల నుంచి ఇటు బి.జె.పి. వరకూ పూర్తిగా విభిన్నాభిప్రాయాలుండటమే అసలు సమస్య. ఈ సమస్యను పరిష్కరించే దిశగా పయనిస్తున్నామా? లేదని ప్రధానియే స్వయంగా అంగీకరిస్తున్నారు. 63 సంవత్సరాల తర్వాత ఈ సమస్యలు అపరిష్కృతంగా ఉండిపోవడానికి కారణాలేమిటి?

ప్రపంచంలోకల్లా అతిపెద్ద ప్రజాస్వామ్య దేశమని చెప్పుకొంటున్నాం. అందుకు మన పార్లమెంటరీ వ్యవస్థనే ఉదాహరణగా చూపిస్తున్నాం. ఎన్నికలు జరుగుతూండడమే మన దేశం ప్రజాస్వామ్య దేశమని నిదర్శనగా చెప్పుకొంటున్నాం. దేశస్థాయిలో పార్లమెంట్, రాష్ట్రాల స్థాయిలో శాసనసభలు విధిగా సమావేశాలు జరుగుతూండడమే ప్రజాస్వామ్యం నాలుగు పాదాలా నడుస్తూందని చెప్పుకొంటూంటాం. కాని అవి ఎలా తమ విధులను నిర్వర్తిస్తున్నాయో అనేదే గీటురాయిగా భావించి విశ్లేషించుకోబోతే, ఇది ప్రజాస్వామ్యమా అని అనిపించక మానదు. ఉదాహరణకు ఈ సంవత్సరం మే లో ముగిసిన పార్లమెంట్ సమావేశాలని గమనిస్తే, అది బడ్జెట్ సమావేశమైనా సుమారు పది లక్షల కోట్ల బడ్జెట్టే అయినా, అన్ని పద్దులు చర్చించి ఆమోదం తెలియ చేయాల్సి ఉన్నా 84 శాతం బడ్జెట్ మొత్తాన్ని ఎటువంటి చర్చా జరపకుండానే సమావేశాలు ముగిసాయి. ఇదేదో ఈ సంవత్సరంలోనే జరిగింది కాదు. గత ఆరు సంవత్సరాల కాలంలో ఆరు పద్దులకు మించి, ఏ ఇతర పద్దుల మీద చర్చ జరగనే లేదు. బడ్జెట్ సమావేశాల్లో కేవలం బడ్జెట్‌ను మాత్రమే కాక, ఇతర బిల్లులకు కూడా ఆమోదం తెలియ చేయాల్సి ఉండగా, పెండింగ్ బిల్లులు 49 నుంచి 70కు పెరిగాయి. 51 కేంద్ర మంత్రివర్గాల డిమాండ్లు చర్చకు రానే రాలేదు. గిలెటిన్ అయిపోయాయి. ప్రజాస్వామ్యానికి పట్టుగొమ్మగా భావించే పార్లమెంట్ పనితీరు ఇలా ఉంటే ప్రశ్నోత్తరాల సమయం మినహాయిస్తే సభలో మిగిలిన సభ్యులు కోరంకు బొటాబొటిగా ఉండిన సమయంలో బిల్లులు ఆమోద ముద్ర వేయించుకొంటూంటే, ప్రజాస్వామ్యం అనిపించుకొంటుందా అని మనమంతా ఆలోచించుకోవాలి. ప్రధాని ఆందోళన వెలిబుచ్చిన వాటికి మూలం మన ప్రజాస్వామ్యం అమలు జరుగుతున్న తీరే అని అనుకోవాలి. మన రాష్ట్రంలో చట్టసభలు పనిచేస్తున్న తీరు గురించి చెప్పడం అమ్మ పుట్టింటి సంగతి మేనమామ దగ్గరనా అన్నట్టుంటుంది కాబట్టి ఇక్కడ ప్రస్తావించబోవడం లేదు.

పార్లమెంట్ ఇలా ఎందుకు వ్యవహరిస్తోంది? పార్లమెంట్‌కు ఎన్నికై వస్తున్న ప్రజా ప్రతినిధుల్లో రెండు మూడు రకాల వారున్నారు. ఏయే పార్టీల వారున్నారనే విషయం పక్కన పెడితే, కండబలం, ధనబలం ఉన్నవారు ఎన్నికవుతున్నారని స్వయాన సోనియాగాంధీ అంగీకరించారు. క్రిమినల్ రికార్డు ఉన్నవారిని ప్రజా ప్రతినిధులుగా ఎంపిక చేయకూడదని ఆమె అన్నారు. మరొక వర్గం దేశంలోని కార్పొరేట్ సంస్థలన్నిటి యజమానులో, లేదా వారి ప్రతినిధులో రాజ్యసభ సభ్యులుగా ఉన్నారు. ప్రభుత్వ ఆర్థిక విధానాలను పార్లమెంట్ లోపలా బయటా శాసించేది వీరే. డబ్బు ఖర్చు చేసి పార్టీ టికెట్లు కొనుక్కొని, ఎన్నికై వచ్చిన వారు మరికొందరు. చట్ట సభల్లో అసాంఘిక శక్తులు వారి కండబలాన్ని అపుడపుడు ప్రదర్శిస్తూండడం మనం చూస్తూనే ఉన్నాం. స్వతంత్రంగా పోరాడిన వారు చట్టసభల్లో కనుమరుగైపోయారు. ఇటీవలి కాలంలో అత్యున్నత స్థానాల్లో పనిచేసి రిటైర్ అయిన సీనియర్ అధికారులు రాజకీయ పార్టీలు నామినేట్ చేయగా ప్రవేశిస్తున్నారు. ఇలాంటి వారందరినీ చట్టసభల్లో ప్రవేశింప చేసిన తర్వాత, వారి ఆర్థిక ప్రయోజనాలను సాధించుకోవడమే వారి ఎజెండా అయిన తర్వాత ఆర్థిక అసమానతలు పెరిగిపోతున్నాయని ప్రధాని ఆందోళన వ్యక్తం చేయడమేమిటి? దేశంలో ప్రతిభావంతులు, తెలివైనవారు రాజకీయాల పట్ల ఆకర్షితులవడం లేదని, విద్యావంతులు, మధ్యతరగతి వారు ఎన్నికలకు దూరంగా ఉంటున్నారని, వోటు వేయడానికి కూడా ఆసక్తి చూపడం లేదని, పోటీ చేసిన వారిలో చాలా మంది నేపథ్యం వోటర్లను ప్రోత్సహించేవిగా ఉండడం లేదని ప్రధాని ఆవేదన చెందడం ఎంత వాస్తవమో, అలాంటి వారినే పార్టీలు ముఖ్యంగా కాంగ్రెస్ పార్టీ టికెట్ ఇచ్చి ఎన్నికల బరిలోకి దింపడం కూడా అంతే వాస్తవం.

ఇటీవల పార్లమెంట్ సభ్యుల నెలసరి ఆదాయం–స్పష్టంగా చెప్పాలంటే ఒక్కొక్క సభ్యుని కోసం ప్రభుత్వం చేసే ఖర్చు నాలుగు లక్షల రూపాయలు. ఈ లెక్కలో కేవలం నెలసరి జీతం మాత్రమే కాక ఇతర అలవెన్సులు అన్ని కలిపి ఉన్నాయి. (అతనికి ఢిల్లీలో ఇచ్చే బంగళా అద్దె

మినహాయించి.) ఒక సామాన్య అసంఘటిత కార్మికుని దినసరి ఆదాయం సగటున రోజుకు ఇరవై రూపాయలని లేదా నెలకు రు. 600లని ప్రభుత్వం నియమించిన కమిటీ తేల్చి చెప్పింది. అంటే ఆ సామాన్యుని నెలసరి ఆదాయంతో పోలిస్తే పార్లమెంట్ సభ్యుని మీద నెలసరి ఖర్చు 666 రెట్లు! ఈ పోలిక కేవలం ఎం.పి.ల ఆదాయంతో మాత్రమే. కార్పొరేట్ సంస్థల కుబేరులతో పోల్చడం లేదు. మెర్రిల్‌లించ్-క్యాప్ జెమినీ సంస్థలు ప్రపంచంలో కుబేరుల సంఖ్యను ప్రతి యేటా మదింపు చేసే సంస్థలు. ఈ సంస్థల తాజా లెక్కల ప్రకారం 2009లో దేశంలో లక్షా పాతిక వేల మంది కుబేరులున్నారు. ఫోర్బ్స్ నివేదిక ప్రకారం ఆసియాలోని తొలి 25 మంది అత్యంత ధనవంతుల్లో భారత్‌లో పదిమంది ఉన్నారు.

దేశంలో రెండు ఇండియాలు ఉన్నాయని ఈ అసమానతలను తొలగించాలని ప్రధాని ఇటీవల కొంతమంది పత్రికా సంపాదకులతో జరిపిన సమావేశంలో అన్నారు. (ప్రధాని వారికి ఇచ్చిన డిన్నర్ ఖర్చుతో కొన్నివందల మంది సామాన్యులు ఒక్కపూట అయినా తిండి తినగలుగుతారు.) అలాంటి షడ్రుచులతో విందు ఆరగించిన తర్వాత రెండు ఇండియాల గురించి మాట్లాడుతున్నారంటే, ప్రధాని అసమానతల గురించి అన్న మాటలు ఆయన హృదయంలో నుంచి వచ్చాయా, లేక నాలుక చివర నుంచి వచ్చాయా అని ప్రశ్నించాల్సి వస్తుంది. అంతేకాదు, ప్రధాని పూర్వాశ్రమంలో ఢిల్లీ సెక్రటేరియట్‌లో సీనియర్ అధికారిగా పని చేస్తున్న రోజుల్లో అసమానతలు అపుడూ ఉండేవి. కానీ, ఇంత ఘోరంగా ఉండేవి కావు.

పెట్టుబడిదారీ వ్యవస్థ అంటేనే అసమానతల పుట్ట. 90వ దశకం ప్రారంభంలో సరళీకృత ఆర్థిక విధానం ప్రవేశపెట్టిన తర్వాతనే అసమానతలు మరింతగా పెరుగుతూ వచ్చాయి. ఆ విధానానికి పునాది వేసింది మన్మోహన్ సింగ్. అప్పుడు ఆర్థికమంత్రిగా, 2004 నుంచి ప్రధానిగా ప్రవేశపెట్టిన విధానాలే అసమానతల పెరుగుదలకు దారితీశాయి. ఆయన నిజాయితీపరుడంటారు. ఇతర కాంగ్రెస్ నేతల్లాగ అవినీతికి పాల్పడకపోయి ఉండవచ్చు. కాని అసమానతల పెరుగుదలకు కావాల్సిన విధానాలను అమలు పరిచి, రెండో పక్క దేశంలో రెండు ఇండియాలు న్నాయని వాపోవడంలో ఎంత నిజాయితీ ఉందో పాఠకులు గ్రహించగలరు. రెండు ఇండియాలున్నాయని ప్రధాని ఇప్పుడే గుర్తించారా? అసమానతలతో మనం ఎప్పటి నుంచో సహజీవనం చేస్తున్నాం. ఆయన అధికారంలో కాలు పెట్టిన వేళా విశేషం అలాంటిది కాబోలు. 2005లో నేను సరిగ్గా ఇదే శీర్షికతో 'రెండు ఇండియాలు' అనే వ్యాసం రాస్తూ కొన్ని గణాంకాలు పేర్కొన్నా. ఆ వ్యాసంలో '2004లో కొన్ని కంపెనీల లాభాలు ఎంత వచ్చాయో, అంత లాభాన్ని 2005 మొదటి మూడు నెలల్లోనే సంపాదించాయి... మెర్రిల్ లించ్ సంస్థ అధ్యయనం ప్రకారం డాలర్ మిలియనీర్ల సంఖ్య 70 వేలకు పెరిగింది. రెండో వైపు చూస్తే జాతీయ సాంపిల్ సర్వే ప్రకారం 2000లో ప్రతీరోజూ 1800 కేలరీల ఆహారం తీసుకునే ప్రజల్లో మూడో వంతు నివసించే రాష్ట్రాలు మూడు ఉంటే ఇపుడు ఎనిమిదికి పెరిగాయి. పదవ ప్రణాళికలో గ్రామీణాభివృద్ధికి సుమారు మూడు లక్షల కోట్లు కేటాయించగా, మొదటి మూడు సంవత్సరాల్లో కేవలం ఒక లక్ష కోట్లు మాత్రమే ఖర్చయింది. భారతదేశం ఒకటి కాదు, రెండు. సంపన్నుల భారతదేశం, బడుగుజీవుల భారతదేశం'. (20, ఆగస్ట్ 2005)

కాగా ఈ అసమానతలకు మన్మోహన్‌సింగ్ ప్రభుత్వానిది ఎంత బాధ్యత ఉందో, అంతకు ముందు పాలించిన వాజ్‌పాయ్ ప్రభుత్వానిదీ అంతే బాధ్యత. అపుడు పేదరికపు రేఖ కింద ఉన్నవారి సంఖ్య 26 శాతం అయితే, ఇపుడు 38 శాతం. ఆయన ఆర్థిక మంత్రిగా ఉన్నపుడు కాబోలు ఒకానొక పరిణామం గురించి ప్రతిపక్షం ప్రశ్నించగా 'నా నిద్ర చెడగొట్టదలచుకోలేదు' అని అన్నారు. ఇపుడు నేను ఇలా రాసి మీ నిద్ర చెడగొట్టడం లేదు కదా మన్మోహన్‌జీ?

ఆయన ఇంకా గాఢ నిద్రలోనే ఉన్నట్లుంది. ఎందుచేతనంటే 'క్రోనీ కాపిటలిజం' (అర్థాంతరంగా, అక్రమంగా కుబేరులయిపోయిన వారు) గురించి, అవినీతి గురించి ప్రశ్నించగా, 'నా దృష్టికి అవినీతి కేసులేమైనా వస్తే తగు చర్యలు తీసుకుంటా'నని జవాబివ్వటం అత్యంత బాధ్యతారహితం అని చెప్పాలి. ప్రజలు, పత్రికలు, ప్రపంచ పరిశోధనా సంస్థలు దేశంలో పెరిగిపోతున్న అవినీతి గురించి కోడై కూస్తుంటే, ఆయనకు కనపడనూలేదు, వినపడనూ లేదు. అంటే, ఇటీవలి నెలల్లో ఖనిజ సంపదను అక్రమంగా, అవినీతికి పాల్పడ్డ సందర్భాలు అనేకం పత్రికల్లో వస్తూంటే, మాజీ న్యాయశాఖ మంత్రి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తుల్లో సగం మంది అవినీతికి పాల్పడ్డారని సుప్రీంకోర్టులోనే ప్రకటిస్తే మన్మోహన్‌జీ, మీకు వినపడలేదా? మీ సింగు మిత్రుడు, మీతో పోటీపడి ప్రపంచబ్యాంక్ అడుగులకు మడుగు లొత్తుతున్న ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడు అహ్లూవాలియా నేతృత్వంలో ప్రణాళికలు సంపదను పెంచాయే కాని, పేదరికాన్ని, అసమానతలను తగ్గించలేకపోయాయని మీకు గమనంలోకి రాలేదంటే నమ్మబుద్ధి కావడం లేదు. ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి మాయావతి దాఖలు చేసిన నామినేషన్ పత్రాల ప్రకారమే తన వాణిజ్య, ఆవాస ఆస్తుల విలువ మొత్తం రు. 75.47 కోట్లు, ఒక కిలో బంగారంతో సహా 88 లక్షల విలువైన బంగారు, వజ్రాభరణాలు, బ్యాంకులు, ఆర్థిక సంస్థల్లో రు. 11.39 కోట్ల డిపాజిట్లున్నాయని తెలియజేసింది. ఇది 2009-10 నాటి చిత్రం. 2007లో దాఖలు చేసిన అఫిడవిట్‌లో ఆమె ఆస్తి రు. 52 కోట్లు. ఇంత ఆస్తి కేవలం మూడు సంవత్సరాల కాలంలో రు. 52 కోట్ల నుండి రు. 88 కోట్లకు పెరిగిందంటే అది ఆమె చెమటోడ్చి సంపాదించిన ఆస్తి కాదని, అవినీతికి పాల్పడి సంపాదించిన ఆస్తే అని చిన్న పిల్లవాడిని అడిగినా చెబుతాడే, అలాంటిది ప్రధాని దృష్టికి రాలేదా? ఆయన దృష్టికి మరొకరు తీసుకొని రావాలా? దేశంలో డాలర్ మిలియనీర్లు ఎలా పెరుగుతూ వచ్చారో క్యాప్ జెమినీ, మెర్రిల్ లించ్ సంస్థలు తయారు చేసిన వరల్డ్ వెల్త్ రిపోర్ట్ ప్రకారం నికర విలువ ఆస్తులు గల భారతీయుల సంఖ్య ఎలా పెరుగుతూ వస్తుందో చూడండి.

| సంవత్సరం | సంపన్నుల సంఖ్య |
|---|---|
| 2005 | 70,000 |
| 2006 | 83,000 |
| 2007 | 1,00,015 |
| 2008 | 1,23,000 |
| 2009 (సంక్షోభ సంవత్సరం) | 84,000 |
| 2010 | 1,26,700 |

మన్మోహన్‌జీ, మీరు గొప్ప ఆర్థిక శాస్త్రవేత్తలు కదా, ఈ నివేదిక మీ దృష్టికి రాలేదా? అంతరాలు పెరుగుతున్నాయని నేను అంగీకరిస్తున్నానని చెప్పాను కదా అని మీరనవచ్చు. కాని అంతరాలు తొలగించడానికి ఏం చేస్తున్నారని చెప్పరేం? ప్రపంచ ఆర్థిక సంక్షోభంతో తగ్గిన సంపన్నుల సంఖ్య, ఒక్క సంవత్సరంలోనే యాభై శాతం పెరిగాయంటే, మీరు ఎటువంటి చర్యలు తీసుకోలేదని, తీసుకోబోవడం లేదని స్పష్టం కావడం లేదూ?

అర్థమయ్యేదేమంటే, ప్రజలు ఉద్యమిస్తేనే ఈ పరిస్థితిని చక్కదిద్దు కోగలరు.

*(రచయిత సీనియర్ పాత్రికేయులు, వీక్షణం గౌరవ సంపాదకులు)*

**కులం పుట్టుకను వివరించిన సిద్ధాంతాల్లో ముఖ్యమైన అంశాలు లోపించాయనీ, విస్మరణకు గురయిన కులాల ఆకాంక్షలు అనేక రూపాల్లో వ్యక్తమవుతున్నాయనీ అంటున్నారు డా. ఎం.ఎఫ్. గోపీనాథ్**

# కులాల ఆవిర్భావం, కొనసాగింపు

'వర్తమానాన్ని విమర్శించడానికి గతాన్ని తవ్వేవారికి మరణశిక్ష విధిస్తూ 22 శతాబ్దాల పూర్వం ఒక చైనా చక్రవర్తి శాసనాన్ని జారీ చేశాడు' – క్రిస్ హార్మాన్, ప్రపంచ ప్రజల చరిత్ర.

'నాకు వాస్తవాలు, వాస్తవాలు మాత్రమే కావాలి. వాస్తవాలు మాత్రమే జీవితంలో అవసరం' – 19వ శతాబ్దంలో చార్లెస్ డికెన్స్ రాసిన హార్డ్ టైమ్స్ నవల నుండి.

తరతరాలుగా భారతీయ సమాజాన్ని పట్టి పీడిస్తున్న సమస్య, ఈ దేశ అంతర్గత భద్రతకు, అతి ప్రమాదకరమైన సమస్య కుల విభజన. అనాది కాలంగా, ఈ దేశం మీద హూణులు, యవనులు, తురుష్కులు, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు జరిపిన దండయాత్రల నుండి నేటి ప్రపంచ బ్యాంక్ జరుపుతున్న ఆర్థిక దండయాత్ర వరకు, ఈ దేశ ఖనిజ సంపదను కొల్లగొట్టే మల్టీనేషనల్ కంపెనీల సెజ్‌ల వరకు, చివరికి భారతదేశ సార్వభౌమాధికారం ప్రమాదంలో పడటానికి, వామపక్ష విప్లవోద్యమాలు, హేతువాద ఉద్యమాలు, దళిత ఉద్యమాలు నత్తనడక పట్టడానికిని 'కులం' కారణమన్నది వాస్తవం. అందుకే 'భారతదేశాన్ని ఆంగ్లేయులు జయించలేదు. ప్రతిఘటన లేకుండా ఆ దేశం ఆత్మార్పణం చేసుకుంది' అంటారు టాల్‌స్టాయ్. ఇందుకు కారణం, దోపిడీ శాస్త్రమైన మను ధర్మ శాస్త్రాన్ని, కౌటిల్యుని అర్థశాస్త్రాన్ని చట్టబద్ధం చేయడమే. జనాభాలో 10 శాతం కూడా లేని వాళ్లు 70 శాతం ఆర్థిక వనరులను కైవసం చేసుకోడానికి, రాజకీయ, సామాజిక, సాహిత్య – సంస్కృతులను, విద్యా, వైద్య రంగాన్ని కులం ప్రభావితం చేసినంతగా మరే ఇతరాంశం చేయలేదంటే అతిశయోక్తి కాదు. జాతీయోద్యమ కాలం నుండి, దేశ విభజన వరకు, అశాంతికి అల్లకల్లోలానికి, అభివృద్ధి నిరోధకత్వానికి మన సమాజం కులాలుగా విడగొట్టబడటమే కారణం.

ఇందుకు సాక్ష్యాలుగా వాస్తవ జీవితంలోని కొన్ని సంఘటనల్ని మీ ముందుంచుతాను.

1. ఆంధ్ర రాష్ట్రంలో నక్సలైటు ఉద్యమాన్ని బలోపేతం చేసి, సి.పి.ఐ. (ఎం.ఎల్.) (పీపుల్స్‌వార్) పార్టీని స్థాపించిన కొండపల్లి సీతారామయ్య గారి ఎస్కేప్ కేసులో నేను ముద్దాయిగా ఉండడం వలన, 1984లో ఢిల్లీలోని సెంట్రల్ గవర్నమెంట్ హెల్త్ సర్వీస్ నుండి సస్పెండ్ చేయబడ్డాను. అప్పుడు ఖమ్మం వచ్చి, మెడికల్ ప్రాక్టీస్ పెడదామని, అప్పటికే ఒక హాస్పిటల్‌ని ఏర్పాటు చేసుకొన్న మాజీ నక్సలైటు దగ్గరకు వెళ్లి అడిగాను. ఆ డాక్టర్ ఎం.బి.బి.ఎస్., డి.జి.ఒ. నేను ఎం.డి., జనరల్ మెడిసిన్. 'మీ హాస్పిటల్‌లో కన్సల్టేషన్ పెట్టుకుందామను కుంటున్నాను, మీరు కూడా కొండపల్లి శిష్యులే కదా! మీ సహకారం కావాలి' అన్నాను. వెంటనే తను 'మీదే కులం? అడుగుతున్నందుకు ఏమీ అనుకోవద్దు' అన్నారాయన. నేను ఎస్.సి. అన్నాను. ఈ జిల్లాలో మా కులానిదే డామినేషన్, మీరు ఏ విధంగా సక్సెస్ అవుతారిక్కడ అన్నారు.

2. నేను 10వ తరగతి పాస్ అయిన తరువాత ఆంధ్ర లయోలా కాలేజిలో ఇంటర్ చదవాలనే కోరికతో 6 నెలలు ఆగాల్సి వచ్చింది. ఆ ఆరు నెలలు నేను మట్టిపనికి, రోడ్డుపనికి, నాట్లు వేసేపనికి వెళ్లాను. ఒకరోజు మా ముఠా వాళ్లమంతా మధ్యాహ్నం బువ్వలు తినడానికి కూర్చున్నాం. కిట్టారెడ్డి అనే మా తోటి కూలీ, మిగతా నలుగురు రెడ్డి కులీలను తీసికొని, కాలువ నీళ్ల పక్కన, మాలల కన్నా ఎగువ వైపు కూర్చున్నారు. నేను అడిగాను – 'కిట్టారెడ్డి మావా! అందరం కల్సే గదా నాట్లు వేస్తున్నాం. మరి బువ్వ తినేపుడు మీరు నలుగురు మా పైన కూర్చుంటున్నారెందుకు' అని. 'అది అంతే అల్లుడు. మా కులం కట్టుబాటిది. మేము కూటికే పేదోళ్లం గాని, కులానికికాదు' అన్నాడు. ఓహో! అనుకున్నాను.

3. మా ఊళ్లో నేను ప్రైమరీ స్కూల్‌లో చదివేటపుడు మా వూరు పంతులమ్మ (బ్రాహ్మణ) ఒక పరీక్ష పెట్టారు. ఒక పుస్తకంలో రాజస్తాన్, జంతర్ మంతర్, భోజ్‌పూర్, ఉదయ్‌పూర్ లాంటి పదాలతో కూడిన పాఠం ఉంది. ఈ పాఠాన్ని తప్పుల్లేకుండా అందరూ చదవాలి. ఒకవేళ చదవకపోతే, చదివిన వాళ్లతో లెంపకాయ వేయిస్తానన్నారు పంతులమ్మ గారు. మొదట మా క్లాస్‌లోని రెడ్డి పిల్లల్ని చదవమంది. ఆ పదాల్ని పలకలేక చదవలేకపోయారు. నన్ను చదవమంటే నేను చదవడం జరిగింది. పంతులమ్మ లెంపకాయలెయ్యమంది. ఒక రెడ్డి పిల్లవాడిని ఒక చెంపమీద లెంపకాయవేసాను. వెంటనే పెద్ద గొడవ బయట నుండి మొదలై పంతులమ్మని నిలదీయడానికి ఒక గుంపు స్కూల్లోకి వచ్చింది. 'అదనా మాలోడి చేత రెడ్డోల్ల పిల్లల్ని కొట్టిస్తావా?' పంతులమ్మ బిక్కమొఖం వేసి స్కూల్‌కి సెలవిచ్చింది.

4. 1996లో మొట్ట మొదటిసారి, గుండెజబ్బుల హాస్పిటల్‌ని ప్రారంభించాలని నిర్ణయించుకొని ఖమ్మం వచ్చి నా మిత్రుడితో సంప్రదించాను. తనిచ్చిన సలహా ఏమిటంటే, ఇక్కడ కొంతమంది పెద్దలున్నారు. వాళ్ల పర్మిషన్ లాంటిది తీసుకోవడం మంచిదన్నారు. ఎవరు వాళ్లు అంటే మా జిల్లాకు వలసవచ్చి, జిల్లాను అన్ని రంగాల్లో దోచుకుంటూ జిల్లాని సర్వనాశనం చేస్తున్న వాళ్లు. అందుకనే నేను కనీసం ప్రారంభోత్సవం కూడా చేయకుండా నా ప్రాక్టీస్ మొదలుపెట్టాను. బహుశా జిల్లా హెడ్‌క్వార్టర్స్‌లో ఇంటెన్సివ్ కేర్ యూనిట్ పెట్టి, ప్రారంభోత్సవం కూడా చేయని హాస్పిటల్ ఇదేనేమో చరిత్రలో.

ఈ పై సంఘటనలన్నిటికి, నా కులానికి సంబంధం ఉందా, లేదా? ఈనాడు, రాజకీయ పార్టీలు కులాల వారీగా లేవా? రెడ్లకు కాంగ్రెస్, కమ్మలకు తెలుగుదేశం, ప్రభుత్వాలు నడిపే ఉభయ కమ్యూనిస్టు పార్టీలు, నక్సలైటు పార్టీ, కాపులకి ప్రజారాజ్యం పార్టీ, వెలమలకి టి.ఆర్.ఎస్., దళితులకి బి.ఎస్.పి. ప్రజాస్వామ్యానికి నాల్గవ స్తంభమైన పత్రికారంగం కులాలుగా ఆర్గనైజ్ కావడం, ఫలానా పత్రికలో ఫలానా సంఘటనకి సంబంధించిన ఆ పత్రిక, ఆ ఛానల్‌లో ఏ వర్షన్ వస్తుందో ముందే ఊహించే స్థితికి ప్రజలు వస్తున్నారంటే మీడియా కూడా కులాల చట్రంలో ఇరుక్కుని తన్ను తాను శిక్షించుకుంటుందా లేదా? చివరికి కోర్టుల్లో న్యాయం కూడా కులాతీతంగా లేదే.

ఇక సమాజంలోని అవినీతిని, అక్రమ పోకడలని నిలదీసి, దిశానిర్దేశాలు చేయవలసిన సాహిత్యం కులాభిమానులకు అతీతంగా సాగుతుందా? ఒకటేమిటి, భారతదేశ పౌరజీవనం మొత్తం విశ్లేషిస్తే ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాహిత్య, సాంస్కృతిక, విద్యా, వైద్య రంగాలన్నీ కులం కంపు కొడుతున్నాయి. ఇంతగా విధ్వంసం సృష్టిస్తున్న ఈ 'కులం' జాడ్యానికి కారణాలు తెలుసుకోవాల్సిన బాధ్యత భారతీయులకే కాదు విదేశీయులకీ అవసరం. డా. కేట్కర్ ఎప్పుడో అన్నట్లు, ఈ కుల జాడ్యం భారత సరిహద్దులు దాటి ఇప్పుడు ఇంగ్లండ్, అమెరికాల్లో కూడా కులాల మధ్య ఘర్షణ వాతావరణం సృష్టిస్తోంది. (అమెరికా తెలుగు అసోసియేషన్స్ కమ్మ, నాన్ కమ్మల అసోసియేషన్‌గా విడిపోయింది. ఇంగ్లండ్‌లో ఇండియన్ డాక్టర్స్‌లోని కుల వివక్ష గురించి, ఇంగ్లండ్ చట్టాలు తల గోక్కుంటున్నాయి). అందుకే భారతదేశ భవిష్యత్తు కుల నిర్మూలన మీద ఆధారపడి ఉంది. ఈ దేశ రాజకీయ ప్రజాస్వామ్యం, సామాజిక, ఆర్థిక ప్రజాస్వామ్యం మీద ఆధారపడి ఉంది. సామాజిక, ఆర్థిక రంగాల్లో ప్రజాస్వామ్యం లేకుండా రాజకీయ ప్రజాస్వామ్యమనేది ఉత్త డొల్ల. అందుకే కుల నిర్మూలన జరగాలి. కుల నిర్మూలన జరగాలంటే కులాలు ఏలా ఏర్పడ్డాయి? అవి ఎలా కొనసాగుతున్నాయి? అనే విషయాలు సామాన్య ప్రజలకు కూడా తెలియాలి.

కులాల పుట్టుక గురించి అనేక మంది అనేక సిద్ధాంతాలను ముందుకు తెచ్చారు. ఈ సిద్ధాంతాలన్నిటిలో ఎక్కడో మిస్సింగ్ లింక్, లోపం కనిపిస్తుంది. నేను సంప్రదించిన పుస్తకాల్లో 'కులాల పుట్టుక' అనే అధ్యాయాల్లో చాలా విషయాలు చర్చించిన వ్యాసకర్తలు అసలు విషయం వచ్చేవరకు తప్పించుకుంటున్నారనే భావన కలుగుతుంది. అంతేకాదు, నేటి విద్యావంతుల్లోను, వివిధ రకాల రాజకీయ, సామాజిక ఉద్యమకారుల్లోను, వామపక్ష మేధావుల్లోను కులాల పుట్టుక గురించి ఒక సమగ్ర సమాచారం గాని, శాస్త్రీయ వివరణ గానీ లేకపోవడం విచారకరం. ఫూలే – అంబేద్కర్ నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్స్ ఆధ్వర్యంలో జరుగుతున్న అధ్యయన తరగతుల్లో చాలా సార్లు ఈ అంశం చర్చకొచ్చినపుడు కూడా సరియైన అవగాహన ఉన్న వాళ్లు కనబడలేదు. కుల సమస్య మీద, పరిశోధించిన విదేశీయుల్లో డెంజల్ ఇబ్బస్టెన్, జె.సి. నెస్‌ఫీల్డ్, సెనార్ట్, ఎచ్. రైస్లీలు ప్రముఖులు. డాక్టర్ కేట్కర్, ప్రొఫెసర్ జి.ఎస్. ఘుర్యే, డి.డి. కోశాంబి, రోమిల్లా థాపర్, ఆర్.ఎస్. శర్మ, ఇర్ఫాన్ హబీబ్, మనోరంజన్ మొహంతీలు దేశీయ ప్రముఖులు. వీరందరికీ భిన్నంగా, కుల దౌష్ట్యానికి గురైన బి.ఆర్. అంబేద్కర్ ప్రతిపాదనలు పరిశీలించ వలసినవి. పైన పేర్కొన్న ప్రముఖుల ప్రతిపాదనలని పరిగణలోకి తీసుకొనే ముందు సుప్రసిద్ధ చరిత్రకారుడు ఎడ్వర్డ్ హేలట్ కార్ (ఇ.ఎచ్.కార్) చెప్పిన విషయాల్ని గుర్తుంచుకోక తప్పదు. 'చరిత్రని చదవడానికి ముందు చరిత్రకారుణ్ని గురించి తెలుసుకోండి. చరిత్రకారుణ్ని గురించి తెలుసుకొనే ముందు, అతడు జీవించిన చారిత్రక రాజకీయ వాతావరణాన్ని అధ్యయనం చేయండి' అంటారు కార్. నాకనిపిస్తుంది, ఈ దేశంలోని చరిత్రకారుల్ని, వారి ప్రతిపాదనలని తెలుసుకొనేముందు, ముఖ్యంగా వారి కులం గురించి, ఆ కులంలోని మెజారిటీ ప్రజల జీవన విధానం గురించి, శ్రమతో అతని / ఆమె కులానికున్న సంబంధం గురించి ఆ కులం భారతీయ సామాజిక చట్రంలో ఏ స్థానంలో అంటే దోపిడీ కుల స్థానమా లేక దోపిడీకి గురయ్యే కులాల స్థానమా? అనేది తెలుసుకోవడం మంచిది. ఇంకా అతనిది / ఆమెది ఏ సంస్కృతి? దోపిడీ కుల సంస్కృతా లేక తద్వ్యతిరేకమైన సంస్కృతా అనేది కూడా ముఖ్యం. పాఠకుడు కచ్చితంగా ఈ వివరాల్లోకి వెళ్లవలసి ఉంది. గ్రాంసీ మేధావుల గురించి వ్యాఖ్యానించే టప్పుడు వర్గాతీత మేధావులు అనేది ఒక మిథ్య అంటారు. కుల సమాజంలో కులాతీత మేధావులుంటారని నేను నమ్మను. భారతదేశ చరిత్రను బ్రాహ్మణీయ భావజాల గుత్తేదారుల నుండి రక్షించుకోవాల్సిన బాధ్యత బహుజన మేధావులదే. అందుకే కులాల పుట్టుకని, వాటి కొనసాగింపుకి సంబంధించిన సిద్ధాంతాల ప్రామాణికతను ప్రతిపాదించిన వారి పునాదుల నుండి పరిశీలించాలి. ఇప్పటి వరకు ఎవరు ఏ సిద్ధాంతాన్ని ప్రతిపాదించినా, కులాల పుట్టుక (ఒరిజిన్ ఆఫ్ కాస్ట్)కు సంబంధించిన ప్రతిపాదనలు ఈ కింది విధంగా ఉన్నాయి–

1. మతపరమైన దగాకోరు సిద్ధాంతాలు

అ) రుగ్వేదంలో ఉన్న పదవ మండలం, పురుష సూక్తం

బ్రాహ్మణోస్య ముఖమాసీత్।
బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః
పద్భ్యాగ్ం శూద్రో అజాయత

ఆయన ముఖం బ్రాహ్మణుడుగా అయింది; చేతులు క్షత్రియుడుగా అయింది; తొడలు వైశ్యునిగా అయింది, ఆయన పాదాల నుండి శూద్రుడు ఉద్భవించాడు.

ఆ) భగవద్గీతలోని క్రిష్ణుడి బోధ

చాతుర్వర్ణం మయా సృష్టం
గుణ కర్మ విభాగశః
తస్య కర్తా రమపి
మాం విద్ధ్య కర్తారమ వ్యయం

అంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలు నాల్గింటిని, వారి వారి గుణాలను బట్టి, ఆ గుణాలకు అనుగుణంగా చేసే కర్మలను బట్టి విభజించి నేనే సృష్టించాను.

2. శాస్త్రీయంగా ఆలోచిస్తారు అనుకొన్న మేధావుల ప్రతిపాదన

3. బి.ఆర్. అంబేద్కర్ ప్రతిపాదన

ఇప్పుడు పై మూడు రకాల ప్రతిపాదనల్ని గురించి తెలుసుకొందాం.

### వేదాలు – కులాలు

'ఈ చరాచర జగత్తు అంతా దైవాధీనం; దైవం మంత్రాధీనం; మంత్రం బ్రాహ్మణాధీనం' అన్న ఇండో–ఆర్యన్ మార్కిక దోపిడీ సిద్ధాంతం నుండి పుట్టిందే రుగ్వేదం. రుగ్వేదం పదవ మండలంలో, భుజాల నుండి, తొడల నుండి, కాళ్ల నుండి నాలుగు వర్ణాలు పుట్టాయని, ప్రకృతి నియమాలకి పచ్చి విరుద్ధమైన సిద్ధాంతాల్ని ప్రతిపాదించి దాని చుట్టూ

*తెలంగాణ ఉద్యమాన్ని తక్కువ చేసి చూపడం, వక్రీకరించడం మొత్తంగా అవమాన పరిచే విధంగానో, రెచ్చగొట్టే విధంగానో ఉంటున్న సీమాంధ్ర మీడియా స్వభావాన్ని వివరిస్తున్నారు* **పిట్టల రవీందర్**

# తెలంగాణ ఉద్యమం - సీమాంధ్ర మీడియా

ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమం దీర్ఘకాలికంగా కొనసాగుతున్నది. దీర్ఘకాలిక ఉద్యమాలకు తక్షణ ప్రయోజనాలకంటే శాశ్వత ప్రయోజనాలే ఎంతో ముఖ్యమైనవి. సమిష్టి, సామాజిక ప్రయోజనం లేకుండా దీర్ఘకాలిక ఉద్యమం ఏ పద్ధతిలోనూ ముందుకు సాగడం సాధ్యం కాదు. అయితే తక్షణ రాజకీయ ప్రయోజనాల కోసం, దీర్ఘకాలిక ప్రజా ఉద్యమ లక్ష్యాలను దెబ్బతీసే ప్రయత్నం జరిగిన సందర్భాలలోనే బాహ్య ప్రపంచానికి, ఉద్యమ సమాజానికి మధ్యన వైరుధ్యాలు ఉత్పన్నమయ్యేందుకు అవకాశం కలుగుతుంది. ఇట్లాంటి కీలకమైన సందర్భాలలో మీడియా నిర్వహించాల్సిన పాత్ర ఎంతో ప్రాధాన్యతను కలిగిఉంటుంది. కానీ సీమాంధ్ర సంపన్న వర్గాల విషపుత్రికలుగా విరాజిల్లుతున్న మీడియా, అన్ని అవరోధాలను తట్టుకుని లేచినిలబడి ఉధృతంగా ముందుకు సాగుతున్న తెలంగాణ ఉద్యమంపై విషం కక్కుతున్నది. ఇట్లాంటి సందర్భాలలో మీడియాకు, ఉద్యమ సమాజానికి మధ్యన తలెత్తే వైరుధ్యాలకు గల నేపథ్యాన్ని, కారణాలను విశ్లేషించుకుని, స్వీయ సమీక్షకు పూనుకోవడమే ఉభయ వర్గాలకు ఉత్తమమైన మార్గం. కానీ సీమాంధ్ర ఏకపక్ష మీడియా నుండి ఇట్లాంటి ప్రయత్నాలు ఊహించడం అత్యాశే అవుతుంది.

ప్రజా ఉద్యమం ద్వారా ప్రజలు వ్యక్తం చేసే సామూహిక ఆకాంక్షలను గౌరవించవలసిన బాధ్యత మీడియాపై ఉంటుంది. ఉద్యమ సమాజానికి, మీడియాకు మధ్యన పొడసూపుతున్న వైరుధ్యాలపై మీడియా స్వీయ సమీక్షకు పూనుకోకపోవడం, ఉద్యమ క్రమంలో ప్రజలు వ్యక్తం చేస్తున్న సామూహిక ఆకాంక్షలను గౌరవించకపోవడం, దీర్ఘకాలిక ఉద్యమ ప్రయోజనాలకంటే, తక్షణ రాజకీయ ప్రయోజనాలకే మీడియా ప్రాధాన్యతను ఇవ్వడం, ఉద్యమ క్రమంలో అందివచ్చిన ప్రతి అవకాశాన్ని ఉద్యమాన్ని అణచివేసే ధోరణిలోఉపయోగించుకోవడం తదితర కారణాల ఫలితంగానే మీడియా విశ్వసనీయతపట్ల, మీడియా జవాబుదారీతనంపట్ల అనేక అనుమానాలు, అభ్యంతరాలు వ్యక్తం అవుతున్నాయి. తెలంగాణ రాష్ట్రం కోసం తెలంగాణ ప్రజలు ప్రజాస్వామికంగా, శాంతియుతంగా వ్యక్తం చేస్తున్న ఆకాంక్షలను అర్థం చేసుకోవడంలోనూ, ప్రతిబింబించడం లోనూ, ప్రసారం చేయడంలోనూ సీమాంధ్ర ఆధిపత్య మీడియా

---

అనేక కట్టుకథలని అల్లించి, పూజారి వర్గం, పూజారి వర్గానికి వ్యతిరేకి అయిన, యదువంశ రాజైన క్రిష్ణుడు, చాతుర్వర్ణాన్ని, మనుషుల గుణగణాన్ని బట్టి నేనే సృష్టించానంటాడు భగవద్గీతలో. ఈ రెండు ప్రతిపాదనలు శాస్త్రీయ పరిశీలనకు నిలిచేవి కావు. ఈ తప్పుడు సిద్ధాంతాల్ని శ్రామిక కులాలు తెలుసుకొని తిరుగుబాటు చేస్తాయన్న ఉద్దేశంతోటే బ్రాహ్మణ, క్షత్రియ కులాలు కుమ్మక్కై శూద్ర కులాలకి, 'అక్షరాన్ని' దూరం చేసాయి. ఈ కుట్రపూరిత రచనల బండారం మహాత్మా జ్యోతిరావ్ పూలే, బాబాసాహెబ్ అంబేద్కర్‌లు బహిర్గత పరిచారు.

**కులాలు – మేధావుల ప్రతిపాదనలు**

విదేశీ చరిత్రకారులకి గానీ, నరసర్గ శాస్త్రవేత్తలకు గానీ, దుబాసీలుగా (అనువాదకులుగా) వ్యవహరించింది ఈ దేశంలోని బ్రాహ్మణీయ భావజాలాన్ని ఒంటపట్టించుకున్న వారే. అందుచేతనే భారతదేశం గురించిన విదేశీయుల రచనలలో, ఎక్కువగా బ్రాహ్మణీయ భావజాలాలతో రాయబడ్డ వేద వ్యాఖ్యానం, సాహిత్యం, సంస్కృతుల ప్రభావం ఉన్నది. తద్విరుద్ధమైన సాహిత్యం (లోకాయత, చార్వాక తదితరాలు) క్రీస్తు శకారంభానికే పూర్తిగా ధ్వంసం చేయబడ్డదని పండిట్ నెహ్రూనే తన డిస్కవరీ ఆఫ్ ఇండియాలో రాసారు. కాబట్టి కులాల పుట్టుకకు కొనసాగింపుకు సంబంధించి, స్వదేశీ, విదేశీ రచయితల, శాస్త్రవేత్తల అభిప్రాయాల్లో పెద్దగా గుణాత్మకమైన తేడాలుంటాయని భావించనవసరం లేదు. ఇందుకనుగుణంగా వారి ప్రతిపాదనల్లో, కులం జట్టు లక్షణాలనే వివరించారు. ఆ జట్టుకి గల కారణాలు వివరించలేక పోయారు. వారందరి ప్రతిపాదనల్ని ఈ కింది విధంగా సంక్షిప్త పరచవచ్చు.

1) వర్ణాలు, కులాలుగా పరిణమించాయి.

2) వృత్తుల ద్వారానే కులాలు వచ్చాయి.

3) ఆనాటి సమాజ శ్రేయస్సు కొరకు అందరి అంగీకారంతో ఒక్కొక్కరు ఒక్కొక్క వృత్తిని చేపట్టి వృత్తి ప్రావీణ్యం కొరకు వంశ పారంపర్యంగా వృత్తులు స్థిరీకరింపబడి నందువల్లనే కులాలు ఏర్పడ్డాయి.

4) వేదకాలంలో వేదమంత్రాలు చదివే పూజారి, చెప్పులు కుట్టే చర్మకారుడు ఒకే రకమైన సామాజిక గుర్తింపు, గౌరవం పొందారు (శూద్రులెవరు – ఆర్.ఎస్. శర్మ). తరువాతి కాలంలోనే కొందరు దుర్మార్గులు అంటరానితనాన్ని సమాజంలోకి చొప్పించి కుల వ్యవస్థని భ్రష్టుపట్టించారు కాని లేకుంటే కులవ్యవస్థ అద్భుతమైన సాంఘిక వ్యవస్థ (మహాత్మా గాంధీ).

*(రచయిత హృద్రోగ నిపుణులు)*

*(ఇంకా ఉంది)*

వీ

అనుసరిస్తున్న వైఖరి తెలంగాణ విముక్తి ఉద్యమానికి తీవ్ర విఘాతం కలిగిస్తున్నది.

తెలంగాణ ఉద్యమంపైన మానసిక నియంత్రణ, ఆధిపత్యాన్ని కొనసాగిస్తున్న 'సీమాంధ్ర మీడియా' ముఖ్యంగా మూడు పద్ధతుల్లో ఉద్యమానికి విఘాతం కలిగిస్తున్నది. ఉద్యమ క్రమంలో వెలుగులోకి వస్తున్న వాస్తవాలను వక్రీకరించడం, జరగనివి జరిగినట్లుగా, జరిగినవి జరగనట్లుగా చిత్రీకరించడం, ఉద్యమకారులను రెచ్చగొట్టేందుకు, ఉద్యమాన్ని అణచి వేసేందుకు అందివచ్చిన అవకాశాలను సమర్థవంతంగా వాడుకోవడం ఇందులో ముఖ్యమైనవి. అంతేకాకుండా తెలంగాణ ఉద్యమంలో చురుకైన పాత్రను నిర్వహిస్తున్న వ్యక్తులను, శక్తులను, సమూహాలను, సంస్థలను సంఘటితం కాకుండా నిలువరించడంలోనూ సీమాంధ్ర మీడియా చురుకైన పాత్రను పోషిస్తున్నది. తెలంగాణ ఉద్యమంలో చేరిన స్వార్థపర శక్తులను సీమాంధ్ర మీడియా ఇందుకు పావులుగా, ప్రయత్నపూర్వకంగా వాడుకుంటున్నది. ఈ విషయంలో ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియా సంస్థలు సమ ఉజ్జీలుగానే వ్యవహరిస్తున్నాయి. రోజూ పొద్దున్నే చద్దన్నంలాంటి వార్తల విశ్లేషణకు ఎంచుకునే అంశాలను ప్రైవేటు టెలివిజన్ ఛానళ్ళు సీమాంధ్ర ఆధిపత్యంలోని దినపత్రికలనుండి ఎంచుకుంటాయి. ప్రింట్‌మీడియాలో వచ్చిన వార్తల్లోని వ్యక్తులను, ప్రత్యర్థులను, విషయపరిజ్ఞానంతో సంబంధం లేకుండా వాక్చాతుర్యం కలిగిన, కరుడుగట్టిన తెలంగాణ వ్యతిరేకులను ఎలాక్ట్రానిక్ మీడియా ఎగదోస్తున్నది. ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియా అనుసరించే లోపాయికారీ పద్ధతుల ఫలితంగా కొంతమంది అనామకులు ఉన్నట్టుండి మీడియా విశ్లేషకులుగా అవతారమెత్తారు. తెలంగాణ ఉద్యమంపై చేతనైనంత దుమ్మెత్తి పోస్తున్నారు.

తెలంగాణ ఉద్యమాన్ని దెబ్బకొట్టేందుకు సీమాంధ్రలో సమాంతర సంఘాలను సృష్టించే నీచపు పనులకు కూడా సీమాంధ్ర మీడియా ఒడిగట్టుతున్నది. ఆంధ్రా మేధావుల సంఘం పేరున చలసాని శ్రీనివాస్, రాయలసీమ హక్కుల పోరాట సమితి అంటూ టి.జి. వెంకటేశ్ లాంటి ఏకసభ్య సంఘాలకు సీమాంధ్ర మీడియా ఇస్తున్న ప్రాధాన్యత ఇందుకు నిదర్శనం. సందర్భమేదైనా, సంఘటన ఏదైనా, అంశం ఏదైనా ఈ ఇద్దరు సీమాంధ్ర నేతలే మీడియా విశ్లేషకులుగా సర్వకాల సర్వవ్యవస్థల యందు సీమాంధ్ర మీడియాకు అందుబాటులో ఉంటారు.

తెలంగాణలో ఉద్యమ జె.ఎ.సి.లకు పోటీగా సీమాంధ్రలో ఉత్తుత్తి జె.ఎ.సి.లను ప్రోత్సహించడంలోనూ సీమాంధ్ర మీడియా పాత్ర శంకించ దగినదే. తెలంగాణ ఉద్యమం ఉధృతంగా సాగుతున్న సమయంలో తెరపైకి వచ్చిన సమైక్యాంధ్ర జె.ఎ.సి.లు, ఆ తరువాతి కాలంలో కనుమరుగైన వాస్తవాన్ని సీమాంధ్ర మీడియా ఎక్కడా ప్రస్తావించలేదు. కారణాలను విశ్లేషించే ప్రయత్నంకూడా చేయలేదు. మరోవైపున ఉద్యమ క్రమంలో ఎదురయ్యే ప్రతికూల పరిస్థితులను ఎగదోయడానికి, తెలంగాణ ఉద్యమకారులను రెచ్చగొట్టడానికి ఎట్లా వ్యాఖ్యానించాలో కూడా సీమాంధ్ర సర్వజ్ఞులకు లోపాయికారీగా ముందస్తు శిక్షణ ఇచ్చే ఛానళ్ళు, వాటికి ఊడిగం చేసే వీరవిధేయులైన సీమాంధ్ర జర్నలిస్టులు (?) మీడియాలో రాజ్యమేలుతున్నారు. ఇట్లాంటి జర్నలిస్టుల అతితెలివి ఎక్కడిదాకా పోయిందంటే ... విశ్లేషణ పేరిట నిర్వహించే కార్యక్రమాలలో ప్రశ్నల్లోనే జవాబును జోడించి సీమాంధ్ర విశ్లేషకులకు ఉప్పందించే దాకా వీరి జర్నలిజం తెలివి మీరిపోయింది. తెలంగాణ ఉద్యమ సానుభూతిపరుల నుండి వచ్చే ధీటైన జవాబులకు అడ్డం తగిలి, అర్థాంతరంగా చర్చలను ముగించే ఉన్మత్తస్థితిదాకా కొంతమంది జర్నలిస్టులు దిగజారిపోయారు. టి.వి.9 రజినీకాంత్, ఎన్.టి.వి. కొమ్మినేని శ్రీనివాస్ తదితర కరడుగట్టిన తెలంగాణ ఉద్యమ విఘాతకులు చర్చలు నిర్వహిస్తున్న తీరు, పనికిమాలిన వ్యాఖ్యానాలు, తలాతోకాలేని ప్రశ్నలు, చిలిపిచేష్టలు, వెకిలినవ్వులు చూసేవాళ్లకు రోతపుట్టిస్తున్నాయి.

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు ఆకాంక్ష ఎంతటి బలీయమైనదో ఇప్పుడు ఎవ్వరూ, ఎవ్వరికీ ప్రత్యేకించి చెప్పాల్సిన అవసరం లేదు. 1952 ముల్కీ ఉద్యమం నుండి నేటివరకు అంటే గడచిన 58 సంవత్సరాల సుదీర్ఘ కాలంపాటుగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమం అనేక రూపాల్లో, అనేక సందర్భాలలో ప్రజాస్వామిక, శాంతియుత పద్ధతుల్లో వ్యక్తం అవుతూనేఉన్నది. 1952లో జరిగిన ముల్కీ ఉద్యమం సందర్భంగా ఏడుగురు విద్యార్థులు పోలీసుల తుపాకీ గుళ్లకు నేలకొరిగారు. 1969లో జరిగిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో సుమారు 370 మంది విద్యార్థులు తమ విలువైన ప్రాణాలను త్యాగం చేసారు. ఇప్పుడు జరుగుతున్న మలిదశ ఉద్యమంలో ఇప్పటికే సుమారు 450మంది బలవన్మరణాలపాలయ్యారు.

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు కోసం 1952, 1969లలో జరిగిన మరణాలు పోలీసుల కాల్పుల ఫలితంగా జరిగాయి. కానీ (2009-10) గడచిన తొమ్మిది మాసాలుగా చోటుచేసుకున్న బలవన్మరణాలకు కారణాలు వేరుగా ఉన్నాయి. సీమాంధ్ర ఆధిపత్యంలోని రాజకీయ పార్టీలు తెలంగాణ డిమాండ్ పట్ల వివిధ సందర్భాలలో అనుసరిస్తున్న ద్వంద్వ ప్రమాణాలు, విభిన్న ప్రకటనలు, పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు, తెలంగాణ ఆత్మగౌరవాన్ని కించపరిచేరీతిలో వ్యవహరిస్తున్న తీరుతెన్నులు, తెలంగాణ ప్రజలను రెచ్చగొడుతున్న ధోరణులు ఆత్మహత్యలకు పురికొల్పుతున్నాయనే అభిప్రాయం సర్వత్రా వ్యక్తం అవుతున్నది. తెలంగాణ ఉద్యమం పట్ల సీమాంధ్ర మీడియా అనుసరిస్తున్న విపరీత ధోరణులు సైతం తెలంగాణలో వెలుగుచూస్తున్న ఆత్మహత్యలకు ప్రేరకంగా పనిచేస్తున్నాయనే అభిప్రాయం కూడా తెలంగాణ సమాజంలో నెలకొని ఉంది. తెలంగాణ ప్రాంతంలో గడచిన తొమ్మిది మాసాలుగా జరుగుతున్న ఆత్మహత్యలపై స్వచ్ఛంద సంస్థలు నిర్వహించిన సర్వే గణాంకాలు కూడా ఇదే విషయాన్ని నిర్ధారిస్తున్నాయి. తెలంగాణ కోసం ఆత్మహత్యలకు పాల్పడిన వారిలో అత్యధికులు రాత్రిపగలు ప్రైవేటు టెలివిజన్ ప్రసారాలు చూసిన అనంతరమే ఆత్మహత్యలు చేసుకున్నట్లు ఈ నివేదికలు స్పష్టం చేసాయి.

తెలంగాణ ఉద్యమాన్ని అవమానపరిచే రాజకీయశక్తులపైన తెలంగాణ ఉద్యమకారులు ఒక ఖచ్చితమైన వైఖరితోనూ, స్పష్టమైన నిర్ణయంతోనూ వ్యవహరిస్తున్నారనేది అనేక సందర్భాలలో నిరూపిత మయ్యింది. 'ఓదార్పుయాత్ర' పేరిట వై.ఎస్.జగన్మోహన్‌రెడ్డి మహబూబాబాద్ ప్రాంతంలో పర్యటించేందుకు ప్రయత్నించిన సందర్భంలో ప్రజల నుండి వచ్చిన ప్రతిఘటన ఒక ఉదాహరణ మాత్రమే. వై.ఎస్. జగన్మోహన్‌రెడ్డిని సీమాంధ్ర సంపన్నవర్గాల ప్రతినిధిగా

గుర్తించడం వల్లనే ఈ ప్రతిఘటన సాధ్యమయ్యింది. అయితే ఈ సంఘటన సమైక్యవాదుల కుట్రలకు తెలంగాణ వాదులు చెప్పిన జవాబుగా కాకుండా, సీమాంధ్ర నాయకత్వంపై చేసిన దాడిగానే సీమాంధ్ర మీడియా ప్రొజెక్ట్ చేసింది. ఈ సంఘటనకు వ్యతిరేకంగా సీమాంధ్ర రాజకీయ నాయకత్వాన్ని పార్టీలకు అతీతంగా సమీకరించే బాధ్యతను సీమాంధ్ర మీడియా తలకెత్తుకుని, సమర్థవంతంగా నిర్వహించింది.

అంతకు పూర్వం 9 డిసెంబర్ 2009 రోజున కేంద్ర హోంమంత్రి చిదంబరం చేసిన ప్రకటన తర్వాత జరిగిన రాజకీయ పరిణామాలను, ఉత్తుత్తి (స్పాన్సర్డ్) ఉద్యమాలను బూతద్దంలో చూపిన తీరు, ముఖ్యంగా విజయవాడ పార్లమెంటు సభ్యుడు లగడపాటి రాజగోపాల్ చేసి చూపించిన టక్కుటమార గారడీలకు హీరోయిజాన్ని అంటగట్టి ప్రసారం, ప్రచారం చేయడంలోనూ సీమాంధ్ర మీడియా అత్యంత నీచమైన, అసహ్యకరమైన, హేయమైన పాత్రను నిర్వహించింది. ఇదే సందర్భంలో ఇరు ప్రాంతాలకు చెందిన ప్రజా ప్రతినిధులు చేసిన రాజీనామాలు, వాటి ఆమోదం, ఉపసంహరణ, తిరస్కృతి పట్ల అసెంబ్లీ స్పీకర్ అనుసరించిన సీమాంధ్ర పక్షపాత, పచ్చి తెలంగాణ వ్యతిరేక ధోరణులను ప్రశ్నించడంలోనూ సోకాల్డ్ సీమాంధ్ర మీడియా అత్యంత ప్రమాదకరమైన పాత్రను పోషించింది.

తెలంగాణ ఉద్యమం పట్ల, తెలంగాణ ప్రజలు ప్రతి సందర్భం లోనూ వ్యక్తం చేస్తున్న ఆకాంక్షల పట్ల సీమాంధ్ర మీడియా అనుసరిస్తున్న వ్యతిరేక ధోరణులు, తెలంగాణ ప్రజల ఆత్మగౌరవాన్ని దెబ్బతీసిన సందర్భాలు కోకొల్లలు. ఉదాహరణకు కొన్ని సందర్భాలను ప్రస్తావించ వలసి ఉన్నది. దీర్ఘకాలికంగా కొనసాగుతున్న తెలంగాణ ఉద్యమం గత డిసెంబర్ నుండి ప్రజా ఉద్యమంగా మారిపోయింది. ప్రజలు, పార్టీలు, కులాలు, మతాలు, అన్ని వర్గాలు ఒక్కటై సంఘటిత ఉద్యమాన్ని కొనసాగించారు. తమ ఆకాంక్షను మరింత పదునైన పద్ధతిలో ప్రకటించారు. భూపాలపల్లి లాంటి నల్లబంగారు నేలలో 270 రోజులకు పైగా నిరహార దీక్షా శిబిరం కొనసాగుతూనే ఉన్నది. తెలంగాణ సాంస్కృతిక ప్రతీకలన్నీ ఉద్యమంలో భాగమయ్యాయి. పండగపబ్బాలు, పెండ్లిళ్లు, చావులుసైతం ఉద్యమ సందర్భాలుగా మారాయి. ఇంతటి ఉధృతమైన ఉద్యమం పైన ఏ ఒక్క సీమాంధ్ర మీడియా కూడా కనీసం ఒక్క కార్యక్రమాన్ని ప్రత్యేకంగా ఇచ్చిన సందర్భంలేదు. 12 నియోజక వర్గాల్లో ఉపఎన్నికలు జరుగుతుంటే మూడు రోజులపాటు చంద్రబాబు నిర్వహించిన బలవంతపు బాబ్లీ పర్యటన రాత్రిపగలు తేడాలేకుండా నిరంతరంగా ప్రసారంచేసారు. ఇందిరా పార్కు దగ్గర తెలుగుదేశం పార్టీ గూండాలు న్యాయవాదులపై దాడిచేసినా, ఉస్మానియాలో విద్యార్థులపై ఫైరింగ్ జరిగినా, కీచకపోలీసు మూకలు విద్యార్థినులపై అమానుషాలకు ఒడిగట్టినా, ఉద్యమాన్ని సజీవం చేయడం కోసం అనేక మంది ఆత్మాహుతికి పాల్పడినా సీమాంధ్ర మీడియా నుండి చీమకుట్టి నంత స్పందన కూడా రాలేదు. ఉద్యోగ నియామకాలలో న్యాయమైన వాటా కోసం తెలంగాణ అడ్వకేట్లు నిర్వహించిన అలుపెరుగని ఉద్యమం, పబ్లిక్ సర్వీస్ కమిషన్ అక్రమాలపై విద్యార్థుల ఆందోళన, బి.ఇడి. స్పాట్ వాల్యుయేషన్‌లో బయటపడిన పక్షపాతవైఖరిపై నిరుద్యోగులు చేసిన పోరాటాలను సీమాంధ్ర మీడియా విధ్వంసకరమైన కార్యక్రమాలుగా చిత్రీకరించింది.

శ్రీకృష్ణ కమిటీలో సభ్య కార్యదర్శిగా ఉన్న దుగ్గల్ ఇంటర్వ్యూ పేరిట టి.వి.9 ఒకరోజంతా చేసిన హడావుడి తెలంగాణ ఉద్యమాన్ని రాజకీయంగా దెబ్బతీసే లక్ష్యంతోనే, ఉద్దేశ్యపూర్వకంగానే కొనసాగింది. రాష్ట్ర గవర్నర్ నరసింహన్ హైదరాబాద్ నగరాన్ని కేంద్రపాలిత ప్రాంతంగా ప్రతిపాదించారని ఆంధ్రజ్యోతి దినపత్రిక, ఆ పత్రిక నిర్వహిస్తున్న ఎ.బి.ఎన్. ఛానల్ చేసిన అసత్య ప్రచారం కూడా పూర్తిగా దురుద్దేశ్య పూరితంగానే ఉన్నది.

తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంలో భాగంగా 12మంది తెలంగాణ ప్రాంత శాసనసభ్యులు రాజీనామాలు సమర్పించిన సందర్భం నుండి మొదలుకుని, ఉప ఎన్నికలకు ముందు, ఉప ఎన్నికల ప్రచార సందర్భంలోనూ, ఉప ఎన్నికల ఫలితాల విశ్లేషణ సమయంలోనూ సీమాంధ్ర మీడియా అనుసరించిన వైఖరి పూర్తిగా తెలంగాణ ప్రజలు వ్యక్తం చేసిన అభిప్రాయాలను అవమానపరిచేదిగానే ఉన్నది.

తెలంగాణ రాష్ట్ర డిమాండు కోసం బలవన్మరణాల పాలైన వారిపట్ల సీమాంధ్ర మీడియా అనుసరించిన వైఖరి తెలంగాణ సమాజాన్ని కలచి వేసేదిగానే కొనసాగింది. తెలంగాణ డిమాండును వ్యతిరేకిస్తూ సీమాంధ్ర నాయకులు, సమైక్యవాదులు రెచ్చగొడుతూ చేసిన ప్రకటనలు, వ్యాఖ్యానాలు తెలంగాణ ప్రజల ఆత్మగౌరవాన్ని కించపరిచేవిగానే ఉన్నాయి. విద్వేషాలను రెచ్చగొట్టే ఇట్లాంటి సందర్భాలలో సీమాంధ్ర మీడియా అనుసరించిన వైఖరి జర్నలిజం విలువలకు, సాంప్రదాయలకు పూర్తిగా విరుద్ధమైనది.

మొత్తంగా ప్రత్యేక రాష్ట్ర సాధనకోసం ఐదు దశాబ్దాలుగా సాగుతున్న ప్రజాస్వామిక ప్రజా ఉద్యమంపట్ల సీమాంధ్ర మీడియా అనుసరిస్తున్న ధోరణి, వైఖరి పూర్తిగా అభ్యంతరకరమైనది. ఆక్షేపణీయమైనది. రాజ్యాంగంలో ప్రజలకు కల్పించిన సమాచారాన్ని తెలుసుకునే హక్కు పరిధిలో పనిచేయ వలసిన మీడియా ప్రజల ఆకాంక్షలకు విరుద్ధంగా పనిచేయడం అత్యంత బాధాకరమైనది. ప్రజల హక్కును ఆయుధంగా వాడుకుని, ఆ ఆయుధాన్ని ప్రజలమీదనే ఉపయోగించడం ప్రజావ్యతిరేకమైన చర్య మాత్రమే.

సీమాంధ్ర దోపిడీనుండి, ఆధిపత్యం నుండి, అణచివేతలనుండి విముక్తి కోరుకుంటున్న తెలంగాణ ప్రజలు చేస్తున్న ప్రజాఉద్యమాన్ని వక్రీకరించేందుకు, అణచివేసేందుకు మీడియాస్వేచ్ఛ పేరుతో సీమాంధ్ర మీడియా చేస్తున్న ప్రయత్నాలు, అనుసరిస్తున్న పద్ధతులు స్వేచ్ఛకు, సమానత్వానికి, సమాజ స్వాతంత్ర్య కాంక్షకు, ప్రజాస్వామిక స్ఫూర్తికి పూర్తిగా విరుద్ధమైనవి. అందుకని తెలంగాణ డిమాండు కోసం ప్రజలు నిర్వహిస్తున్న ప్రజాఉద్యమానికి విరుద్ధంగా సీమాంధ్ర మీడియా పనిగట్టుకుని, ప్రయత్నపూర్వకంగా సాగిస్తున్న దాడిపై ఒక సవివరమైన చర్చ జరగాల్సిన అవసరం ఉన్నది. ఆ పనిచేయగల సాహసవంతు లెవ్వరైనా ఉన్నారా?

*(వ్యాసకర్త సీనియర్ జర్నలిస్టు,*
*తెలంగాణ విద్యావంతుల వేదిక రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)*

**రాజ్యాంగంలో ప్రకటించుకున్న లక్ష్యాలకు విరుద్ధంగా, సామాన్యుల అన్ని హక్కులనూ అణచివేస్తున్న పాలకులకు వ్యతిరేకంగా, నిజమైన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల కోసం ప్రజలు ఉద్యమించాలంటున్నారు బుర్ర రాములు**

# రాజకీయ వ్యవస్థను బాగుపర్చుకుందాం

## ఇప్పటి రాజకీయ వ్యవస్థ ఎలా ఉంది ?

ప్రజల సంక్షేమం కోసమే తనకు ప్రజలు తిరుగులేని అధికారాన్నిచ్చారని చెప్పిన రాజశేఖరరెడ్డి ప్రజల వనరుల్ని తమ కుటుంబాలకు, అనుచరులకు, కాంట్రాక్టర్లకు, యంత్రాగంలోని అధికారులకు పంచిండు. లక్షల కోట్లు సంపాదించే క్రమాన్ని తన కుటుంబానికిచ్చాడు. ఈ రకమైన తీరులో మిగతా రాజకీయ పార్టీలు వెనుకబడి ఉండొచ్చుకాని వ్యతిరేకించే లక్షణం లేదు. ఎమ్మార్ సంస్థ లేదా అలాంటి సంస్థల ద్వారా పాలనా యంత్రాంగం ప్రజల భూముల్ని, వనరుల్ని బదిలీచేసే స్థితి నిస్సంకోచంగా ఉంది.

సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తుల్లో సగం అవినీతిపరులేనని నిర్భయంగా ప్రకటించిన ఓ న్యాయవాది, ఏ పార్టీకి ఆ పార్టీ మీడియాను పెట్టుకొని అధికారం సంపాదించుకొవాలనే పరిణామం – ఈ నాలుగింటి కూటమితో ఉన్న రాజకీయ వ్యవస్థ ప్రజల్ని అధీనత్వానికి నెట్టింది. అయినా ప్రజలు పోరాడుతున్నారు. ఈ స్థితినిచ్చిన ఈ వ్యవస్థను బాగు చేయడం ఎలా? ఈ వ్యవస్థ ప్రజల వర్తమాన, భవిష్య జీవితాలను నిర్దేశిస్తుంది. ఆ నిర్దేశణ ప్రజల జీవన హక్కులకు వ్యతిరేకంగా ఉన్నవనే నూటికి నూరుపాళ్లు అనుభవంతోనే ఈ ప్రశ్న వేసుకుంటున్నాము.

'రాజకీయం' అంటేనే ప్రజల జీవితాన్ని నిర్దేశించే, నిర్ణయాలు తీసుకునే ఓ ప్రక్రియ. ఎవరు ఏమి పొందగలరో, ఎలా, ఎప్పుడు పొందగలరో నిర్ణయించేదే ఈ ప్రక్రియ. దీనిని ప్రభుత్వం నిర్వహిస్తుంది. ఎవరికైనా, లేదా, ఏ స్థితికైనా మంచి జరపాలనుకునే, దాన్ని చేయగల నిర్ణాయక శక్తిని ప్రభుత్వం కలిగి ఉంటుంది. ఈ ప్రభుత్వం సమాజాని కంతటికి వర్తించే నిర్ణయాలు తీసుకుని, వాటిని అమలు చేయడానికి న్యాయబద్ధమైన 'బలాన్ని' ఉపయోగించగలదు. ఈ నిర్ణయాలు విస్తృత ప్రజా సమూహం తప్పనిసరైనవనే ఒప్పుదలను ప్రకటించాలి. అవి న్యాయానికి, చట్టానికి లోబడి లేదా కట్టుబడి జరగాలి. అంటే మనం ఈ రాజకీయ వ్యవస్థను బాగు చేయాలనుకోవడానికి కారణం ఏమిటి? ప్రభుత్వం లేదా ఈ వ్యవస్థ తీసుకునే నిర్ణయాలు ప్రజాసమ్మతిని కలిగి లేవు అనీ, ఆమోదించిన ప్రజాస్వామిక విలువలకు, చట్టాలకు వ్యతిరేకంగా ఉండి ప్రజలకు న్యాయాన్ని కాదు కదా అన్యాయమే ఇవ్వడం లక్ష్యంగా ఉన్నవనీ కాబట్టి బాగు చేయాలనీ అనుకుంటున్నామా?

ప్రస్తుతం వ్యవస్థ తీసుకునే నిర్ణయాలు బలహీనులకు రక్షణనిచ్చేవి కావు. అందుకు ప్రభుత్వం ఒక సాధనంగా ఉంటుందని రాజకీయ తత్వవేత్తలు చెప్పినదాన్ని ప్రతిబింబించడం లేదు కాబట్టి, ఈ వ్యవస్థను బాగు చేయాలనుకుంటున్నామా? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పుకోవాలంటే మన వ్యవస్థ ఎవరి కూటమిగా ఉందో కూడా పరిచయం చేసుకోవాలి.

మన పాలకుల లేదా పాలనా వ్యవస్థ (రాజకీయ వ్యవస్థ) 90వ దశాబ్దం నుండి రూపంలో, సారంలో మారుతుంది. గతంకంటే కూడా ప్రజాస్వామిక విలువలకు దూరమైంది. వలస పాలనాంతరం ఉన్న పాలక కూటమి వేరు, ఇప్పటి కూటమి వేరు. వాళ్ల ప్రయోజనాలు వేరు, వీరి ప్రయోజనాలు వేరు. ఈనాటి పాలక కూటమిలో బహుళజాతి పెట్టుబడిదార్లు, వ్యవసాయ రంగంలో ఆవిష్కరించబడిన బూర్జువాలతో పాలనా యంత్రాంగం కలిసి తీసుకునే నిర్ణయాలు మెజారిటీ ప్రజలను అధీనత్వంలోకి నెట్టివేస్తూ, వారి జీవన స్వేచ్ఛలను నాశనం చేస్తున్నవని రాజకీయ, ఆర్థిక విశ్లేషకులు దశాబ్దకాలంగా చెబుతూనే ఉన్నారు. ఈ రాజకీయ వ్యవస్థ తీసుకుంటున్న నిర్ణయాల వలన విదేశీ పెట్టుబడికి పూర్తి స్వేచ్ఛను కలిగిస్తూనే, ఇక్కడి ప్రజల వనరులను, ప్రభుత్వ వనరులను, వారికి ఎలాంటి హద్దులు, భయాలు లేకుండా బదిలీ చేస్తున్నారు. ప్రభుత్వ రంగాన్ని ముఖ్యంగా టెలికమ్యూనికేషన్, రవాణా, గనులు, బ్యాంకులు, జీవిత బీమా మరీ ముఖ్యంగా అవస్థాపనలను ప్రజారంగం నుండి దూరం చేసిందీ కూటమి. ప్రస్తుతం జీవిస్తున్న ప్రజలకే కాకుండా భవిష్య తరాలకు కూడా జీవించే స్థితిగతుల్ని నాశనం చేసే క్రమం ఆవిష్కరించబడింది.

నిజానికి ఈ దేశ పాలక కూటమి ఎప్పుడూ కూడా ఒక్కటిగా, స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకున్న జాడలు లేవు. ఈ రాజకీయ వ్యవస్థలోని ప్రాబల్యం కలిగిన రైతువర్గం, పెట్టుబడిదారులు, ఉద్యోగవర్గం ఒకరికొకరు తమ ప్రయోజనాల కోసం ఘర్షణ పడుతూనే రాజీపడి నిర్ణయాలు తీసుకున్నారే కాని 'స్వతంత్ర' నిర్ణయాలు తీసుకునే శక్తి మూడు దశాబ్దాలు పాలన చేసిన ఏ కూటమికి లేదు. దీని ఫలితం ఏమిటంటే వలసానంతర పాలనా కాలంలోని మూడు దశాబ్దాలలో కనీసం రెండు దశాబ్దాలు రాజ్యాంగ విలువలు కేంద్రంగా పనిచేయాలనే రాజకీయ నాయకత్వం ఓ మేరకు ఉంది. పాలకవర్గాలలో విలువల క్షీణత ప్రజల హక్కులకు ఉరితాడుగా మారుతూ వచ్చింది.

1950ల నుండి ప్రజా సంక్షేమం కేంద్రంగా ఆర్థిక విధానాలు ఉండాలని రాజకీయ వ్యవస్థ తీసుకున్న నిర్ణయాలు సాక్ష్యం. ప్రజలకు వనరులను అందించి వారి స్వేచ్ఛలను అనుభవించే శక్తినివ్వాలనే ఆలోచనలు ఉండేవి. భూ సంస్కరణ చట్టాలు, సంపద కేంద్రీకృతం కాకూడదనే నిర్ణయాలు, ఉచిత విద్య, వైద్యాలను ప్రభుత్వ రంగం బలోపేతం చేయాలనే ఆర్థిక విధానంలో ప్రైవేటు వ్యక్తులకు అవకాశాలివ్వడం లో 'లైసెన్స్ రాజ్' స్థిరపడిన విషయం మనకు తెలుసు.

ఈ ఆర్థికవ్యవస్థే ప్రజలజీవన అవకాశాలకు అందగా లేదనీ దీన్ని కూల్చడానికి మూడు దశాబ్దాలక్రితం వరకు ఉద్యమాలు ఉండేవి. ఆనాడు విద్యాసంస్థల్లో 'ఈ వ్యవస్థను మార్చడానికి బలప్రయోగం అవసరమా? అనే ప్రశ్న చుట్టూ చర్చలు, కార్యక్రమాలుండేవి. పాలక రాజకీయ పార్టీలు గాంధీ, నెహ్రూ, అంబేద్కర్‌ల ఆలోచనలను ఆదర్శాలుగా ప్రకటించుకొని పోటీపడేవి. కాని ఈనాడు ఆ స్థితి లేదు. అయినప్పటికినీ ఈ రాజకీయ వ్యవస్థను బాగుచేయడమెలా?' అని ప్రశ్నించుకుంటున్నాం. ప్రజల వర్తమాన, భవిష్య జీవితాలను నిర్ణయించే ఈనాటి రాజకీయ వ్యవస్థ తీసుకునే నిర్ణయాలు రాజ్యాంగ విలువలకు వ్యతిరేకంగా ఉన్నవి. మూడు దశాబ్దాల పాలనాసారానికీ వ్యతిరేకంగానే ఉన్నవి.

అయితే తప్పేంది? ఇండియాను ప్రపంచంలో అత్యంత ఆర్థిక శక్తిగల దేశంగా ఆవిష్కరింపజేయాలంటే ఈ నిర్ణయాలు అవసరమే నంటారు 'మన్మోహనవాదులు'. వారి లెక్కల ప్రకారమే ఇండియా మానవాభివృద్ధి సూచికలో అతిహీన స్థితికి నెట్టివేయబడింది కాబట్టి పెరగవలసింది ఆర్థిక శక్తి కాదు. మానవాభివృద్ధి. మానవాభివృద్ధి పెరగడానికి ఈ దేశ వనరులు ప్రజలు అనుభవించే ఆర్థిక ప్రక్రియను ఆవిష్కరింపబడటానికి నిర్ణయాలు చేసే రాజకీయ వ్యవస్థ కావడానికి లేదా ఈ రాజకీయ వ్యవస్థలో ఆ మార్పు రావడానికి ఎలా బాగుచేయాలి? ఏం చేయాలి అనే ప్రశ్నలు మనల్ని వెంటాడుతవి. నిజానికి ఈ రాజకీయ వ్యవస్థకు ఆ లక్షణాలు వస్తవా? వస్తవనుకుంటే ఎలా వస్తవి? ఈ ప్రశ్నలు ఎందుకు వేస్తున్నానంటే గాంధీ, నెహ్రూ, అంబేద్కర్‌ల ఆదర్శాలు వల్లించే ఈ రాజకీయ పార్టీలు, వాటి వ్యవస్థ, కూటమి ఎందుకు ఆచరించడంలో వైఫల్యం చెందినవి అనే ప్రశ్నకు జవాబు ఏం చెప్పుకోగలం. ఈనాడున్న స్థితికి రాజకీయ వ్యవస్థలోని కూటమికి వచ్చిన విశృంఖల విలువల రాహిత్యానికి కారకులు ఎవరు, కారణాలు ఏమటి? ఈ ప్రశ్నలకున్న నేపథ్యాన్ని పరిచయం చేయడానికి కొన్నింటిని ఉదహరించాలి !

మిశ్రమ ఆర్థిక వ్యవస్థగా ఉంటూ సామ్యవాద దిశగా ప్రయాణించాలనే రెండున్నర దశాబ్దాల రాజకీయ వ్యవస్థ నిర్ణయాలకు, ఆచరణలకు వ్యతిరేకంగా, సంక్షేమ ఆర్థిక నమూనాకు భిన్నంగా ప్రైవేటీకరణ, సరళీకరణ, ప్రపంచీకరణ అనే ప్రపంచ బ్యాంకు విధానాన్ని నేటి రాజకీయ వ్యవస్థ ఆమోదించి ఆచరించడంలో పరుగుతీసింది. ఈ దేశ ప్రజల కోసం కాదు. ప్రపంచ పెట్టుబడిదారుల కోసం. రాజ్యాంగ విలువలకు లోబడి నిర్ణయాలు తీసుకోవల్సిన రాజకీయ కూటమి దానికి భిన్నంగా నిర్ణయాలు తీసుకున్నా ఆమోదించబడుతున్నది ఎందుకు? రాజకీయ పార్టీలు విలువలను దూరం పెట్టి ఆ పార్టీలలోని ఆధిపత్య వర్గాల ప్రయోజనాల కోసం నిర్ణయాలు తీసుకునే క్రమం బలంగా ముందుకొచ్చినది ఎందుకు ? ఈ మార్పు కేవలం బూర్జువా, భూస్వామ్య పార్టీలలోనే కాదు వర్గ ప్రయోజనాల కోసం జీవితాలను త్యాగం చేస్తున్నామని చెప్పుకునే కమ్యూనిస్టు పార్టీలలో సామ్యవాద భావన సామరస్యవాదంగా రూపాంతరం చెందింది ఎందుకు? కేవలం పార్లమెంటరీ రాజకీయ పార్టీలలోనే కాక విప్లవ కమ్యూనిస్టు పార్టీలలో జీవితాలను, సర్వస్వాన్ని త్యాగం చేసే సంప్రదాయాన్ని ఆచరించడానికి వెళ్లిన ఎంతో మంది త్యాగం చేస్తున్న క్రమం కొనసాగుతున్నప్పటికీ ఆయా పార్టీల నుండి బయటికి వచ్చిన వాళ్లు వైవిధ్యంగా కాదు కదా పూర్తి వైరుధ్యంగా జీవించడానికి జంకడం లేదు ఎందుకు? ఒకనాడు 'దున్నేవాడికే భూమి' కోసం ప్రాణమివ్వడానికి సిద్ధపడిన వాళ్లే 'ఆక్రమించుకున్న వాడిదే భూమి' అని కాపలాకాస్తున్న పరిణామం ఎందుకు వచ్చింది? ఈ ప్రశ్నల్ని నేను ఎందుకు వేస్తున్నానంటే ఈ రాజకీయ వ్యవస్థను బాగు చేయడం ఎలా? అని అనుకుంటున్నాం కాబట్టి ఎవరు బాగు చేయాలి? అనే ప్రశ్నకు రాజకీయాలలో ఉన్న శక్తులు కాదా? అందుకే ఈ ప్రశ్నలు నన్ను వెంటాడుతున్నవి.

ఇంకా స్పష్టంగా చెప్పదలిస్తే... పార్లమెంటు, అసెంబ్లీలలో ప్రజల జీవితాన్ని శాసించే అధికారాలు కలిగిన సభ్యులు ఎవరైనా గాంధీ, నెహ్రూ, అంబేద్కర్‌ల ఆదర్శాలను కాదు కదా కనీసం ఆయా పార్టీల ప్రణాళికల్ని ఆచరిస్తున్నారా? మనిషి సాధించుకున్న నాగరికత స్థాయికి లోబడి ఆలోచిస్తున్నారా? వారి ఆర్థిక జీవితాలలో అనూహ్యంగా మార్పులు ఎలా వస్తున్నవి?

మహిళలకు సమానత్వాన్నివ్వడానికి ఎన్ని ఆదర్శాలు చెప్పినా అందుకు అవసరమయ్యే చట్టం తీసుకురావడానికి దశాబ్దికాలం పార్లమెంటు చర్చిస్తూనే ఉంది. ఆ పార్టీలన్నీ ఆ బిల్లుకు అనుకూలమే కాని చట్టం చేయడానికి ఏ పార్టీకి ధైర్యం రావడం లేదు ఎందుకు? కాని ఈ దేశ ఆర్థిక దిశను, రాజ్యాంగానికి వ్యతిరేకంగా మార్చడానికి దోహదపడే ఎస్.ఇ.జెడ్. బిల్లు మాత్రం ఆఘమేఘాల మీద చట్టంగా రావడమే కాదు అమలు చేయడంలో వేలమైళ్ల స్పీడుతో ప్రయాణిస్తుంది. పేద ప్రజలకు, దళితులకు భూసంస్కరణ చట్టాల ఆధారంగా మూడు దశాబ్దాలలో ఈ రాష్ట్రంలో రెండు లక్షల ఎకరాలు పంచామని గొప్పలు చెప్పుకుంటారు. సెజ్ చట్టం ప్రకారం కేవలం రెండు సంవత్సరాలలో రెండు లక్షల ఎకరాలు ప్రజల నుండి లాక్కొని కంపెనీలకు ఇచ్చారంటే మన పాలకుల తీరును ఏమనుకోవాలి? ఈ స్థితికి కారణం ఏంటి? ఆదివాసీల హక్కుల చట్టాలున్నా పోలవరం ప్రాజెక్టు కట్టి ఆదివాసీల హక్కుల్ని, జీవితాలనీ ప్రభుత్వం నాశనం చేస్తున్న స్థితి ఎందుకొచ్చింది! ఒపెన్‌కాస్ట్ పేరుతో తెలంగాణ జిల్లాల లక్ష కుటుంబాలను బొంద పెట్టడానికి కోస్టల్ కారిడార్ పేరుతో సీమాంధ్ర జిల్లాల సముద్ర తీరం ప్రజల జీవితాలను సముద్రంలో కలిపే సాహసం ఈ పాలకులు ఎలా చేయగలుగుతున్నారు?

తెలంగాణ ప్రజలు ఐదు దశాబ్దాలుగా తమ హక్కుల కోసం పోరాటం చేసే 'స్థిరమైనస్థితి' ఉండటానికి కారణాలు ఏమిటి? కారకులు ఎవరు? ప్రజల ఆకాంక్షను న్యాయమైనదిగా ఒప్పుకున్నా, రాజకీయ ప్రయోజనం కోసమే డిసెంబర్ 9న నిర్ణయాలు తీసుకున్నప్పటికీ దానిని అమలు చేయించకుండా ప్రతిఘటించిన రాజకీయ నాయకుల తీరుకు కారణమేమిటి?

సోంపేట ప్రజలు తమ జీవితాలకు ఆధారమైన భూమిని, బీలను అభివృద్ధి పేరుతో నిర్మించే పవర్ ప్రాజెక్టుకివ్వమని తెగేసి చెప్పినా ప్రజల ప్రయోజనం కోసం కాదు అభివృద్ధి కోసం మేము ఎంతకైనా సిద్ధమేనని ప్రభుత్వం ప్రకటిస్తున్నదంటే ఈ ప్రభుత్వం ఏ 'రాజకీయ వ్యవస్థ' పరిధిలో ఉంది? ఐదేండ్లు పాలించిన రాజశేఖరరెడ్డి తన కొడుక్కి, అల్లుండ్లకు, బంధువులకు, అనుచరులకు లక్షల కోట్ల ఆస్తుల్ని సంపాదించి పెట్టే గొప్ప నిర్ణయాలు ఎలా జరిగేవి.

స్వతంత్రం కోసం ఆస్తుల్ని ధారపోసి ఆదర్శాలను ఆచరించిన నాయకుల అనుచరులమని చెప్తూనే తన అధికారం కోసం తన కుటుంబ ప్రయోజనాల కోసం ఎంతకైనా సిగ్గు, భయం లేకుండ రాజ్యాంగ విలువలకు వ్యతిరేకంగా, చట్టాలను, జి.ఒ.లను తీసుకొస్తూ చేసే రాజకీయ ప్రక్రియ మనకు ప్రశ్న. దీనిలో భాగస్వామిగానే పాలక యంత్రాంగం ఉంది.

పాలనాయంత్రాంగం చట్టబద్ధంగా పనిచేస్తున్నదా అనే ప్రశ్నకాదు కానీ, చట్టబద్ధంగా పనిచేసిండ్లని చెప్పే ఉదాహరణలు ఎన్ని ఉన్నవి? పాలక యంత్రాంగంలోని ఉద్యోగులు వారి ఆర్థిక ఇతర ప్రయోజనాల కోసం ఏమైనా చేయడానికి ఈ అరవైఏండ్లు సిగ్గులేకుండా ఏలుతున్నారు? కాశ్మీర్ సమస్య కావచ్చు, గుజరాత్, ఈశాన్యరాష్ట్రాల ప్రజల ఆకాంక్షలను, ఒరిస్సా, ఛత్తీస్‌గఢ్‌ల ఆదివాసీల సమస్యలను నక్సలైట్ల ఉద్యమాలను కావచ్చు, ఉద్యోగుల ప్రజల నిత్య సమస్యలపై ఆందోళనలను చట్టబద్ధంగా స్వయంగా పరిష్కరించిన ఉదహరణలేమైనా ఉంటే వాటిని చెప్పుకుంటే అభినందించే స్థితి ఉంటుంది. ప్రజలకోసం తాముస్నామని అనుకునే వారిని అంకెల్లో చెప్పగలమేమో కాని సంఖ్యల్లో చెప్పలేము. ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షల్ని జటిలం చేయడంలో రాజకీయ పార్టీల, నాయకులతో పోటీపడుతున్నారనడానికి ఈ అరవై ఏండ్లే సాక్ష్యం.

స్వతంత్రంగా ఉంటుందనే న్యాయవ్యవస్థపై సుప్రీం కోర్టు న్యాయవాది చెప్పిన నిజం ఆశ్చర్యాన్ని వెల్లడించదు. ఈ అరవై ఏండ్లల్లో కనీసం సగం మంది ప్రధాన న్యాయమూర్తులు అవినీతిపరులేనని రుజువు చేయడానికి సిద్ధంగా ఉన్నానని ప్రకటించిన న్యాయవాదిని అభినందించాల్నా? లేక ఈ స్థితికి సిగ్గుపడాల్నా? ఈ మూడింటితో పాటు రాజకీయ వ్యవస్థను ప్రభావితం చేసే మీడియా ప్రజాస్వామిక విలువలకు దూరమై పార్టీల పాదాలకు మోకరిల్లింది. ఈ పరిణామాన్ని అనుభవిస్తున్నాం కాబట్టే వీటి కూటమితో ఉన్న ఈ రాజకీయ వ్యవస్థను బాగు చేయడమెలా? అని ప్రశ్నించు కుంటున్నామనుకుంటున్నాను !

ప్రజాస్వామిక రాజకీయ విలువలకు వ్యతిరేకంగా అధికారాన్ని నిలుపు కోవడమే లక్ష్యంగా 1970లో ఉన్న రాజకీయ వ్యవస్థ నిర్ణయాలను ప్రజలు ఈసడించి కొట్టి పంపించిన తీరు రాజకీయ వ్యవస్థను బాగు చేయడంలో ఆనాడు పౌరసమాజం పాత్ర తీరును గుర్తుచేస్తుంది. ఆ 70వ దశాబ్దంలోనే వ్యవస్థను సంస్కరించుకోడానికి, నిర్మూలించడానికి ఉద్యమాలు వచ్చినప్పటికీ 90వ దశాబ్దంలో ప్రజాస్వామిక విలువలను మూటగట్టి బయట వేసిన రాజకీయ పార్టీలు అభివృద్ధి పేరుతో అవినీతిలో మునిగి ప్రజల వనరుల్ని ప్రాణాల్ని హరిస్తున్న పరిణామంలో మనమున్నాము.

ఈనాటి మన రాజకీయ వ్యవస్థ కావచ్చు లేదా ఏ రాజకీయ వ్యవస్థకైనా కేంద్ర బిందువు ప్రజలు. ప్రజలు కేంద్రంగా రాజకీయ వ్యవస్థలోని భాగస్వాములు – ప్రాతినిధ్యపాలకులు, పాలనాయంత్రాంగం, న్యాయవ్యవస్థ, మీడియా – ప్రజాస్వామిక విలువలకు దూరంగా ఎందుకు జరిగారు? అంటే ఒకప్పుడు ప్రజాస్వామిక విలువలను నూటికి నూరుపాళ్లు పాటించారు, ఆదరించారు అనడానికి సాక్షాలు లేవు కాని కనీసం గానైనా ఆచరించడానికి గతంలో కృషి చేసిన వాళ్లున్నారు. అందుకు సాక్ష్యంగా రెండు దశాబ్దాల క్రితం వరకు 'పౌరసమాజం' యొక్క ప్రభావం రాజకీయ వ్యవస్థ మీద ఉండేది. ఇప్పుడా పౌరసమాజం పెట్టుబడి వర్గంలో భాగమైంది. కాబట్టే 'రాజకీయ వ్యవస్థ పూర్తిగా ఖరాబు' అయిందని అనే వాళ్లున్నారు.

అయితె దీన్ని బాగు చేయడం కాదు, చారిత్రకంగా ప్రజలు ఏ ఆధిపత్యాలకు వ్యతిరేకంగా పోరాడి సాధించుకున్న నాగరికతాస్థాయిని ఆచరించకుండా అధీనస్థితిలోనే జీవించాలనుకోవడం వల్లనే పాలక కూటమి ప్రజల్ని తమ అధికార రక్షణ కోసం వాడుకుంటున్నది. ఈ స్థితిని నిర్మూలించడానికి ఏం చేయాలి? ఈ వ్యవస్థకు కేంద్రబిందువైన ప్రజలు తమ స్వేచ్ఛల రక్షణ కోసం, విస్తరించడం కోసం, అనుభవించడం కోసం నిత్యం పోరాటం చేయాల్సిందే. రాజకీయ వ్యవస్థకు అధీనులుగా మార్చబడిన ప్రజలు స్వతంత్రత ప్రకటించుకొని స్వాభిమానంతో, సమష్టి జీవితాలను ఆవిష్కరించుకోడానికి, సహజీవన సంస్కృతిని అందించే పౌర లక్షణాలతో జీవించడానికి సిద్ధపడితే రాజకీయ వ్యవస్థ ప్రజల చేతిలో ఓ సాధనంగా మారుతుంది. లేకుంటే ప్రజలే దానికి ఆహారం. కాబట్టి రాజకీయ వ్యవస్థను బాగుచేయడం కాదు చేయవల్సింది, బాగుపర్చుకోవడం కదా !?

*(రచయిత కాకతీయ విశ్వవిద్యాలయం అర్థశాస్త్ర ప్రొఫెసర్, మానవ హక్కుల వేదిక అధ్యక్షులు)* వీ

# వ్యాస రచనా తరగతి - 3

వీక్షణం నెలనెలా వ్యాసరచన వర్క్‌షాప్‌లలో భాగంగా సెప్టెంబర్ 18న వ్యాస రచనపై తరగతిని తన కార్యాలయంలో నిర్వహించింది. ఈ అధ్యయన తరగతికి డా. ఎ. మంజుల, ఎ. కవిత, ఎన్. భగవాన్‌రెడ్డి, ఎం. హరిబాబు, ఎం. శ్రీనివాస్, టి. సుదర్శనం, కె. నరేష్‌కుమార్, వై. నర్సింలు, ఎ. మల్లేష్, బి. గణేష్, డి. నరేందర్, డి. విజయ్, ఎం. ప్రసాద్, రాధ, ఎస్. వీరస్వామి, బి. సోమశేఖర్, సరళావందనం హాజరయ్యారు. తరగతి మధ్యాహ్నం 3 గంటల నుండి సాయంత్రం 6 గంటల వరకు నడిచింది.

కొత్తగా వ్యాసం రాసే వారు తీసుకోవాల్సిన జాగ్రత్తలను, పద్ధతులను, కొన్ని ఉదాహరణలను తెలుసుకున్నారు. వ్యాస రచనా ప్రక్రియ తరగతిలో పన్నెండు భాగాలు ఉన్నాయి. అవి ఉపోద్ఘాతం, తెలుగులో వ్యాస ప్రక్రియ చరిత్ర, వ్యాస రచనకు ప్రేరణ, వ్యాస రచనా ప్రణాళిక, వ్యాసాల రకాలు, వ్యాసం ఉపోద్ఘాతం, వ్యాసంలో భాగాలు, వ్యాసాలలో సాధారణంగా దొర్లే తప్పులు, వ్యాసంలో తార్కిక వాదనల పాత్ర, అవసరమైన భాషా పరికరాలు, అవసరమైన విరామ చిహ్నాలు, చదవవలసిన పుస్తకాలు.

వ్యాసం ప్రతి విషయం మీద, ప్రతి సంఘటన మీద రాయవచ్చు. పరిణామాలు, భిన్నాభిప్రాయాలు, అధ్యయనాలు, వదంతులు, ఆలోచనలు, చర్చలు, కొత్త ప్రతిపాదనలు, ప్రకటనలు ఇలా ఏ విషయం మీదైనా వ్యాసాలు రాయవచ్చు.

వ్యాసం రాయడానికి ముఖ్యంగా ప్రణాళిక రూపొందించుకోవాలి. వ్యాసం రాసే ముందు ఆలోచించాలి. ప్రారంభం, విషయంపై వాదనలు, ముగింపు ఉండాలి. వ్యాసంలో వివరణ ఉండాలి. భిన్నాభిప్రాయాలపై వాదన, నిర్ధారణ ఉండాలి. ఏదైనా విషయంపై పరిచయం, వివరణ, దానిపై ఆలోచనకు ప్రేరణ కలిగించాలి.

స్వానుభవం, జీవిత చరిత్రలు, వ్యంగ్యం, చర్చ, సమాచారం, వివరణ, సూచన, ఊహ, విమర్శ, ప్రతిపాదనలు ఇలా అనేకరకాల వ్యాసాలుంటాయి.

తరగతికి వచ్చిన వారు కొన్ని సందేహాలను వ్యక్తం చేసి నివృత్తి చేసుకోవడంతో, తమ అభిప్రాయాలు చెప్పడంతో వర్క్‌షాప్ ముగిసింది.

ప్రజలను ఎప్పటికీ పరాధీన స్థితిలో ఉంచి తమ ఆధిపత్యాన్ని, అధికారాన్ని కొనసాగిస్తున్న అగ్రవర్గ, అగ్రవర్ణ పాలక స్వభావాన్ని వివరిస్తున్నారు **గోగు శ్యామల**

# రాజ్యాధికారం ఎవరిది?

ప్రజాస్వామ్య రాజకీయ వ్యవస్థ స్థానంలో నేరపూరిత రాజకీయ వ్యవస్థ ఎస్టాబ్లిష్ అయిందని భావించడం వల్లే ప్రత్యేకంగా చర్చించాల్సిన అవసరం ఏర్పడిందని భావిస్తున్నాను. ఈనాటి రాజకీయ వ్యవస్థను బాగుచేయడం ఎలా, లేదా సరిదిద్దడం ఎలా, ప్రత్యామ్నాయం ఏమిటి అనే ప్రశ్నలు వేసుకుంటున్నాం. ఈ సందర్భాన్ని చూస్తుంటే ఆఫ్రికాలోని నల్ల జాతీయులు తెల్ల జాతీయులను 'వీ వాంట్ రెపరేషన్' (దాదాపు నష్టపరిహారం) అని చేసిన డిమాండ్ ఈ సందర్భంగా యాదికొస్తుంది. 2001లో జరిగిన డబ్ల్యు.సి.ఎ.ఆర్. 'జాత్యాహంకార వ్యతిరేక ప్రపంచ సదస్సు' సందర్భంగా జాత్యాహంకార వ్యతిరేక పోరాటంలో అసువులు బాసిన అమరుల కుటుంబాలకు చెందిన వాళ్లే. ముఖ్యంగా వాళ్ల తల్లులు, భార్యలు, అక్కాచెల్లెళ్లు... వందలాది మంది ఊరేగింపుగా వెళుతూ ఇచ్చిన నినాదమది. నేటి దళిత బహుజన ప్రజలు చేయాల్సిన డిమాండ్ రాజ్యాధికారమనే నష్టపరిహారాన్నే. రాజకీయ వ్యవస్థను బాగుచేయడం అనే ప్రక్రియలో భాగమే ఈ డిమాండ్.

నేటి రాజకీయ వ్యవస్థ అనే నిర్మాణంలో ఎస్టాబ్లిష్ కావడం ప్రజాస్వామ్య విలువలు కలిగిన పాలన సాధ్యంకానంత ఆధిపత్యపూరిత మైంది. యజమాని, దొర, జీతగాడు, కూలీ, పాలేరు, స్త్రీలు, పురుషులు అనే అగ్రవర్గ వర్ణ, ప్రాంత, మత, పురుషాధిక్య అంతరాలతో రాజకీయ వ్యవస్థ, పార్టీలు బలంగా నిర్మితమైనాయి. ఇందులో ప్రవేశించడానికి ఒక్క రిజర్వేషన్ స్థానం తప్ప అవకాశం సాధ్యం కావడం లేదు. ఈ నిర్మాణం తాలూకు భావజాలం కూడా ఆధిపత్య దోపిడీ స్వభావాన్నే కలిగి ఉన్నది. వారిని కూడా నాయకత్వంగా ప్రవేశించడం అంటే – స్వాతంత్ర్యం వచ్చి ఆరు దశాబ్దాలు దాటినా పొలిటికల్ పవర్ ఒక 'సీక్రెట్ కోడ్'గానే కొనసాగుతున్న పరిస్థితి... విఠలాచార్య తెలుగు సినిమా యాదికొస్తది.

'ఏడేడు సముద్రాలు దాటి ఒక ద్వీపానికి చేరితే... దట్టమైన అడవి... నడుస్తుంటే పాములు, తేళ్లు, జెర్రులు మొదలుకొని పులులే గాదు... మానవ కళేబరాలు కూడా కనిపిస్తాయి. వీటిని, భయంకరమైన స్థితిని ఎదుర్కొంటూ, తప్పించుకుంటూ పోతే... చివరకు ఒక బంగారు పంజరం... అందులో పంచవన్నెల రామచిలుక... దాని గొంతులో మాయల ఫకీరు ప్రాణం ఉన్నది అన్నట్లు...'

రాజ్యాధికారం, రాజకీయాధికారం అగ్రవర్ణాల, వర్గాల చేతుల్లో ఇంకా ఒక రహస్య కోడ్‌గానే నడుస్తూ ఉంది. అదిగో అలాంటి రహస్య కోడ్‌ను డి-కోడ్ చేసి, ఆ పంచ వన్నెల రామచిలుక కుతికను పట్టుకున్నట్టు దళిత బహుజన అస్తిత్వాల ప్రజలు రాజ్యాధికారాన్ని పట్టుకోవాల్సి ఉంది. దానికోసం (సిద్ధాంత పోరాటాలతో సహా ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక) బహుముఖ పోరాట మార్గాలను యుద్ధ ప్రాతిపదికన అనుసరించాల్సి ఉంది.

దీనికి ముందు సమాజ నిర్మాణపు స్వభావాన్ని చూడాల్సి ఉంది. తెగలు, కులాల పరిణామాన్ని మార్క్స్ వేబర్, అంబేద్కర్ సిద్ధాంతపు వెలుగులో చూడాల్సి ఉంది. ఆధునిక సమాజంలో ఉనికిలో ఉన్న కులాలు, తెగలు, వర్గాలు, వర్ణాలు నేను ఉపయోగిస్తున్న తీరులో – కులం (ఉత్పత్తి తాలూకు నైపుణ్యం, పనిముట్లు జీవావరణం ఆధారంగా జీవనం సాగించే కుటుంబాల సమూహం), వర్గం, వర్ణం (ఉత్పత్తికి సంబంధించి నైపుణ్యం ప్రత్యేక పనిముట్లకు సంబంధంలేని ఫీల్డు, అది వ్యాపారం, పెట్టుబడి, అదనపు విలువ, పాలనపరమైనవి) పౌర సమాజం సాంకేతికంగా ముందడుగు వేస్తున్న క్రమంలో ప్రతి కులంలోనూ, ప్రతి వర్ణంలోనూ విభజన జరుగుతూ వచ్చింది.

ఈ విభజనలోనే కడుపేద లేక అతి సంపన్నులు (మార్క్స్ ప్రకారం ఉన్నవాళ్లు – లేనివాళ్లు) అనే తరగతులుగా సమతుల్యత లేని విభజన జరిగింది. ఉదాహరణకు పద్మశాలి కులాన్ని తీసుకున్నట్లయితే కార్పొరేటుగా తయారైన వర్గాలుండడం, అదే కులంలో చేనేత కార్మికులుగా కొనసాగుతూ ఒక స్థాయిలో ఆత్మహత్యలకు పాల్పడే దీన స్థితికి చేరడను చూస్తాం. అదే ఒక మాదిగ కులాన్ని చూస్తే అతికొద్ది మంది జనాభాలో ఒకటి రెండు శాతం వ్యక్తులు రిజర్వేషన్లలో చదువుకొని బ్యూరోక్రాట్స్‌గా, వ్యాపారస్తులుగా ఉన్నత స్థాయికి చేరుకోవడం, అంతేకాక ఎక్కువ మంది మాల మాదిగలు 'రాజ్యాధికారం' అనే చైతన్యంను కలిగి ఉండడం ఒకవైపు అయితే, మెజారిటీ దళితులకు కులం సర్టిఫికెట్ కూడా లేకపోవడం, ప్రాథమిక విద్యలోకి ప్రవేశించలేక పోవడం. కుల ధృవీకరణ పత్రం తీసుకునే క్రమం తెలియని పరిస్థితిలో ఉండడం కూడా గమనించాలి. ఆర్థికంగానైతే వ్యవసాయ కూలీలుగా ఉండడం చూస్తాం. ఈ కులాలలో ఎదిగినవారు వర్ణ, వర్గ స్వభావాన్ని ఆపాదించుకున్నారు. పేదలు మాత్రం సాలే మగ్గాన్ని, మాదిగలు వ్యవసాయ కూలీ అస్తిత్వ స్వభావాన్ని కలిగి ఉన్నారు. ఈ రకంగా స్పష్టమైన విభజనను సంతరించుకున్నది.

ఈ విభజనలో దోపిడీవర్గాలుగా రూపొందిన దొరలు ప్రజాస్వామ్య పద్ధతిలో కాకుండా తాము అక్రమంగా సంపాదించిన సంపదతో ప్రజలను ఆధీనంలోకి తీసుకునే చర్యలను అవలంబించి, ఓటు బ్యాంకుగా మార్చుకునే చట్టసభల్లోకి ప్రవేశిస్తున్నారనే కంటే జొర్రుతున్నారు, దూరుతున్నారు... దురాక్రమణ చేస్తున్నారు అనడం

సరైందేమో... ఈ రకంగా దూరి తిష్టవేసిన, ఆక్రమించిన వారు దేశాన్ని, వనరులను శాసిస్తున్న కార్పొరేట్ ప్రయోజనాల కోసమే పని చేస్తున్నారని అందరికీ స్పష్టమే.

ఇంకొంత స్పష్టంగా చెప్పాలంటే 'రాజకీయ వ్యవస్థ నిర్మాణాలైన పార్లమెంట్, అసెంబ్లీలలో అగ్రవర్ణాలకు రాజ్యాంగంలో పొందుపర్చక పోయినా రిజర్వేషన్లు అమలువుతున్నాయి' అని నిర్ధారణకు రావడానికి కారణం స్పష్టమే. స్వాతంత్ర్యం తరువాత జరిగిన ఎన్నికల్లో ఎంపికయిన నాయకుల నేపథ్యం ఇంకా తేటతెల్లం చేస్తుంది. రాజకీయాధికారం పట్ల వీరి భావజాలం ఏవిధంగా ఉంటుందో ఈ మధ్య జరిగిన ఒక సంఘటనను వివరించదలిచాను. రంగారెడ్డి జిల్లాలోని తాండూరు నియోజకవర్గంలో చెనిగెస్‌పురం అనే ఒక చిన్న గ్రామం. 27 సంవత్సరాల యువకుడు. అతను రెడ్డి కులానికి చెందిన వాడు. టి.ఆర్.ఎస్. ఇన్‌చార్జి నాయకుడికి ఫోన్ చేసి 'మన మండలానికి సంబంధించిన ఎం.పి.టి.సి. సీట్లను, రిజర్వ్‌డ్ సీట్లను తప్పించి నేను అడిగిన దగ్గర ఎం.పి.టి.సి. సీటు నాకు రిజర్వ్ చేసిపెట్టు. ఏ సీటో నేను తరువాత చెపుతాను. నేను అడిగిన దగ్గిర నాకు తప్పకుండా ఇవ్వాలి. మిగతా అన్నీ పార్టీలకు కాంగ్రెస్, టి.డి.పి., బి.జె.పి.లకు సంబంధించిన క్యాండేట్స్‌ను నేను సెట్ చేస్త. టి.ఆర్.ఎస్.కు సంబంధించిన సీటు మాత్రం నాకోసం అట్టిపెట్టు. నేను సెట్ చేసే క్యాండెట్స్‌ను వీక్ పోజీషన్‌లో ఉన్నవారినే చేస్తాను. వారంత ఓడిపోతారు. తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ఓట్లతో నేను గెలుస్తాను' అని చెపుతాడు. దీనిని ఏమనాలి? ఎట్లా అర్థం చేసుకోవాలి? సంభాషణ అనుకోగలమా? ఆర్డరు జారీ చేయడం అనాలా? ఈ ఆర్డరు జారీచేయడానికి ఈ యువకుడికి ఇంత స్థాయి నమ్మకం ఎందుకున్నది? దీనికి గల రాజకీయ, ఆర్థిక, సామాజిక నేపథ్యాన్ని కచ్చితంగా చూడాల్సి ఉంది.

రాజకీయ నేపథ్యం అంటే (ఏ పదవిలోనైనా, కింది నుండి పైదాక, రాష్ట్రంలోనైతే పల్లెలోని వార్డు మెంబరు నుండి రాష్ట్ర ముఖ్యమంత్రి వరకు అగ్రవర్ణాలవారే ఉంటారు. వారు కూడ వర్ణ వారసత్వంతో పాటు కుటుంబ వారసత్వంగా కొనసాగుతారని), ఆర్థికంగా (లోకల్‌గా ఉన్న ప్రధాన వనరు భూమి పెద్దమొత్తం, ఆ భూమికి కావల్సిన నీటి వసతులు – చెరువులో నీరు, లేదా శక్తిమంతమైన బోరు మోటరు వేసి భూగర్భ జలాలను ఉపయోగించుకోవడం), సామాజికంగా (ఉత్పత్తి కులాల ప్రజలపై తిరుగులేని ఆధిపత్యాలను సాధించిన అగ్రవర్ణ దొర) ఆధీనంలో ఉంటుంది అని రెడ్డి యువకుడికి ఉన్న దృఢాభిప్రాయం. ఇంకో విషయం. టి.ఆర్.ఎస్. ఇన్‌చార్జ్ నాయకుడు అదే ఊరుకు చెందిన దళితుడు. ఇక్కడ ఆయన స్థానంలో ఈ రెడ్డి, కమ్మ, వెలమ, కర్ణం, బ్రాహ్మణ వ్యక్తి ఉంటే ఫోన్‌లో ఈ ఆర్డరును జారీ చేసేవాడా అనేది మరో అంశం. దళితుడు కాబట్టే అంత ముఖ్యమై అధికారానికి సంబంధించిన విషయమైనప్పటికీ ఫోన్‌లో ఆర్డరు జారీ చేయగలిగాడు. ఈ యువ నాయకుడి సంఘటన చిన్న ఉదాహరణ మాత్రమే. కాని అది అగ్రవర్ణ సమాజానికంతా ఉన్న అవగాహనే. నాటి నుండి పాలకులుగా అగ్రవర్ణాలవారే అని దళిత, బిసి, ముస్లిం, ఆదివాసి ప్రజల ఆరోపణ మరోపక్క కొనసాగుతున్నది. అగ్రవర్ణాల పాలన, దొరల పటేండ్ల పాలన అనేది తెలంగాణలో ప్రముఖంగా కనిపించినా మిగతా ఆంధ్రా, రాయలసీమ ప్రాంతాల్లో కూడా ఇదే నడవడి చెక్కుచెదరకుండా కొనసాగుతోంది. ఈ దొరలు, పటేండ్లు అసెంబ్లీలలో నిండిపోయింద్రు. అసెంబ్లీ ఏర్పడిన నాటి నుండి తిష్టవేసింద్రు. వీరిట్ల తిష్ట వేస్తారని సరిగ్గా అంచనా వేశాడు డా. బి.ఆర్. అంబేద్కర్. కనుక ఆనాడే పూనా ఒప్పందంలో దళితులకు, ఆదివాసులకు ప్రత్యేక నియోజకవర్గాలుగా కేటాయించాడు. గాంధీ దీనిని వ్యతిరేకిస్తూ ఆమరణ నిరాహార దీక్ష చేసి ఈ ఒప్పందాన్ని బలహీనం చేయగలిగాడు. ఫలితంగా నేటి పాలనలో రిజర్వేషన్‌లో వచ్చిన నాయకులు విధేయత, విన్నపం, విజ్ఞప్తి, అర్థించడం, వేడుకోవడం, అనుకరించడం అనే పరిమిత స్థాయిలోనే ఉండడం. కనీసం దళిత, ఆదివాసి సంక్షేమం కోసం కూడా స్వతంత్ర నిర్ణయాలను తీసుకోలేకపోవడం కొనసాగుతోంది.

అగ్రవర్ణాలు వర్గాలు అధికార నిర్మాణాలుగా వ్యవస్థీకృతమైనట్టు హుగ్ గ్రే నిర్వచనం 'దొర' అనే పవర్‌ను ఇక్కడ ఉదహరించుకోక తప్పదు. ఆంధ్రప్రదేశ్ రాజకీయ వ్యవస్థ తెలంగాణ రాజకీయాలు అనే రచనలో హుగ్ గ్రే ఇలా నిర్వచిస్తాడు 'దొర' అంటే పలురకాల పాత్రలు కలిసి ఉన్న ఒక భూస్వామి, వడ్డీ వ్యాపారి, భూమిపై అధికారాన్ని కలిగిన వాడు. గ్రామాధికారి, ప్రభుత్వ ప్రతినిధి, ఒక రాజకీయవేత్త. గ్రామ ప్రజలకు, ప్రభుత్వ అధికారులకు మధ్య ఈయన రాయబారం చేసేవాడు. అధికారులు గ్రామాన్ని సందర్శించినప్పుడు మొదట దొర దగ్గరకు వచ్చేవారు. గ్రామాధికారులు, కుల పెద్దలు, గ్రామపంచాయితీ సభ్యుల ద్వారా గ్రామంలోని మొత్తం అధికార వ్యవస్థనంతా దొర తన కనుసన్నలలో నడిపిస్తాడు. గ్రామానికి దొర తానే కాంగ్రెస్ పార్టీ నాయకుడూ, తానే గ్రామం నుండి పట్నం దాకా రాజకీయ పట్టు. అధికారం పూర్తిగా దొర కుటుంబం చేతిలో ఉంటుంది. ఉదాహరణకు, ఒక గ్రామంలో పట్వారి, మాలీ పటేల్, పోలీస్ పటేల్ – ఈ మూడు దొర పెద్దకొడుకు పేరు మీద ఉన్నాయి. ఇక పంచాయితీ సమితి అధ్యక్షుడయిన రెండవ కుమారుడు గ్రామ సర్పంచ్ కూడా అని తన కేసు స్టడీస్‌లో వివరిస్తాడు. ముందే చెప్పినట్లు ఒక రిజర్వ్‌డ్ నియోజకవర్గాలను మినహాయించి మొత్తం అగ్రవర్ణాలే ఉన్నారు. 2009లో బలహీనవర్గాల సాధికార వేదిక విడుదల చేసిన నివేదికలో కమ్మ, రెడ్డి, రావుల పాలన ఇంకెంత కాలమనీ మంత్రులు, ముఖ్యమంత్రులూ, వారి వర్గ నేపథ్యం, పాలన మొదలగు ముఖ్యమైన వివరాలనూ వెల్లడించింది. వీరంతా ప్రజాస్వామ్య పద్ధతికి తిలోదకాలిచ్చి అప్రజాస్వామ్య విధానంతో పాలిస్తున్నారు. దీనికి భిన్నమైన రీతిలో ప్రజలు ప్రజాస్వామ్య పద్ధతిలో ఓటు వేసి ఎన్నుకుంటున్న ప్రక్రియ ప్రజల విషయంలో కొనసాగుతోంది. ఈ నేపథ్యంలో ప్రజలు, ప్రభుత్వ యంత్రాంగం అనే వ్యవస్థను రెండు రకాలుగా చూడాల్సి ఉంది. ఒకటి, ప్రభుత్వం పూర్తిగా అగ్రవర్ణాల, వర్గాల ప్రయోజనాల కోసం (వనరులను, వైద్య, విద్యా రంగాలను, భూమి, వ్యవసాయాన్ని, భూగర్భ జలాలను, ఖనిజ సంపదను బడా పెట్టుబడిదారులకు ధారాదత్తం చేస్తూ కార్పొరేట్ వ్యవస్థను స్థిరపరచడం) పనిచేయడం. రెండు, ప్రజలను పూర్తిగా యంత్రాంగంపై ఆధార పడేటట్లు (పనికి ఆహారం పథకం (ఎన్.ఆర్.ఇ.జి.ఎ.) ఆరోగ్యశ్రీ, రాజీవ్ గృహకల్ప లాంటి పథకాలు) చేయడం అనే విధానాలను అవలంబిస్తున్నారు. పైన పేర్కొన్న 'ప్రయోజనాలు', 'ఆధారపడడం' అనే వాటికి మూలాలను మనువాదం లోనే మనం చూడగలం. శూద్రులు, అతి శూద్రులు ఆర్యుల మీద పూర్తిగా ఆధారపడాలి. స్త్రీలు పురుషుల మీద ఆధార పడాలి అని శాసిస్తాడు. ఈ అంశాలను అంబేద్కర్ తను రాసిన 'శూద్రులు – ప్రతి విప్లవం', స్త్రీలు– ప్రతి విప్లవం' అనే రచనల్లో ఎంతో వివరంగా విశ్లేషిస్తాడు. ఈ అగ్రవర్ణాల ప్రయోజనాల కోసం పని చేయడం, ప్రజలను ఆధార పడేటట్టు చేయడం అనేది కూడా మను వాదమే. ఇది

**మేధావులూ, భావ సారూప్యత కలిగిన చిన్న పార్టీలూ పూనుకొని ప్రజల భాగస్వామ్యాన్ని, చైతన్యాన్ని పెంచడం ద్వారా రాజకీయ వ్యవస్థను బాగుచేయవచ్చని అంటున్నారు డా. దార్ల వెంకటేశ్వరరావు**

# అవ్యవస్థ - ప్రజాచైతన్యం

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడం అంత సులువైందేమీ కాదు. 'రాజకీయం' ఒక వ్యవస్థగా మారుతున్నప్పుడే దానిలో కొంత రహస్య ఎజెండా కూడా దాగి ఉంటుంది. అది బయటకు కనిపించే ఎజెండా కాదు. తమ ఆస్తుల్ని కాపాడుకోవడం కోసం లేదా పెంచుకోవడం కోసం లేదా తమ అధికారాన్ని ఏదొకరకంగా నిలుపుకోవడం కోసం ఒక వారసత్వ సంపదగా మారాలనే రహస్య ఎజెండా, ప్రజాసేవ పేరుతో రాజకీయంగా ముందుకొస్తుంది. దీనితో పాటు సమాజంలో జరుగుతున్న అవ్యవస్థను సరిదిద్దాలనో, సమూలంగా మార్చాలనో ప్రయత్నంతో కూడా రాజకీయవ్యవస్థ ఏర్పడే అవకాశం ఉంది.

మొదట ప్రస్తావించుకున్న ఇటువంటి రాజకీయ వ్యవస్థ ప్రజాస్వామ్యంలో చాలా సులువుగా అమలులోకి రాగలుగుతుంది. ముఖ్యంగా మన భారతదేశంలో సాంఘిక హోదా అనేది ప్రాథమిక స్థాయిలో కులాన్నే ఆశ్రయించుకొని ఉండడం వల్ల వంశ పారంపర్యత లకు అవకాశం ఏర్పడుతుంది. అది బాగా బలం పుంజుకున్నప్పుడు రకరకాల సమీకరణాలు ఏకీకృతమై రాజకీయవ్యవస్థగా గానీ, లేదా అప్పటికే ఉన్న ఏదో ఒక రాజకీయపక్షంలో గాని చేరి తమ ఆధిక్యతను ప్రదర్శించుకోవడం ప్రారంభిస్తుంది. కనుక, రాజకీయ వ్యవస్థ అనేది కేవలం ఒక పార్టీగా పైకి కనిపించినా, అది ఏర్పడిన లక్ష్యాలు, ఏర్పరిచిన వ్యక్తుల మూర్తిమత్వం కూడా పరిగణనలోకి తీసుకోవాల్సిఉంటుంది. రాజకీయ వ్యవస్థ ఒక్కో ప్రాంతంలో ఒక్కొక్క రూపంలో ఉండి, అది శాసనబద్ధంగా పాలించే లేదా పాలించాలనే ఆకాంక్షను వ్యక్తీకరించే కొంతమంది వ్యక్తుల సమష్టిరూపం ఒక పార్టీగా కనిపిస్తుంది. కానీ ఆ పార్టీ ప్రభావితమైయ్యేది ఆ ప్రాంతంలో 'ప్రభావిత' వ్యక్తుల నుండే అనేది సామాన్యులకు వెంటనే కనిపించకపోవచ్చు. దాన్ని పార్టీ నిర్ణయంగానో, ఎలాంటి నిర్ణయం తీసుకోకుండా తటస్థంగా ఉండిపోవడంగానో అమలులోకి వస్తుంటుంది. ఈ అవగాహనతో 'రాజకీయ వ్యవస్థ'ను చూసినప్పుడు దాన్ని బాగు చేయడానికి ప్రయత్నించి సఫలీకృతులు కావడానికి అవకాశం ఉంది.

రాజకీయవ్యవస్థ అనేది కేవలం ఒక ప్రాంతానికో, ఒక రాష్ట్రానికో, ఒక దేశానికో మాత్రమే పరిమితమైంది కాదు. కానీ ప్రతీ దేశానికీ రాజకీయ వ్యవస్థ అనేది మాత్రం ఉంటుంది. అది ఆ భౌగోళిక ప్రయోజనాలను ఆకాంక్షించే వ్యవస్థగానే వ్యవహరిస్తుంది. ఈ అవగాహనతోనే దాని గురించి మాట్లాడవలసి ఉంటుంది. అలా కాకుండా అన్ని ప్రాంతాల్నీ పరిగణనలోకి తీసుకుని మొత్తం రాజకీయ వ్యవస్థే చెడిపోయిందని గానీ, సక్రమంగా పనిచేస్తుందని గానీ ఘంటా పథంగా చెప్పగలమా? ఎవరో కొంత మంది అలా చెప్పినా వాటిలో

---

ప్రజాస్వామ్యానికి బద్ధ శత్రువు అనేది అర్థం చేసుకోవాలి. వలస పాలన నుండి స్వాతంత్ర్యాన్ని సాధించి స్వంత రాజ్యాంగ సూత్రాలపై నడుస్తున్న వ్యవస్థకు మనువాదానికి పొసగని విషయం. ఆధునిక సమాజంలో మెజారిటీ (దళిత, బిసి, ఆదివాసి, ముస్లిం) ప్రజలు ప్రజాస్వామ్య పాలనను, అందించే ప్రభుత్వాలను కోరుకుంటున్నారు. ఇందులో భాగంగా వీరి పోరాటాలను, ఉద్యమాలను చూడాల్సి ఉంది. దళితులు అగ్రవర్ణాలపై ఆధిపత్యంపై, తెలంగాణ వారు ఆంధ్ర వలసాధిపత్యంపై, ఆదివాసులు వనరులపై హక్కుకోసం, ముస్లిం ప్రజలు హిందూ మతోన్మాదానికి వ్యతిరేకంగా, స్త్రీలు పితృస్వామ్యానికి వ్యతిరేకంగా పోరాడుతున్నారు. అదే సమయంలో ప్రత్యామ్నాయ రాజకీయ వ్యవస్థను కోరుకుంటున్నారు.

చరిత్రలో అగ్రవర్ణాలు, వర్గాల వారు ప్రజాస్వామ్య సిద్ధాంత పునాదిని కలిగిలేరనే సత్యాలనూ అన్వేషిస్తున్నారు. అగ్రవర్ణాలు ప్రజాస్వామ్య పాలనను అందించలేరని నిర్ధారణకు వచ్చారు. మనువాదానికి వ్యతిరేకంగా ఉద్యమిస్తూనే తమ ఆకాంక్షలను వ్యక్తపరుస్తున్నారు. రాజ్యాంగ పరిభాషలో వీరి ఆకాంక్షలు హక్కులుగా ముందుకొచ్చాయి. రాజకీయ పాలన కూడా ప్రజాస్వామ్య హక్కే. వెన్నుదన్నుగా చరిత్రలో మూలవాసులు బుద్ధుడు, అశోకుడు, జ్యోతీరావు పూలే, సావిత్రిబాయిపూలే, అంబేద్కర్ సిద్ధాంతాలను స్వంతం చేసుకుంటున్నారు. ఈ క్రమంలో రాజకీయ నిర్మాణంలో తెలంగాణ రాష్ట్రంలో బత్తుల శాంసుందర్, ముదిగొండ లక్ష్మయ్య, అరిగె రామస్వామి, సంగం లక్ష్మీబాయి, టి.ఎన్. సదాలక్ష్మి, జె. ఈశ్వరీబాయి, సుమిత్రాదేవి; ఆంధ్ర రాష్ట్రం నుండి బొజ్జ అప్పలస్వామి, కుసుమ ధర్మన్న లాంటి నేతలు ప్రజాస్వామ్యపు కార్య శూరులుగా కొనసాగారు. రాజకీయ వ్యవస్థ బాగుపడాలంటే మెజారిటీ ప్రజల ప్రాతినిధ్యం అధికారంలోకి రావాలని నొక్కి చెప్పారు. బ్రాహ్మణీయ వర్ణాలు ఎన్ని జిత్తులు వేసినా, మను శాసనాలు చేసినా రాజ్యాధికారం మీ లక్ష్యమని చూపుడు వేలుతో దారులు చూపుతున్న అంబేద్కర్ వాద వాడకు ఉండనే ఉండే.

ఈ దేశం అనే దేహానికి రక్త నాళాలు శూద్రులు, అతి శూద్రులని జ్యోతిరావు పూలే చెప్పిన కర్తవ్యం చెవుల్లో మోగుతూనే ఉండే. ఇక రాజ్యాధికారం వైపే మెజారిటీ ప్రజల లక్ష్యం.

*(రచయిత దళిత స్త్రీవాద పరిశోధకురాలు)*

పరికల్పనలే (హైపోథీసిస్) ఎక్కువగా ఉండే అవకాశం ఉంది. ఎందుకంటే మనం చూసేవీ, వినేవీ వాస్తవంలో అలా ఉన్నాయో లేవో తెలియని అయోమయ సమాచార వ్యవస్థలో ఉన్నాం. నిజంగా క్షేత్రాన్ని దర్శించి వాస్తవాల్ని విశ్లేషించగలిగే సమయం, అవకాశం లభించడం అంతసులభమేమీ కాదు. అందువల్ల సాధ్యమైనంతవరకూ అందుబాటులో ఉన్న పరిశోధనల్ని, మీడియానీ ఆశ్రయించక తప్పదు. ఇలాంటప్పుడు మీడియాని కొన్ని పరిమితుల దృష్ట్యా పక్కకు పెట్టినా, మరి పరిశోధనలు సత్యాన్నే అన్వేషిస్తున్నాయా? పరిశోధకులు నిజంగా క్షేత్ర పర్యటన చేసి, నిష్పాక్షికంగా కుల, మత, వర్గ, లింగ, ప్రాంతీయ అభిమానాలకు అతీతంగా సమాచారాన్ని సేకరిస్తున్నారా? సేకరించిన సమాచారాన్ని శాస్త్రీయంగా విశ్లేషిస్తున్నారా? ఫలితాలను ముందే ఊహించి అంటే ఏవో కొన్ని పార్టీల లేదా కొన్ని ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని సిద్ధాంతీకరించేటప్పుడు తమ పరికల్పనలే వాస్తవాలుగా, ఫలితాంశాలుగా ప్రకటిస్తున్నారా? అనే వాటిని పరిగణనలోకి తీసుకోకుండా ప్రపంచ వ్యాప్తంగా ఉన్న రాజకీయ వ్యవస్థను సాధారణీకరించి వాటన్నింటికీ ఒకే సూత్రాన్నో, పరిష్కారాన్నో సూచించడం కూడా సాధ్యంకాదు. కానీ, ఒక ప్రాంతాన్నో, ఒక దేశాన్నో కేంద్రంగా చేసుకుని ఆ రాజకీయ వ్యవస్థ బాగుపడడానికి సూచించే పరిష్కారాల్ని ఇతర ప్రాంతాలు, దేశాల్లోని రాజకీయ వ్యవస్థలకు కూడా అనువర్తితం కావచ్చు. కనుక, మనదేశం నుండి రాజకీ యవ్యవస్థ స్వరూపాన్ని విశ్లేషించడానికి ప్రయత్నిస్తాను.

అనేక సంవత్సరాల పాటు వివిధ రాజవంశాలు, పరదేశీయుల పాలనలో భారత రాజకీయ వ్యవస్థ కొనసాగింది.స్వాతంత్ర్యోద్యమకాలం నుండీ సామాన్యులకు కూడా దానిలో పాల్గొగలిగే, దాన్ని ప్రభావితం చేయగలిగే అవకాశం కలిగింది. స్వాతంత్ర్యానంతరం ప్రాబల్య పూరితమైన రాజకీయ వ్యవస్థ మళ్లీ పరోక్షంగా కులాధిక్యాన్ని ప్రదర్శించుకునే, బలమైన ఆర్థిక పునాదులు గల వారి చేతుల్లోకే వెళ్లిపోయింది. నైతిక విలువలు, సామాజిక సంక్షేమ దృష్టి గల రాజకీయ పార్టీలు కుల, ధన ప్రాబల్యాల ముందు నిలవలేకపోయినా, తమ ఆశయాల్ని అధికార పార్టీగా మారిన రాజకీయవ్యవస్థ ద్వారా సాధించు కోవడానికి ప్రయత్నాలు జరిగాయి.అందు వల్లనే ప్రజాశ్రేయస్సుని ఆకాంక్షించే కొన్ని పథకాలనైనా శాసనబద్ధంగా అమలులోకి తేగలిగారు. వాటికి రాజ్యాంగరక్షణనీ కలిగించగలిగారు. ఇదే స్ఫూర్తి నేడు కూడా రావాల్సిన అవసరం ఉంది.

రాజకీయవ్యవస్థ రాజ్యాంగ బద్ధంగా అధికారాన్ని చేపట్టినా, చేపట్టకపోయినా అధికారంలో ఉన్న వాళ్లని అదుపులో ఉంచగలుగు తుంది. అందువల్లనే అధికారాన్ని చేజిక్కించుకున్న వాళ్ల ఆశ్రితపక్షపాతం రక్తసంబంధ బంధుజనహితంగా మారిపోతున్నప్పుడు, దాన్ని నిలదీయ గలుగుతున్నాం. ఇప్పటికే కొన్ని రాజకీయ పార్టీలు ప్రత్యక్షంగానూ, మరికొన్ని పరోక్షంగానూ ప్రింట్ అండ్ ఎలక్ట్రానిక్ మీడియాల్ని స్వంతంగా ఏర్పాటు చేసుకుని తమ తమ కార్యకలాపాల్ని కొనసాగిస్తున్నాయి. వీటిని ప్రభుత్వ రంగ నిర్వహణలో ఉన్నవి సమర్థవంతంగా ఎదుర్కోలేక పోగా, అవినీతి, అక్రమాల్ని వెలికితీయడంలో నత్తనడక నడుస్తున్నాయని కూడా చెప్పలేని స్థితికి చేరుకున్నాయి. ఒక విధంగా చెప్పాలంటే ప్రభుత్వ పథకాల్ని ప్రచారం చేయడానికీ, స్వాతంత్ర్యోద్యమ, రిపబ్లిక్ దినోత్సవాల్ని, సంస్కృతి పేరుతో కొన్ని మతకార్యక్రమాల్ని విధిగా ప్రసారం చేయడానికీ ఉద్దేశించబడినట్లుగా వ్యవహరిస్తున్నాయి. దీనితో ప్రైవేటు మీడియా ప్రజల్లోకి వేగంగా, శక్తివంతంగా చొచ్చుకుపోగలుగుతోంది. అప్పుడు ఆ మీడియా యాజమాన్యం ప్రజాభిప్రాయాల్ని తమకి అనుకూలంగా మార్చుకునే పనిలో నిమగ్నమవుతుంది. ఇక్కడే అవినీతి రాచబాట పరుచుకుంటుంది. అన్నింటికీ మీడియా కేంద్రంగా మారిపోతోంది. రాజకీయ వ్యవస్థని కూడా శాసించగలుగుతోంది. కనుక, మీడియా విధి విధానాలపై ముందుగా మేధావులు, ప్రభుత్వం దృష్టి కేంద్రీకరించి దాన్ని ఒక గాడిలో పెట్టాలి. అప్పుడే ప్రజాస్వామ్య రాజకీయ వ్యవస్థ సక్రమంగా నడవడానికి ఒక చక్కని మార్గాన్ని సూచించి నట్లవుతుంది.

మీడియాని నియంత్రించడానికి లేదా కొన్ని విధివిధానాల్ని రూపొందించడానికి శాసనవ్యవస్థ సక్రమంగా పనిచేయాలికదా అనే అనుమానం వస్తుంది. నిజమే, ఇటు రాష్ట్రస్థాయిలో శాసనసభ, కేంద్ర స్థాయిలో లోక్‌సభ వివిధ చట్టాల్ని రూపొందించేందుకు వినియోగిం చాల్సిన సమయం వైయక్తిక దూషణలకే పోయేట్లు కావాలనే రాజకీయ గూడుపుఠాణం ఏదైనా జరుగుతుందేమోననేది ఆధారాలతో సహా ప్రజలకు తెలిసేటట్లు చేయగలగాలి. ప్రభుత్వం కూడా అసెంబ్లీ, పార్లమెంటు శాసనాల రూపకల్పనలో, ప్రజాసమస్యల చర్చలో ఆయా ప్రాతినిథ్య సభ్యులు వినియోగించుకున్న సమయాల్ని ప్రకటించాలి. శాసనసభ సమావేశాల్లో కేవలం రాజకీయపార్టీ నాయకులకే మాట్లాడే సమయం అత్యధికంగా కేటాయించడం, ఆయా నియోజకవర్గాలకు ప్రాతినిథ్యం వహించేవారికి తగినంత సమయం కేటాయించకపోవడం, రాజకీయ పార్టీలు వారి స్వేచ్ఛను హరించేయడం కూడా రాజకీయవ్యవస్థ భ్రష్టు పట్టడానికి కారణమౌతుంది. ఈ వ్యవస్థను సరిదిద్ది, స్వేచ్ఛగా ప్రతి సభ్యుడూ పార్టీ కనుసన్నల్లోనే మాట్లాడాలనే కఠిన నియమాల్ని సంస్కరించగలిగినప్పుడు రాజకీయ వ్యవస్థలో మంచి ఫలితాల్ని ఆశించవచ్చు.

శాసనసభ పనితీరుని విశ్లేషించుకునేటప్పుడే, రాష్ట్రంలోను, కేంద్రంలోను వివిధ రంగాల్లో నిష్ణాతులైన వారి ప్రాతినిథ్యం కోసం ఉద్దేశించిన విధానమండలి, రాజ్యసభ సభ్యుల ఎంపికపట్ల మౌలికమైన మార్పులు రావాలి. వారిని ఎంపికచేయడంలో గవర్నర్, రాష్ట్రపతులకు రాజకీయపార్టీల ప్రమేయాన్ని మించిన స్వేచ్ఛ ఉంటే బాగుంటుంది. ఒకవేళ అలాగే జరిగి మేధావుల్నే ఎంపిక చేసినా, వారి అభిప్రాయాల్ని ఆ యా సభల్లో వినిపించగలిగినా, వాటిని ఆచరణలోకి తీసుకోవాలనేమీ లేనప్పుడు ప్రయోజనమేమి ఉంటుందనుకోవచ్చు. కానీ, నేడు ప్రత్యక్ష ప్రసారాల వ్యవస్థలో మీడియా పోటీపడుతోంది. దేన్ని ప్రసారం చేస్తుంది, దేన్ని చేయడం లేదనే విషయంలో కొన్ని అనుమానాలున్నా, అన్నివేళలా అలాగే జరుగుతుందనే నిరాశ కూడా మంచిది కాదు. అందువల్ల ఆయా సభల్లో మేధావులు చర్చించిన ప్రజోపయోగ విషయాల పట్ల ప్రజలు చైతన్యవంతమౌతారు. కనుక, రాజకీయపార్టీలే మేధావుల్ని ఎంపికచేసే ప్రక్రియలోనే మార్పు రావడం రాజకీయవ్యవస్థ బాగుపడడానికి కనిపించే మరో అవకాశం.

రాజకీయవ్యవస్థ సక్రమంగా ఉండాలన్నా, అక్రమ మార్గంలో పోతుందన్నా దానికి మేధావులే ప్రధాన బాధ్యులని చెప్పుకుంటున్నాం. అయినా వారి అభిప్రాయాల అమలుకి కూడా రాజకీయపార్టీలతో కూడిన ప్రభుత్వమే ఆధారం కావల్సి రావడంవల్ల మేధావులు కూడా వక్ర మార్గానికి పోతున్నారనిపిస్తుంది. దర్యాప్తు సంఘాలు, ప్రత్యేక కమిటీల్లో మేధావులు ఉంటున్నారు. కానీ, రాజకీయ పార్టీలు, వ్యక్తుల ప్రభావాలకు లోనైయ్యేవాళ్లు వాళ్లకు అనుగుణంగా సత్యాన్ని ఆవిష్కరిస్తున్నారు. ఆ

***రాష్ట్ర జనాభాలో పదిశాతంగా ఉన్న ముస్లింలకు సర్పంచ్ స్థాయి నుంచి శాసనసభ దాకా తగిన ప్రాతినిధ్యం లేదనీ, యాభై శాతం ప్రజలు అసలు ఎన్నికలకే దూరంగా ఉంటున్నారనీ అంటున్నారు* సయ్యద్ ఖుర్షీద్**

# ప్రజలందరి భాగస్వామ్యం కావాలి!

బ్రిటిష్ వలస పాలన నుండి స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్న భారతదేశం ఏ విధానాల వైపు పయనిస్తోందోనని ప్రపంచమంతా ఎదురు చూస్తున్న తరుణంలో భారతదేశం ప్రజాస్వామ్యమనే పాలనా విధానాన్ని సొంతం చేసుకున్నది. 'సర్వ సత్తాక, సామ్యవాద, లౌకిక, ప్రజాస్వామ్య, గణతంత్రరాజ్యం'గా భారత రాజ్యాంగం తనను తాను అభివర్ణించుకుంది.

అభివర్ణనలు, ఆశయాలు ఏమైనప్పటికిని వాటి సాధనకు ప్రజాస్వామ్యమనే పాలనా విధానాన్ని ప్రాతిపదికగా చేసుకుంది. ప్రజాస్వామ్యమంటే – 'ప్రజల చేత, ప్రజల కొరకు, పనిచేసే ప్రజా ప్రభుత్వం' ఏరకంగా చూసినా ప్రజాస్వామ్యంలో ప్రజలదే పెద్ద పీట. ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రభుత్వాలే అధికారంలోకి వస్తాయి. ఈ విధానం కొనసాగడానికి ఎన్నికల వ్యవస్థను ఏర్పాటు చేసుకోవడం జరిగింది. పద్దెనిమిది సంవత్సరాల వయసు నిండిన వారందరికీ సార్వజనీన ఓటు హక్కును కల్పించడం జరిగింది. ఐదు సంవత్సరాల కొకసారి ఎన్నికలను నిర్వహిస్తున్నారు.

ఎన్నికలనేసరికి రాజకీయ పార్టీలు, వాటిని వెన్నంటి ఉన్న అవలక్షణాలు అన్నీ ప్రజాస్వామ్యాన్ని పట్టుకునే ఉంటాయి. ప్రధానంగా సింపుల్ మెజారిటీ ఎన్నికల విధానం ప్రజాస్వామ్య స్ఫూర్తికే అవరోధంగా మారింది. 'నోట్లు ఖర్చు చేయ్ – ఓట్లు సంపాదించు' అనే పాలసీకి దిగజారిన రాజకీయాలు అనేక అవలక్షణాలకు వేదికగా మారాయి. కులం, మతం, ప్రాంతం, అవినీతి, అక్రమార్జన, లంచగొండితనం

---

కమిటీలో ఒకరిద్దరు నిజాయితీ పరులున్నా, నిస్సహాయ స్థితిలో వాళ్లకి అనుకూలంగా మారిపోవడమో, దానిలో ఇమడక బయటపడటమో జరుగుతోందనిపిస్తుంది. అటువంటి వాళ్లు తమ తెలివితేటల్ని ఉపయోగించి వ్యవస్థని బాగుచేయాలనే అన్వేషణలో నిరాశా నిస్పృలకు లోనయ్యే వాళ్లు, తమకు తోచిన మార్గంలో పనిచేసేవాళ్లు ఉన్నారు. అలాంటి వాళ్లు ప్రజాసంఘాలు, విప్లవ సంఘాలతో మమేకమైపోతున్నారనిపిస్తుంది. అక్కడ తమ భావాల్ని కొన్ని వ్యవస్థాపరమైన ఇబ్బందులున్నా స్వేచ్ఛగా వ్యక్తీకరించ గలుగుతున్నారు. వ్యక్తిగత ఆస్తుల్ని రద్దుచేయాలనీ, ఆర్థిక వ్యవస్థలో లోపాల్ని సరిదిద్ది, మిశ్రమ ఆర్థికవ్యవస్థ పేరుతో జరుగుతున్న దోపిడీని అరికట్టాలని ఎన్నాళ్లుగానో మొత్తుకుంటున్నారు. నిజానికి ఆచరణలోకి రాగలిగితే రాజకీయ వ్యవస్థ వెంటనే సక్రమ వ్యవస్థగా రూపొందగలుగుతుంది. కార్పోరేట్ మెంటాలిటీ గల వ్యక్తులు అఖిల భారత సర్వీసుల్లో చేరి, రాజకీయ నాయకులకు ఇచ్చే సలహాలు ప్రజా సంక్షేమ దృష్టితో కాకుండా, అధికారంలో ఉన్న లేదా ప్రాబల్యంలో ఉన్న అతి కొద్దిమంది ప్రయోజనాలకు అనుగుణంగా విధానాల రూపకల్పన జరగకుండా ఆదిలోనే అడ్డుకట్టవేయడం సాధ్యమౌతుంది. ప్రస్తుతం ప్రజాస్వామ్యంలో అత్యంత ముఖ్యమైన సంక్షేమానికి సంబంధించిన విధానాలను రూపొందిస్తున్నట్లు కూడా కనబడుతున్నా వాటిలోనూ వివిధ కాంట్రాక్టుల రూపంలో రాజకీయ నాయకులకు, వారి అనుచరగణానికి ఉపయోగపడేటట్లు ఉండడాన్ని గమనించాల్సి ఉంది. దీన్ని నియంత్రించగలిగే వ్యవస్థ కూడా ఏర్పడుతుంది.

ప్రజాస్వామ్యం ద్వారా అధికారాన్ని సాధించే క్రమంలో ఏర్పడిన కొన్ని ప్రధాన రాజకీయ పార్టీల్లో అధ్యక్ష స్థానం కోసం జరిగే సంస్థాగత ఎన్నికలు కేవలం ఒక నామమాత్రపు తంతుగా నిర్వహిస్తూ, ప్రజాస్వామ్య భావనకే కళంకం తెచ్చేటట్లు నియంత్రంగా వ్యవహరిస్తున్నాయి. వంశ పారంపర్యతను, కుటుంబ, బంధువుల, కుల వారసత్వాలను వ్యవస్థీకృతం చేస్తున్న రాజకీయపార్టీలను బాగుచేయాలని భావించడం నేతిబీరకాయలో నెయ్యి వెతికినట్లేనేమో! అందువల్ల చిన్న పార్టీలు అంటే ఓటింగ్ శాతం తక్కువ రావడం వల్ల అలా పిలవబడుతున్నవీ, భావసారూప్యం గల రాజకీయ పార్టీలు ఒక ఫ్రంట్‌గా ఏర్పడి రాజకీయ ప్రక్షాళనకు ప్రయత్నిస్తే మంచి ఫలితాలు రాగలుగుతాయంటే, అందులోనూ ప్రాంతం, కులం, భాష తమ తమ ఆధిక్యాన్ని ప్రదర్శించడం జరుగుతోంది. మరోవైపు ఇలాంటి పార్టీలన్నీ ఏకం కాకుండా అడ్డుకునే ప్రయత్నాలు, ఆకర్షణలు విరివిగానే జరుగుతున్నాయి. దీనితో పాటు ఏవో కొన్ని ప్రత్యేక మినహాయింపులు, రాయితీల ఒప్పందంతో ఏకమైనా, అధికారంలోకి రాగానే కుమ్ములాటలు బయలుదేరడంతో ప్రజలు మళ్లీ 'స్థిరత్వం' పేరు చెప్పుకునే రాజకీయ పక్షాల వైపే మొగ్గుచూడవలసిన నిస్సహాయ స్థితిలోకెళ్లి పోతున్నారు. వటవృక్షంలా అల్లుకుపోయిన రాజకీయవ్యవస్థను చిన్న చిన్న పార్టీలని పిలవబడుతున్నవీ, సామాజిక ఉన్నత లక్ష్యమనే భావ సారూప్యం గల పార్టీలు ఒక ఫ్రంట్‌గా ఏర్పడి, కేవలం అధికారం కోసమే కాకుండా, అధికారం పేరుతో చెలాయిస్తున్న అవ్యవస్థను ప్రజల ముంగిటకు తెచ్చి, ప్రజల్ని చైతన్యవంతం చేయడమే మన ప్రజాస్వామ్య రాజకీయ వ్యవస్థను బాగు చేయడానికి ఉన్న గొప్ప ఆయుధం అనుకుంటున్నాను. దీనికి మేధావులే ముందో, వెనుకో ఉండి నడిపించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత సెంట్రల్ యూనివర్సిటీ తెలుగు శాఖలో అసిస్టెంటు ప్రొఫెసర్)* వీ

ఒకేటేమిటి అనేకానేక అనర్థాలు రాజకీయ వ్యవస్థలో అగ్ర పీఠాన్ని అధిరోహించాయి. 'గెలుపే ప్రధానం – అధికారమే అసలు లక్ష్యం'గా రాజకీయాలు మారిపోయాయి.

అవలక్షణాల కుప్పగా మారిన రాజకీయ వ్యవస్థను బాగు చేయాలంటే పెద్ద యజ్ఞమే చేయాలి. అంతా ప్రజలే అనిపించే ప్రజాస్వామ్యానికి మూలమైన ఎన్నికల వ్యవస్థకు మెజారిటీ ప్రజలు దూరంగా ఉంటున్నారు. 50–65 శాతం పోలింగ్‌కే మనమంతా భారీ పోలింగ్ అంటూ మురిసిపోతున్నాం. దాదాపు జనాభాలో సగభాగం ఓటింగ్ ప్రక్రియకు ఎందుకు దూరమవుతున్నారో ఆలోచించ లేకపోతున్నాం. జనాభాలో యాభై శాతానికి పైగా ఉన్న బి.సి.లు, ముస్లింలు – మహిళలు రాజకీయ అధికారపీఠానికి ఆమడ దూరంలో ఉంటున్నారు. రాజ్యాంగం కల్పించిన రిజర్వేషన్ల వల్ల ఎస్.సి., ఎస్.టి. వర్గాల వారు అధికారం పంచుకోవడంలో భాగస్వామ్యులు కాగలుగు తున్నారు. కాని మిగిలిన మెజారిటీ వర్గాలకు ఈ అవకాశం దొరకడం లేదు.

2001 జనాభా లెక్కల ప్రకారం చూస్తే – ఆంధ్రప్రదేశ్‌లో ముస్లిం జనాభా 69,86,856. మొత్తం రాష్ట్ర జనాభాలో వీరు 9.2 శాతంగా ఉన్నారు. రాష్ట్ర జనాభా దామాషా నిష్పత్తి ప్రకారం వీరికి రాష్ట్ర శాసనసభ్యులలో 25–27 సీట్లు దక్కాలి. కానీ రాష్ట్ర శాసనసభలో వీరి సంఖ్య 11కు దాటలేదెప్పుడు. (ఒక్క 1972 ఎన్నికల్లో తప్ప.) ఒక్క శాసనసభ విషయంలోనే కాదు, మిగిలిన అధికార పదవులన్నింటిలోనూ ఇదే తీరు. ఇందుకు ఈ లెక్కలే సాక్ష్యం.

| రాష్ట్రంలోని కొన్ని ముఖ్య పదవులు | మొత్తం సీట్లు | ముస్లిం ప్రాతినిధ్యం | శాతంలో |
|---|---|---|---|
| శాసనసభ్యులు | 294 | 11 | 3.74 |
| పార్లమెంట్ సభ్యులు | 42 | 2 | 4.76 |
| జిల్లా పరిషత్ అధ్యక్షులు | 22 | 0 | 0 |
| జిల్లా పరిషత్ ఉపాధ్యక్షులు | 22 | 1 | 4.54 |
| జెడ్.పి.టి.సి.లు | 1096 | 13 | 1.18 |
| మండల అధ్యక్షులు | 1096 | 4 | 0.36 |
| ఎం.పి.టి.సి.లు | 1467 | 259 | 17.65 |
| సర్పంచ్‌లు | 21,914 | 215 | 0.98 |
| మునిసిపల్ ఛైర్మన్‌లు | 108 | 7 | 6.48 |

ఒక్క ముస్లింల విషయంలోనే కాదు జనాభాలో అధిక సంఖ్యాకులైన బి.సి.లు, మహిళలు సైతం రాజకీయ అధికారానికి ఆమడ దూరంలో ఉంటున్నారు. ఫలితంగా ప్రస్తుతం కొనసాగుతున్న రాజకీయ వ్యవస్థ – ఎన్నికలు అగ్రకుల, ధనిక, పెత్తందార్ల ఆటస్థలంగా మారిపోయింది. రాజకీయ అధికారానికి మెజారిటీ ప్రజలు దూరం కావడంతో ప్రజాస్వామ్యం అర్థమే మారిపోయింది. రాజకీయ అధికారానికి, ఎన్నికలకు దూరంగా ఉంటున్న మెజారిటీ ప్రజలను దగ్గర చేసేలా ప్రయత్నాలు ప్రారంభించాలి. వీరికి జనాభా దామాషా నిష్పత్తి ప్రకారం సీట్లు కేటాయించాలి. తద్వారా ఆయా వర్గాల ప్రజలు ఎన్నికల్లో పాల్గొని రాజకీయ అధికారం పంచుకునే వీలు కలుగుతుంది. ఆయా ప్రభుత్వాలపై నమ్మకం పెరుగుతుంది. ఓటింగ్ శాతం కూడా మరింత పెరిగే వీలుంటుంది. ప్రజాస్వామ్య స్ఫూర్తి వెల్లివిరుస్తుంది.

అంతేకాదు, ప్రస్తుతం రాజకీయాలన్నా, ఎన్నికలన్నా డబ్బులతో ముడిపడిన అంశం! ఒకప్పుడు ఒక్క రూపాయి నోటు కూడా తీసుకోకుండా ఓట్లు వేసిన ప్రజలు ఉన్నారన్న వాస్తవం... నేడు అమితాశ్చర్యం కలిగించే అంశం! రానున్న తరాలకు నమ్మరాని నిజం! ఎన్నికల ప్రచారం పేరుతో డబ్బుల్ని నీరులా ప్రవహిస్తుంటే, సామాన్యులు నోళ్లు వెళ్లబెట్టి చూస్తున్నారు. ఈ ధన ప్రవాహం సామాన్యులను, మధ్యతరగతి ప్రజలను రాజకీయాలకు దూరం చేస్తోంది. ఈ విధానాన్ని సంస్కరించాలి. ఎన్నికల్లో పోటీ చేసే అభ్యర్థులకు వ్యయ పరిమితి విధించిన ఎన్నికల కమిషన్ ఈ విషయంపై మరింత శ్రద్ధ చూపాలి. అభ్యర్థులకు ప్రచార సామాగ్రిపై కూడా ఆంక్షలు, పరిమితులు విధించాలి. ఈ ప్రచార సామాగ్రిని కూడా ప్రభుత్వమే సరఫరా చేయాలి. అందుకయ్యే ఖర్చుల్ని ఆయా అభ్యర్థుల నుండి రాబట్టుకోవాలి. ఇందువల్ల ఎన్నికల ప్రచారంలో అనవసర హంగూ ఆర్భాటాలనూ, ఖర్చులనూ తగ్గించే వీలు కలుగుతుంది. పరిమితులు, పరిధులు దాటి ప్రచారం, ఖర్చులు చేసిన వారిని కఠినంగా శిక్షించాలి.

మెజారిటీ ప్రజల ఓట్లతో అధికారంలోకి వచ్చే ప్రభుత్వాలు కూడా తమ ప్రభుత్వాలు ప్రజలందరివీ అనే భావనను ప్రజల్లో కల్పించాలి. ప్రభుత్వం చేపట్టే కార్యక్రమాలు, పథకాలు అన్నీ కూడా ప్రజలందరికీ వర్తించేలా ఉండాలి. పాలకులకు వ్యక్తిగత ఇష్టాయిష్టాలు ఉండకూడదు. లౌకికవాద దృక్పథం ప్రభుత్వంలో కొట్టొచ్చినట్లు కనపడాలి. ఏ ప్రభుత్వ కార్యక్రమం కూడా ఏ మత సాంప్రదాయాల ప్రకారం కాని, మత ప్రాతిపదికన కాని జరుగకూడదు.

ఈనాటి రాజకీయ వ్యవస్థలో ఎన్నికల విధానం మరి లోపభూయిష్టంగా మారింది. ఎలాగోలా తిప్పలు పడి అధికారంలోకి వస్తే చాలు, తమనెవరు ప్రశ్నించేవారు లేరు అనే ధీమా రాజకీయ వర్గాలలో బలంగా చోటు చేసుకున్నది. ఫలితంగా సాధ్యాసాధ్యాలు ఆలోచించకుండా, దేశ ఆర్థిక వ్యవస్థ తీరు తెన్నులను పట్టించుకోకుండా ఎన్నికల్లో గెలుపే లక్ష్యంగా హామీలివ్వడం, వరాల వర్షం కురిపించడం అలవాటుగా మారిపోయింది. ఈ విధానాన్ని నియంత్రించాలి. ఎన్నికల్లో పోటీ చేసే ప్రతీ అభ్యర్థి తాను గెలిస్తే చేయగలిగేవేమిటో, తమ పార్టీ తరపున చేయించగలిగేదేమిటో స్పష్టంగా తన ఎన్నికల ప్రణాళికలో ప్రకటించాలి. గెలిచిన వారు వాటిని ఏ మేరకు నెరవేరుస్తున్నారో, విఫలమవుతున్నారో సమీక్షించి ప్రజలకు తేటతెల్లం చేసే అధికార యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలి. తప్పుడు విధానాలతో, వ్యక్తిగత వర్గ, పార్టీ ప్రయోజనాలతో, స్వార్థ మోహాలతో వ్యవస్థలను బలహీనం చేసేలా అధికారంలో ఉన్నవారు ప్రవర్తించకుండా కనిపెట్టి, సమీక్షించే యంత్రాంగం ఏర్పాటు చేయాలి. అవసరమైతే ఇలాంటివారిని శిక్షించే విధానం అమలు చేయాలి. తద్వారా పాలకుల్లో బాధ్యతల పట్ల అవగాహన, భయం కలగడమే కాదు, జవాబుదారీతనం కూడా పెరుగుతుంది. సమీక్షా ఫలితాలు సైతం ఎప్పటికప్పుడు తేటతెల్లం కావడం మూలానా ప్రజలకు సైతం ప్రభుత్వాలపై, పాలకులపై విశ్వాసం కలుగుతుంది. ప్రజలు ప్రజాస్వామ్య ప్రక్రియలో భాగస్వాములవుతారు. ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుంది.

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వోద్యోగి)* వీ

*ఆర్థిక వ్యవస్థలో మార్పు రానంత వరకు రాజకీయ వ్యవస్థలో మార్పు రాదని అంటూ, పీడిత ప్రజలు తాత్కాలిక ఉపశమనాల కోసం పోరాడుతూనే దీర్ఘకాలిక లక్ష్యంవైపు నడవాల్సి ఉంటుందని అంటున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# రాజకీయాలను బాగుచేయడం ఎలా?

ప్రస్తుత రాజకీయ వ్యవస్థ బాగున్నదనీ, ఇది ఇట్లాగే ఉంటే ఫరవాలేదనీ అనేవాళ్లు ఎవరూ ఉండరు. ఆ రాజకీయ వ్యవస్థలో ఉన్నవాళ్ళు, దానితో ప్రయోజనాలు పొందుతున్న వాళ్లు కూడ అది బాగులేదనీ, లోపాలున్నాయనీ అంటారు. ఇది బాగున్నదని లోలోపల అనుకునేవాళ్లయినా పైకి అనే సాహసం చేయరు. ఆధిపత్యవర్గాల ప్రచార సాధనాలూ, అధికారంలో ఉన్న వ్యక్తులూ కూడ మన రాజకీయ వ్యవస్థలోని లోపాల గురించి మాట్లాడుతూ ఉండడం మనం రోజూ చూస్తూనే ఉన్నాం. ఈ లోపభూయిష్టమైన రాజకీయ వ్యవస్థను బాగు చేయవలసి ఉందనే అభిప్రాయాన్ని అందరూ ఆమోదిస్తున్నట్టే కనబడుతుంది. బహుశా మన సమాజంలో ఇంత పెద్ద ఎత్తున ఏకాభిప్రాయం ఉన్న విషయం మరొకటి ఉండకపోవచ్చు. కాని ఆశ్చర్యకరంగా ఎలా బాగుచేయాలనే విషయంలో మాత్రం ప్రతి ఒక్కరికీ తమవైన అభిప్రాయాలూ ఉన్నాయి, అవి సాధారణంగా ఇతరుల అభిప్రాయాలకన్న భిన్నమైనవిగానూ ఉన్నాయి. అందుకే ఎంతగా ఏకాభిప్రాయం ఉన్నప్పటికీ రాజకీయ వ్యవస్థను బాగుచేసే దిశగా నిజమైన ప్రయత్నాలు మాత్రం జరగడం లేదు.

పాలకవర్గాలకు చెందిన వాళ్లు రాజకీయ వ్యవస్థ మారాలని పైకి ఎన్ని మాటలు చెప్పినా, యథాతథంగా ఉంచడానికీ, లేదా ఇంకా దిగజార్చడానికీ ప్రయత్నిస్తున్నారు. ప్రజలలో ఈ రాజకీయ వ్యవస్థను మార్చాలనీ, తద్వారానే తమ బతుకులు బాగుపడతాయనీ తరతమ స్థాయిలో ఆలోచనలు ఉన్నాయి. కాని రాజకీయ వ్యవస్థ లోపాలకు మూల కారణాల గురించీ, సమస్యా పరిష్కారమార్గాల గురించీ ప్రజలకు అవగాహన అందకుండా పాలకులు జాగ్రత్త పడుతున్నారు. ఈ రెండు కొసలనూ అలా ఉంచితే, మధ్యలో విభిన్న భావజాలాలకు చెందిన, రాజకీయాభిప్రాయాలకు చెందిన వాళ్లు తమకు తోచిన సంస్కరణ ప్రయత్నాలు సూచిస్తున్నారు. అమలు చేయడానికి ప్రయత్నిస్తున్నారు. కాని ఆ ప్రయత్నాల వల్ల రాజకీయ వ్యవస్థ బాగుపడకపోగా ప్రజలలో భ్రమలు, తప్పుడు అవగాహనలు పెరిగిపోతున్నాయి. ఈ రాజకీయ వ్యవస్థలోని లోపాలు పైపైన కనబడేవి కాదనీ, అందువల్ల దీన్ని సంస్కరించడం కుదరదనీ, లోలోతులనుంచి మార్చవలసిందేననీ భావించేవాళ్ళు కూడ ఉన్నారు. ఆ దిశలో తమ ప్రయత్నాలు చేస్తున్నారు గాని వారి దృక్పథం వ్యాపించకుండా చేయడానికి పెద్ద ఎత్తున నిర్బంధం అమలవుతోంది.

ఈ స్థితిలో ఇక ఈ రాజకీయ వ్యవస్థ బాగుపడదేమో అనే నిరాశ, బాగుపడడానికి ఎన్ని శతాబ్దాలు పడుతుందో అనే నిర్వేదం, 'సైనిక నియంతృత్వం లాంటిది వస్తే తప్ప బాగుపడదు' అనే మధ్యతరగతి అసహనపు తప్పుడు భావాలు, 'ఇది మన కర్మ' అని కర్మ సిద్ధాంతంతో సరిపెట్టుకోవడం, 'ఇది బాగుపడకపోయినా సరే, మన తాత్కాలిక ప్రయోజనాలు నెరవేరితే చాలు'నని సంతృప్తి పడడం పెరిగిపోతున్నాయి.

'మనిషి సహజంగానే రాజకీయ జంతువు' అని రెండువేల సంవత్సరాల కింద అన్న అరిస్టాటిల్ దగ్గరినుంచి రాజకీయ వ్యవస్థకు, రాజకీయాలకు రాజనీతి శాస్త్రవేత్తలు, రాజకీయవాదులు అనేక నిర్వచనాలు ఇచ్చారు. స్థూలంగా చెప్పాలంటే ప్రజల సమస్యలకు సృజనాత్మక పరిష్కారాలు కనిపెట్టే బాధ్యత రాజకీయ వ్యవస్థది. ఆ పని కోసమే దాని చేతికి అధికారం ఇవ్వడం జరుగుతుంది. ఆ అధికారం ద్వారా అది సమాజ జీవితం మీద నిర్ణయాధికారం పొందుతుంది. విధాన రూపకల్పనా అధికారాన్ని పొందుతుంది. సమూహానికి ప్రాతినిధ్యం వహిస్తుంది.

అయితే అదంతా కేవలం ఒక ఆదర్శంగా, సైద్ధాంతిక స్థాయి నిర్వచనంగా మిగిలిపోయింది. రాజకీయ వ్యవస్థ ప్రజల సమస్యలకు పరిష్కారాలు కనిపెట్టడం లేదు సరిగదా, ప్రజలకు అదనంగా సమస్యలు కల్పిస్తోంది. ప్రజలకు ప్రతినిధిగా అధికారం చేపట్టాననేది మరచిపోయి, ప్రజల మీద నిరంకుశ అధికారం చలాయించే నిర్మాణాలుగా మారిపోయింది. రాజకీయాలంటే అసలు అర్థం మారిపోయి, రాజకీయవాదులు నడిపే కుటిల వ్యవహారాలు అనీ, డబ్బులతో నడిచేవి అనీ, ఎన్నికలనీ, ఎన్నికల పార్టీలనీ, పాలనా విధానాలనీ, చట్టాలు అనీ అనేక సంకుచిత అర్థాలు వచ్చాయి. ఈ సంకుచిత అర్థాల వల్లనే రాజకీయాలను బాగుచేయడమంటే ఈ రూపాలను బాగుచేయడమనే చాలమంది భావిస్తున్నారు. ఈ కుదించిన రూపాలలో ఏదో ఒకదాన్ని మరమ్మత్తు చేయడమే రాజకీయ వ్యవస్థను బాగుచేయడమని ప్రచారం చేస్తున్నారు.

వందల సంవత్సరాలుగా రాజకీయ వ్యవస్థగురించి వ్యాప్తిలో ఉన్న సిద్ధాంతాలుగాని, ఇతర దేశాలలోనూ, మన దేశంలోనూ నడుస్తున్న రాజకీయ వ్యవస్థ కార్యాచరణ గాని ఈ అన్ని మరమ్మతు కార్యకలాపాలనూ చవిచూశాయి. ఆ మరమ్మతులన్నీ విఫలమయ్యాయి. అయినా ఈ మరమ్మతుల పట్ల ఇంకా చాలమందికి భ్రమలు ఉన్నాయి. అందువల్లనే ఈ రాజకీయ వ్యవస్థ లోపలనే ఏవో సంస్కరణలు చేసి

దీన్ని బాగుచేయవచ్చునని రాజకీయ వాదులు కోట్లాది ప్రజలను నమ్మించ గలుగుతున్నారు. ఇది బాగుపడాలని ప్రజలలో ఉన్న ఆకాంక్షలను సంతృప్తి పరచడానికి పాలకులూ, స్వార్థపరశక్తులూ ఈ రాజకీయ సంస్కరణల నాటకాలు ఆడుతున్నారు. అందులో భాగంగానే అనేక భ్రమలు వ్యాపింపజేస్తున్నారు.

రాజకీయాల్లో ఇప్పుడు మంచి వ్యక్తులు లేరనీ, మంచి వ్యక్తులను రాజకీయాల్లోకి తెస్తే రాజకీయాలు బాగుపడిపోతాయనీ భ్రమ అట్లా ప్రచారంలో ఉంది. నిజానికి రాజకీయ వ్యవస్థ బాగుండడం, బాగులేక పోవడం అనేది ఆయా వ్యక్తుల మంచి చెడుల సమస్య కాదు. అది నైతిక వ్యవహారం కాదు. రాజకీయ వ్యవస్థకు అంతర్గత చలన నియమాలున్నాయి. రాజకీయ వ్యవస్థలో ఉన్న వాళ్లందరూ అటూ ఇటూగా అలాగే ఉండకతప్పదు. నడిచే రైల్లోనో, బస్సులోనో ఉన్న వ్యక్తికి లోపల ఎంత తిరిగే అవకాశం ఉన్నా, ప్రయాణ దిశను మార్చే అవకాశం ఉండదు. ఒకవేళ హైజాక్ చేసి మార్చే ప్రయత్నం చేసినా అది సుస్థిరమైన, శాశ్వతమైన పని కాదు. ఒక వ్యక్తికో, బృందానికో ఒక సమూహం మీద అధికారం వచ్చినప్పుడు, ఆ అధికారానికి జవాబుదారీతనం లేనప్పుడు, ఆ స్థానంలో కూచునే వ్యక్తులు ఎంత మంచి వారయినా, వారికి ఉన్న అధికారాన్ని వారో, వారి ఆశ్రితులో తమ ప్రయోజనాల కోసం వాడుకునే అవకాశం ఉంటుంది. అంటే సామూహిక ప్రాతినిధ్యం స్థానంలో వ్యక్తిగత ప్రయోజనం వచ్చి చేరుతుంది. బైట ఉన్న అంతరాల వ్యవస్థ ఆ వ్యక్తిగత ప్రయోజనాన్నే బలపరుస్తుంది. అధికారానికి వచ్చేవారి మంచి చెడులకు పెద్దగా పాత్ర ఉండదు.

ఎన్నికల విధానంలో సంస్కరణలు జరిపితే రాజకీయ వ్యవస్థ బాగుపడిపోతుందని మరొక భ్రమ ఉంది. ఇటీవలి కాలంలో లోక్‌సత్తా వంటి పార్టీలు ఈ భ్రమను వ్యాపింపజేస్తున్నాయి. ఎన్నికలలో నేరస్తులు పోటీ చేసే అవకాశం ఉండగూడదనీ, మంచివారిని ఎన్నుకోవాలనీ, అభ్యర్థులు కాక పార్టీలే పోటీ చేయాలనీ, దామాషా పద్ధతి ఎన్నికలు కావాలనీ, అభ్యర్థుల ఎన్నికల ఖర్చును ప్రభుత్వమే భరించాలనీ, వగైరా అనేక వాదనలు వినిపిస్తున్నాయి. మధ్యతరగతి అమాయకులు ఈ వాదనలలో నిజం ఉందేమోనని భ్రమ పడతారు. ఈ చిట్కాలూ మంత్రాలూ పనిచేస్తాయని అత్యాశపడి, ఎడతెగని చర్చలు చేసి, చివరికి ఆ చిట్కాలు పారలేదని మరింత నిరాశకు గురవుతుంటారు. కాని ఈ రాజకీయ వ్యవస్థ ఇలా ఉండడం వల్ల ఈ ఎన్నికలు ఇలా ఉన్నాయి గాని ఎన్నికల వల్ల రాజకీయ వ్యవస్థలో లోపాలు రాలేదు. ఏది కారణమో, ఏది పర్యవసానమో తలకిందులు చేసి కారణాన్ని మార్చకుండా పర్యవసానాన్ని మార్చగలుగుతామనుకోవడం భ్రమ. రాజకీయ వ్యవస్థ తలచుకుంటే ఎన్నికల పద్ధతిని మార్చడం నిమిషంలో పని. కాని ఎన్నికలను ఎంత మార్చినా రాజకీయ వ్యవస్థ మారదు. ఎన్నికల ద్వారా అధికారం సంపాదించి రాజకీయ వ్యవస్థను మొత్తంగా కూడ కాదు, ఏదయినా చిన్న అంశం మార్చగలమేమో అని ఆశించి భంగపడిన ఉదాహరణలు చరిత్రలో ఉన్నాయి.

పాలనా సంస్కరణలు అమలు జరిగితే, సరయిన చట్టాలు వస్తే, ఆ చట్టాలు సరిగా అమలు జరిగితే రాజకీయాలు బాగుపడతాయని మరొక భ్రమ ఉంది. ఇందులో భాగమే రాజకీయ పార్టీల జవాబుదారీ తనం పెంచితే రాజకీయాలు బాగుపడతాయనే నమ్మకం. రాజకీయాధికారం చేపట్టిన వర్గాలు పాలనలో సంస్కరణలు ఎందుకు తెస్తాయి? తాము కూచున్న కొమ్మను నరుక్కునే పనికి ఎవరయినా ఎందుకు పూనుకుంటారు? వర్గ సమాజంలో పాలకులు తమ ప్రయోజనాలకు భంగకరమైన చట్టాలు తెస్తారా? పైపై చూపులకు అలా కనబడే చట్టాలు తెచ్చినా వాటిని అమలు చేస్తారా? అరవై సంవత్సరాలుగా అమలు కాని భూసంస్కరణల చట్టాల వంటి అతిపెద్ద ఉదాహరణ ఏం చెపుతోంది? జవాబుదారీగా ఉండడం అంటే తమను తాము సమూహానికి లోబరచుకోవడం. అంటే పాలకవర్గాలు పాలితవర్గాలకు లోబడడం. ఇది స్వచ్ఛందంగా జరుగుతుందా? అది నిజంగా అమలయితే తమ పాలనే రద్దయిపోతుందని పాలకులకు తెలియదా?

అలాగే రాజకీయాల లోని చెడు అంతా కూడ అవినీతి వల్ల, రాజకీయాల్లో డబ్బు ప్రభావం వల్ల మాత్రమే వచ్చిందని, అందువల్ల అవినీతిని తగ్గిస్తే, డబ్బు ప్రభావాన్ని తగ్గిస్తే రాజకీయాలు వాటంతటవే బాగుపడతాయని మరొక భ్రమ కూడ ప్రచారమవుతోంది. రాజకీయాలు ఒక లాభసాటి వ్యాపారంగా మారిపోయిన నేపథ్యంలో, మిగిలిన అన్ని వ్యాపారాలకన్న రాజకీయాలలోనే పెట్టుబడి మీద రాబడి అతి ఎక్కువగా ఉన్న సందర్భంలో ఈ విజ్ఞప్తులు ఎవరి చెవికెక్కుతాయి? ఎవరయితే డబ్బును ఇబ్బడి ముబ్బడిగా పెంచుకోవడానికే రాజకీయాలను ఆశ్రయించారో వారికే రాజకీయాల్లో డబ్బు పాత్ర తగ్గించండి అని మహజరు పెట్టడం ఎంత అమాయకత్వమయి ఉండాలి! లేదా ఎంత వంచన అయి ఉండాలి! మరొక పక్క రాజకీయ వ్యవస్థలోని లోపాలకు ఎవరో ఒక బలిపశువును వెతకడానికి, ఏదో ఒక నెపం చూపడానికి, తద్వారా కొంత కాలం చర్చ అటు జరిపి కాలయాపన చేయడానికి పాలకవర్గాలు ప్రయత్నిస్తున్నాయి. రాజకీయ పార్టీల వ్యవస్థ వల్లనే రాజకీయాలు ఇలా ఉన్నాయనీ, ప్రజాస్వామ్యం లోపించడానికి అదే కారణమనీ చెపుతూ పార్టీ రహిత ప్రజాస్వామ్యం అనే భావన, బహుళ పార్టీల వ్యవస్థవల్ల, ఆ పార్టీల మధ్య పోటీ వల్ల ఈ సమస్యలు తలెత్తుతున్నాయని, కనుక రెండు పార్టీల వ్యవస్థ ఉంటే ఈ లోపాలు ఉండవని మరొక భావన ప్రచారం చేస్తున్నారు. భారత సమాజం వంటి అనేక చారిత్రక, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అంతరాలు ఉన్న సమాజంలో ప్రతి సామాజిక బృందానికీ తన ఆకాంక్షలను ప్రకటించే ఒక రాజకీయ నిర్మాణ రూపం ఉండవలసి వస్తుంది. అవన్నీ ఒకదానినొకటి శత్రువులుగా చూసుకోగూడదని, సమన్వయంతో పని చేయాలని అనవచ్చుగాని, అన్ని సామాజిక బృందాలూ తమ తమ ప్రత్యేకతలను వదులుకొన్నప్పుడే రాజకీయ వ్యవస్థ బాగుపడుతుంద నడంలో అర్థం లేదు.

ఇంతకూ ఈ మరమ్మత్తు చిట్కాలన్నీ విఫలం కావడం ఎందువల్ల నంటే అవి అసలు సమస్య మూలాలలోకి వెళ్లడం లేదు. వీటిలో ఏ పద్ధతిని ఉపయోగించినా, లేక అన్ని పద్ధతులనూ జమిలిగా ఉపయోగించినా రాజకీయ వ్యవస్థ బాగుపడదు. ఈ మరమ్మతు పద్ధతులన్నీ కూడ రోగ చిహ్నాలకు మందు ఇవ్వడానికి, పైపై పూతలు

పూయడానికి, నొప్పిని కాస్త మరిపించడానికి ఉపయోగపడేవే గాని నిజంగా రోగాన్ని నిర్మూలించ గలిగేవి కావు. ఈ మరమ్మతులను సూచిస్తున్న వారిలో కొందరికి అసలు రోగమేమిటో తెలుసును, కాని దాన్ని తొలగించడం వారి ప్రయోజనాలకు భంగకరం కనుక ఆ వైపు వెళ్లరు. మరికొందరు అసలు రోగమేమిటో తెలియని అమాయకులు, రోగ చిహ్నాన్నే రోగమని అనుకుంటారు.

రాజకీయ వ్యవస్థకు చేసిన జబ్బు ఎంత లోతయినదీ, దీర్ఘకాలికమైనదీ. అది ఈ పైపై పూతలతో, మలాములతో, అతుకులతో, మాట్లతో రద్దు కాదు. సంస్కరణలతో రద్దయిపోయే జబ్బు కాదు. లోతయిన, సమగ్రమైన సామాజిక విప్లవంతో తప్ప పరిష్కారం కానంతటి తీవ్రమైన వ్యాధి అది. రాజకీయాలంటే ఆర్థికవ్యవహారాల సాంద్ర వ్యక్తీకరణే అని లెనిన్ 1920లో నిర్వచించాడు. అంటే రాజకీయాలలో చెడును పరిహరించాలంటే ఆ చెడుకు మూలం ఆర్థిక వ్యవస్థలో ఉన్నదని గుర్తించవలసి ఉంది. ఆర్థిక వ్యవస్థ లోని లోపాలను పరిష్కరించకుండా రాజకీయ వ్యవస్థను బాగుచేయడం సాధ్యం కాదు.

లెనిన్ నాటికీ ఇవాళ్టికీ, ఆయన చెప్పిన రష్యన్ సమాజానికీ ఇవాళ్టి భారత సమాజానికీ ఒకతేడా కూడ ఉంది. ఈ వంద సంవత్సరాలలో రాజకీయ వ్యవస్థను సాంద్రం చేయడంలో, వడపోయడంలో ఆర్థిక వ్యవస్థ మరింత తెలివి నేర్చింది. అందువల్ల ఆర్థిక వ్యవస్థలో ధనికులూ పేదవారూ ఉన్నట్టుగా నేరుగా రాజకీయ వ్యవస్థలో ధనికుల పార్టీ, పేదల పార్టీ మాత్రమే లేవు. ఆ మాటకొస్తే అసలు పేదల పార్టీలు లేనేలేవు. పేదల పార్టీలను రాజకీయ వ్యవస్థలోకి ప్రవేశించకుండా అడ్డుకుంటున్నారు. రాజకీయ వ్యవస్థలో పాల్గొనడానికి అవసరమైన ఆర్థిక వనరుల ప్రవేశార్హత స్థాయిని విపరీతంగా పెంచివేసి అసలు పేదలు గానీ, పేదల పార్టీలు గాని ప్రవేశించడానికే వీలులేని స్థితి కల్పించారు. రాజకీయ యంత్రాంగాన్ని అనేకానేక ఆధునిక చట్రాలలో బిగించి అక్కడ పేదలకు ఊపిరాడని స్థితి కల్పించారు. అలాగే భారత సమాజానికి ప్రత్యేకమైన కుల వ్యవస్థ కూడ రాజకీయ వ్యవస్థ మీద తీవ్రమైన ప్రభావం చూపుతోంది.

అందువల్ల భారత రాజకీయ వ్యవస్థలో మార్పులు రావాలంటే ఆర్థిక, సామాజిక రంగాలలో విప్లవం, పెనుమార్పు రావలసి ఉంటుంది. ఆ విప్లవం మౌలికంగా, సమగ్రంగా వర్గ అణచివేతనూ, కుల అణచివేతనూ రద్దు చేయవలసి ఉంటుంది. ఏ రూపంలో ఉన్న అసమానతలనయినా నిర్మూలించవలసి ఉంటుంది. రాజకీయ వ్యవస్థలో దోపిడీ పీడనలకు అవకాశమిచ్చే అన్ని రకాల ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక దోపిడీ పీడనలను తొలగించవలసి ఉంటుంది. అయితే ఆర్థిక వ్యవస్థలో మార్పులు జరిగే, సమానత నెలకొనే, దోపిడీ పీడనలు రద్దయే ప్రక్రియ దీర్ఘ కాలికమైనది. అది జరిగేవరకూ రాజకీయ వ్యవస్థలో నిజమైన, మౌలికమైన మార్పులు జరగవనే వాస్తవాన్ని గుర్తిస్తూనే, ఆ దీర్ఘకాలిక కృషి సాగిస్తూనే, తరతరాలుగా అణగారిన వర్గాలు అంతదాకా వేచి చూడలేవనే వాస్తవాన్ని కూడ గుర్తించాలి. ఆయా అణగారిన సామాజిక బృందాలకు తాత్కాలిక, తక్షణ ఉపశమనాలు అన్వేషించే అవకాశం ఉందా చూడాలి. ఆర్థిక వ్యవస్థ మారేదాకా రాజకీయ వ్యవస్థను యథాతథంగా ఉండనివ్వడం అంటే అధికారంలో కొనసాగుతున్న వర్గాల అధికారాన్ని యథాతథంగా ఉండనివ్వడమే అవుతుంది. ఆ అధికారానికి తూట్లు పొడిచే అవకాశం ఎంత చిన్నదైనా, ఎంత తాత్కాలికమైనదైనా వాడుకోవడమే ప్రజల ప్రయోజనాలను పరిరక్షిస్తుంది. మరీ ముఖ్యంగా భారత సమాజం వంటి కుల, మత, స్త్రీ పురుష, ప్రాంత, భాషా అసమానతల వ్యవస్థలో, వర్గ అసమానతలను తొలగించే కృషితో పాటే ఈ అసమానతలన్నిటినీ పోగొట్టవలసి ఉంది. కనుక ఉన్న రాజకీయ వ్యవస్థలో ప్రజాస్వామిక సూత్రాలు, రాజ్యాంగ ఆదేశాలు అమలు కావాలనీ, రాజకీయ రంగంలో జనాభా నిష్పత్తిపై ప్రాతినిధ్యం ఉండాలనీ కోరడం రాజకీయ వ్యవస్థను బాగుచేసే కృషిలో భాగమే. అయితే అదే సమయంలో ఈ కోరిక వల్ల ఏర్పడగల రెండు ప్రమాదాల పట్ల కూడ జాగ్రత్త వహించాలి: అవి ఒకటి, ఈ తక్షణ, తాత్కాలిక ఉపశమనాలు అడగడంలో పడి మౌలికమైన ఆర్థిక వ్యవస్థ పరివర్తనా కృషికి, విప్లవ కృషికి దూరమైపోగూడదు. రెండు, రాజకీయ వ్యవస్థలో తమ న్యాయమైన స్థానం సంపాదించుకునే వాళ్ళను వ్యక్తులుగా తనలో భాగం చేసుకోవడానికి, వారిని యథాతథ స్థితిని కాపాడేవాళ్లుగా మార్చడానికి, వారిలోని విప్లవ స్ఫూర్తిని తుడిచేయడానికి పాలకవర్గాలు ప్రయత్నిస్తాయి.

ఈ ప్రమాదాల పట్ల జాగరూకత వహిస్తూనే, రాజకీయ రంగంలో అణగారిన వర్గాలకు వాటా కోసం పోరాడాలి. ఇవాళ్టి రాజకీయ రంగం నిజంగా ప్రజానుకూలమైనదీ, ప్రజా ప్రయోజనాలకోసం పనిచేసేదీ కాదనే వాస్తవాన్ని ప్రచారం చేయాలి. విడిగా రాజకీయ వ్యవస్థ సంస్కరణ సాధ్యం కాదనీ, ఆర్థిక వ్యవస్థను మార్చినపుడే దానికి తగిన రాజకీయ వ్యవస్థ, నిజమైన ప్రజా రాజకీయ వ్యవస్థ నిర్మాణమవుతుందనీ స్పష్టం చేయాలి.

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

**వచ్చే సంచికలలో...**

- **ఫోకస్ - నవంబర్ 2010 : యాభై నాలుగవ ఏట ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తు**
- **ఫోకస్ - డిసెంబర్ 2010 : తప్పనిసరిగా చదవవలసిన పుస్తకాలు**
- **కాపిటల్ చదవబోయే ముందు... - డేవిడ్ హార్వే**
- **సోంపేట హత్యాకాండ : చట్టం - అభివృద్ధి - హక్కులు - నక్కా హేమా వెంకట్రావ్**
- **ఆత్మహత్యలను నివారించగలమా? - సహచరి**

*గతంలో మావోయిస్టులకూ, ప్రభుత్వానికీ జరిగిన చర్చల అనుభవాలను శాస్త్రీయంగా సమీక్షించుకొని, ఆ వెలుగులో భవిష్యత్తు చర్చలకు ప్రణాళికలు రూపొందించుకోవాలని అంటున్నారు* **ఆర్.ఎస్. రావు**

# హింస-ప్రతిహింస - ఒక అవగాహన

గత నాలుగయిదు ఏళ్లుగా రాజ్యాంగం దృష్టి మావోయిస్టు పార్టీ కార్యాచరణ మీద తీవ్రంగా పడింది. అది మొదట్లో బస్తర్ ప్రాంతంలో సల్వాజుడుం ద్వారా ఆ సమస్యను ఎదుర్కోవడానికి ప్రయత్నం చేసింది. ఆ తరువాత బెంగాల్‌లో పశ్చిమ మిద్నాపూర్ పారిశ్రామికీకరణ గురించి భూములు తీసుకోవడంలో వ్యతిరేకతలో భాగంగా మావోయిస్టు కార్యాచరణను చూడడం, అక్కడ కార్యాచరణలో భాగమను కుంటున్న గిరిజనులను కూడా మావోయిస్టు కార్యాచరణలో భాగంగా చూడడం జరిగింది. జార్ఖండ్, ఒడిషాలలో మావోయిస్టు కార్యాచరణ మీద నిఘా పెరిగింది. ఈ సందర్భంలో గత యేడాదిలో హింస – ప్రతిహింస ఒక దైనందిన కార్యక్రమం కింద మారడమే కాకుండా కేంద్ర హోంమంత్రి, దేశ ప్రధానమంత్రి మావోయిస్టు కార్యాచరణ ఒక అఖిల భారత సమస్యగా, దేశానికి పొంచి ఉన్న ఒక పెద్ద అంతర్గత ముప్పుగా భావించి కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో ఈ సమస్యను అంతం చెయ్యడానికి ఒక పోలీసు / మిలిటరీ పథకాన్ని రూపొందించడం కూడా జరిగింది. ఈ తరుణంలో స్వామి అగ్నివేశ్ లాంటి సంఘసంస్కర్తలు పార్లమెంటరీ రాజకీయ పార్టీలలో బెంగాల్‌లో ముఖ్యపాత్ర వహిస్తున్న మమతా బెనర్జీ, రచయిత్రిగా అరుంధతీరాయ్ లాంటి ప్రజాస్వామ్య వాదులు ప్రభుత్వానికీ, మావోయిస్టు పార్టీకీ మధ్య చర్చల అవసరాన్ని గుర్తించి ప్రజాస్వామ్య సమీకరణ గురించి వారి ప్రయత్నాలు వారు చేస్తున్నారు. రాష్ట్రపతి, ప్రధానమంత్రి, హోంమంత్రులు కూడా చర్చల మీద వారి స్పందనను తెలిపారు. మావోయిస్టు పార్టీ ప్రతినిధులు కూడా చర్చల మీద వారి స్పందనను తెలిపారు. ఈ తరుణంలో ప్రొ. హరగోపాల్ ఆంధ్రజ్యోతిలో (22 ఆగస్ట్ 2010న) రాసిన వ్యాసం ఆహ్వానించ తగ్గది.

హరగోపాల్ ఒక ప్రజాస్వామికవాదే కాకుండా రాజకీయ శాస్త్రంలో దేశవ్యాప్తంగా పేరొందిన నిపుణులు. ఒక మార్క్సిస్టు మేధావిగా పేరుపొందిన మనిషి. ప్రజా సమస్యల మీద, ప్రజా పోరాటాల మీద నిర్మొహమాటంగా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చే మేధావి. అందులో భాగంగా ఆయన మాజీ ఐ.ఎ.ఎస్. అధికారి శంకరన్ ఇంకా ఇతర ప్రజాస్వామ్యవాదులతో కలిపి ఒక పౌరస్పందన కమిటీ ద్వారా ఆంధ్రప్రదేశ్‌లో రమారమి పది సంవత్సరాల క్రితం అప్పటి హింస–ప్రతిహింసల నేపథ్యంలో ఒక వినూత్నమైన ప్రయత్నం చేసారు. ఆ ప్రయత్నం ద్వారా మొదటిసారిగా ప్రభుత్వానికి అప్పటి పీపుల్స్‌వార్‌కు మధ్య చర్చల ప్రక్రియ చేయడానికి ఒక వీలు కల్పించారు. ప్రస్తుతం ప్రతిపాదనలో ఉన్న చర్చలు సఫలీకృతం అవ్వాలి అంటే అప్పటి చర్చల ప్రక్రియను ఒక సింహావలోకనం చెయ్యడం, అందులో సంభవించిన తప్పు, ఒప్పులను సమీక్షించుకోవడం, ఒక శాస్త్రీయ పద్ధతిగా చూడడం ఎంతైనా అవసరం.

అప్పటి చర్చల నేపథ్యం ప్రస్తుత నేపథ్యం లాగే హింస – ప్రతిహింసల మధ్య సామాన్య ప్రజానీకం అంటే పౌరసమాజం నలిగి పోతోంది అనే ఉద్దేశంతో పౌరసమాజం స్పందనగా, పౌర స్పందన వేదిక ఒకటి ఆవిర్భవించింది. ఆ వేదిక హింస – ప్రతిహింసల మీద కేంద్రీకరించకుండా దానికి గల ఒక కీలకమైన అంశాన్ని చర్చకు పెట్టింది. అప్పటి పీపుల్స్‌వార్ నేతృత్వంలో జరిగే రాజకీయ ఉద్యమం అసంపూర్ణంగా మిగిలిపోయిన భూసంస్కరణలను సంపూర్ణం చేసే ఉద్యమంగా గుర్తించడం ఆ వేదిక చేసిన ప్రధాన ప్రతిపాదన. రాజకీయ ఉద్యమాలలో ఒక పాజిటివ్ అంశాన్ని లేవనెత్తడం వలన ఆ వేదికకు ప్రజల మధ్య గౌరవం, బహుశా పీపుల్స్‌వార్ పార్టీకి కూడా ఆ వేదిక మీద గౌరవం కలిగాయి. అప్పటి కాలంలో వేదికలో ప్రధాన సభ్యులు అయిన మాజీ సీనియర్ అధికారి శంకరన్ కూడా భూసంస్కరణల మీద, దాని అమలులో ప్రభుత్వ యంత్రాంగం వైఫల్యం మీద వ్యాసాలు రాశారు. చంద్రబాబు ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో ఈ చర్చల మీద, అంటే పౌరస్పందన వేదిక ప్రతిపాదించిన అంశాల మీద, విస్తృతంగా మీడియాలోనూ, ఇతర ప్రజావేదికలలోనూ చర్చలు జరిగాయి. చర్చలకు సుముఖంగా ప్రజాభిప్రాయం సమీకరణ కూడా జరిగింది. అనేకానేక కారణాల వల్ల చంద్రబాబు హయాంలో చర్చలు ఒక వాస్తవ రూపం తీసుకోలేదు. పౌరస్పందన వేదిక ప్రజల సమస్యలను ప్రజాతంత్ర సాధనాలతో పరిష్కరించవచ్చును అనే నమ్మకంతో తన కార్యక్రమాన్ని రాజశేఖరరెడ్డి హయాంలో కూడా కొనసాగించింది. భూమి సమస్య ఒక తీవ్రమైన సమస్య అనీ, పీపుల్స్‌వార్ ఉద్యమం ఈ సమస్యను తీవ్రంగా తీసుకుంటోందనీ, దాని ఫలితంగా ఉద్యమ ప్రాంతంలో బీడు పొలాలుగా తయారవుతున్న పంట పొలాల గురించి కూడా తమ నివేదికలో ప్రస్తావించారు. రాజశేఖరరెడ్డి హయాంలో పౌరస్పందన వేదిక ఒక విజయం సాధించింది. ఆ విజయం మావోయిస్టు పార్టీ, ప్రభుత్వం కలిసి కూర్చుని చర్చించుకునే అవకాశం.

చర్చల ప్రక్రియను సాదరంగా ఆహ్వానించిన ప్రజానీకం చర్చలకు వస్తున్న మావోయిస్టు పార్టీ ప్రతినిధులకు ఘనస్వాగతం పలికారు. గుత్తికొండలో జరిగిన మహాసభలకు, మావోయిస్టు పార్టీ అవతరణ సందర్భంగా హైదరాబాద్ శివార్లలో జరిగిన మహాసభలకు, చర్చల సందర్భంగా వరంగల్లులో జరిగిన సభలకు విశేష ప్రజాదరణ చూపించారన్నది పత్రికలలోను కాని, టెలివిజన్ మీడియాలలో కాని

చూసినపుడు మనకు తెలిసిన సత్యం. ఒకరకంగా చూస్తే అవి పండుగ రోజులలా కనిపిస్తాయి. పండుగ అంటే ఒక కొత్త సమాజం ఆవిర్భావానికి ఇది ఒక నాందా అనిపించే రీతిలో ప్రజాస్వామ్యంలో ప్రజల ప్రధాన పాత్రను గుర్తు చేసే విధంగా, మావోయిస్టు పార్టీ ఒక ప్రత్యామ్నాయంగా ప్రజలు కోరుకుంటున్నట్లు ఒక సంకేతంగా అనిపించింది. ఇది నిజంగా ప్రత్యామ్నాయమా అనుకోవడానికి వార్తా పత్రికలలో మేము గమనించిన ఒక విషయం చెప్పాలి. మావోయిస్టు ప్రతినిధులకు వివిధ ప్రజాసంస్థలు తమ డిమాండ్లను వారి ముందు పిటిషనర్లుగా పెట్టుకున్నారనే వార్త. అందులో వికలాంగులు కూడా ఉండడం, వారి కోరికలను పార్టీ ప్రతినిధుల ముందు పెట్టడం ప్రజాచైతన్యానికి ఒక గుర్తు. ఎన్ని పిటిషన్లు వచ్చాయో మాకు తెలియదు కాని, అటువంటి పిటిషన్లు 150 వరకూ ఉన్నాయనేది ఒక వార్త. సామాజిక అధ్యయన కారులుగా మాకు ఆ పిటిషన్లు చదివితే, వాటిని విశ్లేషిస్తే సమాజంలో అపరిష్కృతమైన, ప్రభుత్వం చొరవ చూపని సమస్యలు ప్రజలలో మావోయిస్టు పార్టీ చెయ్యగలదనే నమ్మకం ఉందని, ఆ సమాజ అవగాహనకి ఎంతో తోడ్పడేది. ఎందుకో ఆ పిటిషన్లు మాలాంటి వాళ్లకి, సమాజానికి కనుమరుగయిపోయాయి.

చర్చలు సానుకూలంగా జరగడం గురించి ప్రభుత్వాలు, మావోయిస్టు పార్టీ రూపంలో ఒక మంచి నిర్మాణాన్ని కూడా ప్రతిపాదించారు. ఆంధ్రప్రదేశ్‌లో ప్రజాస్వామ్యం మీద గౌరవం, ఆచరణలో ప్రజాస్వామ్యాన్ని ఆశించేవాళ్లు అటువంటి మేధావులతో ఒక మధ్యవర్తుల కమిటీని, ఒక నిర్వాహక కమిటీని తయారు చేసారు. చర్చలలో చర్చించవలసిన అంశాలు ప్రభుత్వపరంగా ఎజెండా ఉందో లేదో మాకు తెలియదు. కాని మావోయిస్టు పార్టీ ఒక ఎజెండాతో ముందుకు వచ్చింది. ఆ ఎజెండాలో ప్రజాస్వామ్యం, స్వావలంబన, భూమి సమస్య ఉన్నాయి. చర్చల సమయంలో దేనిమీద చర్చలు జరిగాయి, ప్రభుత్వ ప్రతిపాదనలేమన్నా ఉన్నాయా, మావోయిస్టు పార్టీ ప్రతిపాదనలు ఏమి ఉన్నాయి అనే దాని మీద సమాచార పత్రికలలో వచ్చిన వార్తలు తప్పితే సామాన్య ప్రజానీకానికి చాలా వరకు అవి గోప్యంగానే ఉన్నాయి. పౌరస్పందన వేదిక ఇచ్చిన రిపోర్ట్‌లో చర్చల మినిట్స్ మీద కొంత అవగాహన రావచ్చును. ఆ నివేదిక సంపూర్ణమా కాదా అనే ప్రశ్నను పక్కనపెట్టి పార్టీ ప్రతినిధులు తిరిగి వారి స్థావరాలకు వెళ్లిపోయిన తరువాత ఒక సమీక్ష పౌరస్పందన వేదిక కాని, ప్రభుత్వం కాని, మావోయిస్టు పార్టీకాని ప్రజల ముందు ఉంచిన దాఖలాలు లేవు.

చర్చల ఫలితమో ఏమో కాని రాజశేఖరరెడ్డి ప్రభుత్వం మూడు, నాలుగు విడతలలో లక్షల ఎకరాల మిగులు భూమి పంపకాలు చేపట్టినట్లు వార్తా కథనం. చర్చల మూలనే ఇది జరిగి ఉంటే ఏదో కొంత మందికి ఉపాధి దొరికిందని మనం ఆశపడవచ్చును. అంతకు మించి ప్రభుత్వపరంగా మౌలికమైన మార్పులు పెద్దగా చోటు చేసుకోలేదు. మౌలికమైన ప్రధాన సమస్యల మీద ప్రభుత్వాల ఆలోచన మారలేదు. ప్రపంచ బ్యాంక్ సహాయంతో చంద్రబాబు చేపట్టిన కార్యక్రమాలన్నీ రాజశేఖరరెడ్డి ప్రభుత్వం కొనసాగిస్తూనే ఉంది. సెజ్‌లు, విద్యుదుత్పత్తి కేంద్రాలు, విమానాశ్రయాలు, హైటెక్ రోడ్లు, ఫ్లైఓవర్లు, కోస్తా కారిడార్లు, ఖనిజ ఉత్పత్తి కర్మాగారాలు ఇవన్నీ అభివృద్ధి కింద చలామణీ అవుతూ చంద్రబాబుని మరిపింప చేస్తున్నాయి. చంద్రబాబుని కూడా కొంచెం భయ పెడుతున్నాయి. ఆ భయంతోనే చంద్రబాబు మళ్లీ మద్యపానం, రెండు రూపాయల బియ్యం, పేద ప్రజానీకం కష్టాలు అన్నీ ఆయనకి తిరిగి కనిపిస్తున్నాయి. చర్చల ప్రక్రియ వల్ల అభివృద్ధి నమూనా మీద ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా ద్వారా చర్చలు జరుగుతాయనే ఆశ ఏమన్నా ఉంటే అది నిరాధారం. చర్చలు సఫలమయ్యాయా విఫలమయ్యాయా అనే దానిమీద విస్తృతంగా చర్చ జరగలేదు. వార్తా పత్రికల కథనం ప్రకారం చర్చలు చేయడం ఒక తప్పు అని మావోయిస్టు పార్టీ కేంద్ర కమిటీ నిర్ణయించిందని ఒక వార్త. ఆ తప్పేమిటో, ఎందువల్ల జరిగింది, ఎలా జరిగింది, అనే దాని మీద విశ్లేషణ జరిగినట్లు సమాచారం లేదు.

ప్రభుత్వపరంగా చర్చలు సఫలీకృతమయ్యాయి అనే అంశం మీద కూడా సమాచారం లేదు. ప్రభుత్వ యంత్రాంగంలో ఒక భాగమైన జ్యుడీషియరీ తన వంతు పాత్ర చేస్తూనే ఉంది. ప్రభుత్వంలో ఉండే లెజిస్లేచర్, ఎక్సిక్యూటివ్ ఒక కొత్త పంథాని చర్చల ద్వారా ఎంచుకోలేని పరిస్థితిలో ఒక జలయజ్ఞం మినహా పాత పద్ధతులలోనే ఉండడంతో ఒక అనిశ్చలతతో కూడుకొని కొంత అస్తవ్యస్తంగా ఉండిపోయింది. ఇకపోతే ప్రభుత్వ యంత్రాంగంలో భాగమైన పోలీసు యంత్రాంగం కొంత బలపడినట్లుగా సూచనలు కనిపిస్తాయి. నక్సలైటు ఉద్యమాన్ని ఎదుర్కొనే రోల్ మోడల్‌గా ఆంధ్రప్రదేశ్ పోలీసు వ్యవస్థ కొంత పేరు తెచ్చుకుంది. దేశంలోని మిగిలిన రాష్ట్రాలలో హింస - ప్రతిహింసల మీద చర్చ తీవ్రతరమైన కాలంలో ఆంధ్రప్రదేశ్‌లో ఒక శాంతియుత వాతావరణం ఉండడం ఒక గమనీయమైన అంశం.

ఇక పౌరసమాజం చర్చల మీద తమ అవగాహనను వ్యక్తం చేసే పరిస్థితి కూడా లేనట్లుంది. పౌరసమాజానికి ప్రతీకగా నిలబడిన పౌర స్పందన వేదిక కూడా తమదైన అవగాహనను ప్రజల ముందు పెట్టకపోవడం ఒక దురదృష్టం. ఈ సమయంలో పౌరస్పందన వేదికలో ఒక సభ్యుడుగా ఉన్న హరగోపాల్ వ్యాసం కొంత అభినందనీయమైనా, అది కొన్ని ప్రశ్నలు లేవదీసింది.

ఆ వ్యాసంలో - 'మన రాష్ట్రంలో జరిగిన ఒక ప్రయోగం ఈ రోజు జాతీయ స్థాయిలో ప్రస్తావనకు రావడం, ఆ ప్రయోగపు రిలవెన్స్ ఇంకా ఉందన్న సంతోషం కాని, ఆ ప్రయోగం విఫలమవ్వడమే కాక, ఆ ప్రయోగంలో పాల్గొన్న విప్లవ పార్టీలు ఈ రాష్ట్రంలో వెనుకంజ వేయడం, ఆ రాజకీయాలకు విఘాతం కలగడం మాలాంటి వాళ్లని కలవరపెట్టడమే కాక, మనసులో ఒక గిల్ట్ ఫీలింగ్ కూడా ఉండి పోయింది' అని రాసారు. ఈ గిల్ట్ ఎందువల్లనో కొంత అసంపూర్ణంగా ఒదిలివేసారు. ఈ చర్చల ప్రయోగంలో పాల్గొన్న విప్లవ పార్టీలు, ఆ రాజకీయాలు కొంత వెనుకంజ వేసాయి అనడంలో గిల్టీ ఉందా అని చూస్తే ఏ విప్లవ రాజకీయులైనా, ఏ ప్రజా ఉద్యమైనా రాజకీయాలను ఎల్లకాలం ముందంజ వేస్తాయనుకోవడం ఒక దురాశ, ఒక అశాస్త్రీయం. ఆ ఉద్యమాలు ఒకప్పుడు రెండడుగులు ముందుకు వేస్తే ఒక అడుగు వెనక్కు వేయడం అనేది ఒక గతితర్కం. అది ఆయా పార్టీల ఆచరణాత్మక వ్యూహంలో భాగంగా చూడగలగడం ఆశను రేకెత్తిస్తుంది. నిరాశను కాని, గిల్టీ కాని ప్రోత్సహించదు. అది ఆయా పార్టీల విజ్ఞతకు ఒదిలి వేయడం పౌరసమాజ ప్రధాన కర్తవ్యం. ఇకపోతే చర్చలు సఫలమవడానికి హరగోపాల్ గారు చెప్పిన మరొక కారణం ఉంది. అది 'నిజానికి ఆంధ్ర రాష్ట్రంలో చర్చలు జరిగినపుడు పాలక వర్గాలు మరింత దూర దృష్టితో ఆలోచించినా, లేక రాష్ట్రానికి కాస్త చరిత్ర చదువుకున్న లేదా కొంత తాత్విక ధోరణి కలిగిన, లేదా ఉన్నతమైన

మానవీయ విలువలున్న ముఖ్యమంత్రి ఉన్నా, ఫలితాలు భిన్నంగా ఉండేవేమో అనిపిస్తుంది.'

ప్రజాస్వామ్యవాది, రాజకీయ శాస్త్ర నిపుణుడు అయిన హరగోపాల్ ఇలా ఆశపడడం సబబు కాదేమో. రాష్ట్ర ముఖ్యమంత్రులు కొన్ని ఇంట్రెస్ట్ గ్రూప్స్ మధ్య వైరుధ్యాలను సమీకరించుకుంటూ తన స్థిరత్వానికి ఆలంబనగా పనిచేసికోవడం పరిపాటి. అందునా కాంగ్రెస్ ముఖ్యమంత్రు లయితే కాంగ్రెస్ పార్టీకి కేంద్రమైన ఒక మూల కుటుంబాన్ని ఆనంద పరిచే కార్యక్రమాలకు మొగ్గు చూపుతారు. కాని ఉన్నత మానవీయ విలువలు కాని, చరిత్ర కాని, తాత్విక ధోరణి కాని కలిగి ఉంటారను కోవడం కొంత అసందర్భం. ప్రజా ఉద్యమాల ద్వారా వచ్చిన తమిళనాడు ప్రభుత్వం, కొంత మార్క్సిస్టు ప్రభుత్వాలకు కొంత చరిత్ర, మానవీయ విలువలు, తాత్విక ధోరణి ఉండవచ్చునేమో కాని, ఓట్ల రాజకీయాలతో వచ్చిన ముఖ్యమంత్రులకు అది సాధ్యపడదు. ఎవరో ఒక వావిలాల గోపాలకృష్ణయ్య లాంటి వారిని మనసులో పెట్టుకుంటే అంత సబబు కాదేమో. (మన రాష్ట్రంలో గత ఐదేండ్లలో రాజీవ్ స్వగృహ, రాజీవ్ ఆరోగ్యశ్రీ, రాజీవ్ విమానాశ్రయం, నెహ్రూ రింగురోడ్డు, ఇందిరాగాంధీ ఆవాస్ యోజనా లాంటివి రాజశేఖరరెడ్డిని ఒక సామంత రాజుగా ఎదగనిచ్చాయి కాని ప్రజల చరిత్ర ఉన్న మానవీయ విలువలు, తాత్విక ధోరణి కలవాడుగా ఊహించుకోవడం ఒక తప్పిదమే.)

ఇకపోతే, ఒక ముఖ్య విషయం గురించి ప్రస్తావించాలి. అందులో కొంత హరగోపాల్‌కి కాని, పౌరస్పందన వేదికకి కాని కొంత గిల్టీ ఉండవచ్చును. ఏ చర్చలకైనా మూలం ఒక నిర్దిష్ట స్థలకాల పరిస్థితులు. ఆ పరిస్థితులలో సమాజంలో కొన్ని ఆచరణాత్మకమైన సమస్యల మీద అసంతృప్తి, ఆవేదన ఉంటాయి. ఆ సమస్యలకి ఒక సమాధానం కోరుకుంటుంది. ఆ సమాధానం కొన్ని ఆచారణాత్మకమైన మార్పులను కోరుకుంటుంది. పౌరస్పందన వేదిక ప్రధానంగా భూమి సమస్య మీద కేంద్రీకరించింది. భూ సంస్కరణల అమలులో లోపాలు, భూమి లేని ప్రజల ఆకాంక్షలతో వేదిక స్పందించింది. ఇది ఆచరణకి సంబంధించిన విషయం. చర్చలలో ఎజెండాకు సంబంధించిన విషయాలు చూస్తే అవన్నీ సమాజ ఆలోచన, చైతన్యానికి సంబంధించినవి. అందులో మొట్టమొదటగా ప్రతిపాదించింది ప్రజాస్వామ్యం. రెండవది స్వావలంబన, ఇంక మూడవది భూమి. ఇవన్నీ కూడా ఆలోచనకి సంబంధించినవి. ఇంకా ఇవి అమూర్త భావాలు. ప్రధాన సమస్య అయిన భూమి, భూ సంస్కరణలు వదిలి అమూర్త భావనల మీద చర్చలుగా మిగిలిపోతే కొంత గిల్ట్ ఉండవచ్చును. అప్పటి పత్రికలలో గ్రామీణ భూసంస్కరణల మీద కంటే రియల్ ఎస్టేట్ రంగంలో భూముల మీద కేంద్రీకరించబడడం జరిగిందనే వార్తలు వచ్చాయి. చర్చలు వాస్తవికత (కాంక్రీట్) గురించి అమూర్తత (అబ్‌స్ట్రాక్ట్) మీదకి సాగడం బహుశా గిల్ట్‌ని లేవనెత్తుతుందేమో.

ఈ నేపథ్యంలో వ్యాసాన్ని కొంచెం పరిశీలిద్దాం. వ్యాసంలో 'జాతీయ స్థాయిలో శాంతి చర్చలు జరిగితే వచ్చే ప్రయోజనం దేశ అభివృద్ధి నమూనా మీద మౌలికమైన చర్చకు దారి తీస్తుంది' అని రాశారు. దానికి రెండు ప్రధానమైన ఇబ్బందులు ఉన్నాయి. అవి ఒక దానితో ఒకటి ముడిపడి ఉన్నాయి. అందులో మొదటిది జాతీయస్థాయికి సంబంధించింది. మన దేశాన్ని పరిపాలిస్తున్న ప్రభుత్వాలు రెండు లెవెల్స్‌లో ఉంటాయి. ఇందులో మొదటిది కేంద్ర ప్రభుత్వం. దాని పరిమిత రాష్ట్ర ప్రభుత్వానికి ప్లానింగ్ కమిషన్ ద్వారా, ఫైనాన్సు కమిషన్ ద్వారా వనరులు చేకూర్చడం. ప్రపంచీకరణలో భాగంగా దేశాన్ని ఒకే మార్కెట్‌గా రూపుదిద్దే క్రమంలో వచ్చే ఇండస్ట్రియల్ పాలసీ, మైనింగ్ పాలసీ, ఫారెస్టు పాలసీ, ఫెడరల్ రాజ్యాంగానికి విరుద్ధంగా ఒక యూనిటరీ స్టేట్‌గా కేంద్రం ఎదుగుతోంది. కేంద్రానికి ఉండే వనరుల ద్వారా అభివృద్ధి పథకాలను తయారు చేసే కార్యక్రమం, అవి రాష్ట్రాలకు అమ్మే కార్యక్రమం కూడా ఆ కేంద్రీకరణలో ఒక భాగమే. కాని రాజ్యాంగ రీత్యా అమలు చేసే సంస్థలు రాష్ట్రానికే చెందుతాయి. ఆ అమలులో వచ్చే శాంతి, భద్రతల సమస్య కూడా రాష్ట్రానిదే. మన రాష్ట్రాలు ఒక్కొక్క రాష్ట్రం ఒక్కొక్క వ్యవస్థగా ఉన్న తరుణంలో చర్చల ఫలితంగా ఏమైనా మార్పు సూచిస్తే, ఆ మార్పు రాష్ట్రానికి సంబంధించినవి అని కేంద్ర హోం మంత్రి చిదంబరం గారు చెబుతూనే ఉన్నారు. ఆ అమూర్త స్థాయి నుండి చర్చలను ఒక వాస్తవికతలోకి తీసుకుని రావాలంటే, చర్చలు రాష్ట్ర ప్రభుత్వాలతో విడివిడిగా జరగాలి. కేంద్రం ఒక థర్డ్ పార్టీగా ఉంటే కేంద్రం తన బాధ్యతను నెరవేర్చగలుగుతుంది, తన పాలసీలలో మార్పులు తేగలుగుతుంది. లేని సందర్భంలో వేడి రాష్ట్రానిది, వెలుగు కేంద్రానిది లాగా అయిపోయే ప్రమాదం ఉంది.

ఇక రెండో ఇబ్బంది గురించి అనేకానేక కారణాలతో మన రాష్ట్రాలు ఒక జాతీయతను, ఒక చరిత్రను కలిగి ఉన్నాయి. ఆ జాతీయత, ఆ చరిత్ర కారణంగా ఒక్కొక్క రాష్ట్రానికి కొన్ని అసంపూర్ణంగా ఉన్న సమస్యలు ఉంటాయి. ఒక జార్ఖండ్ రాష్ట్రం తీసుకుంటే అక్కడ భూమి సమస్య, ఆదివాసీ సమస్య ప్రధానంగా కాకుండా జాతీయ, అంతర్జాతీయ పెట్టుబడులు తెచ్చే విధ్వంసం, ప్రధానమవుతుంది. ఒక ఛత్తీస్‌గఢ్ తీసుకుంటే ఒక ఆదివాసీ సమస్య, అటవీ సంపదను కొల్లగొట్టే పెత్తందారుల సమస్య, కొంత జాతీయ అంతర్జాతీయ పెట్టుబడి గనుల తవ్వకం ద్వారా వచ్చే విధ్వంసం సమస్యలు గురించి అవవచ్చును. ఇక ఒడిషాకి వస్తే ఆదివాసీ సమస్య ప్రధానంగా ఉంటుంది. దానికి తోడు వేదాంతాలు, టాటాల కన్ను బాక్సైట్ మీద ఇనుము, బొగ్గు ఖనిజాల మీద కేంద్రీకరించడంతో అవే రాష్ట్ర ప్రధాన సమస్యలవుతాయి. ఇవి కాక భూస్వామ్యం కూడా ఒడిషాలో ఒక ప్రధాన సమస్య. ఇక బెంగాల్‌కి వస్తే వివాదాస్పదంగా కనిపించినా, అక్కడ ప్రధానంగా భూమి సమస్య. అందునా మిగులు మనుషుల సమస్య ప్రధానంగా కనిపిస్తుంది. ఒక్కొక్క రాష్ట్రంలో నిర్దిష్టమైన సమస్యలు – పరిష్కారం కోసం ఎదురుచూసే సమస్యలు – ఉన్నప్పుడు చర్చలు ఆ నిర్దిష్టం మీద జరిపితే ఆ సమస్యలకు ఒక పరిష్కారం లభించవచ్చును. అంతేకాని చర్చలు అభివృద్ధి నమూనా మీద, మౌలిక అంశాల మీద చర్చతో కేంద్రీకృతమైతే అవి అమూర్తంగానే ఉండిపోతాయి. ఈ విషయాన్ని హరగోపాల్ లాంటి మేధావులు గుర్తిస్తారని, ఇటువంటి విషయాల మీద చర్చ కేంద్రీకరిస్తారని నా ఆశ.

చివరగా చర్చల సఫలీకృతానికి ఆయన పెట్టిన ఒక గీటురాయి ప్రభుత్వం తరఫున ఉన్న ఉన్నతాధికారులు, అంటే ప్రధానమంత్రి, గృహమంత్రికి ఉన్నత మానవతా విలువలు, చరిత్ర మీద జ్ఞానం, తాత్విక ధోరణి గల వ్యక్తులుగా, చర్చించదగ్గ వ్యక్తులుగా ఆయన అనుకుంటారు అని మనం అనుకోవడం సరి అయినది కాదేమో.

చర్చలు జరగాలి అని నా అచంచల విశ్వాసం. కాని ఆ చర్చలు అభివృద్ధి నమూనా, అసమానతల అమూర్తం నుంచి నిర్దిష్ట సమస్యల వైపుకి మళ్లించాలని, అటువంటి చర్చలు సమాజానికి అవసరమూ, అనివార్యమూ అని నా ఉద్దేశం.

*(రచయిత సామాజిక పరిశోధకులు)* వీ

*శ్రీకృష్ణ కమిటీకి తప్పడు నివేదికలు అందించడం, ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షను దేశ ద్రోహంగా చిత్రించడం సీమాంధ్ర ఆధిపత్య శక్తుల స్వార్థ ప్రయోజనాల కోసమేనని అంటున్నారు* **చిక్కుడు ప్రభాకర్**

# రాష్ట్రం అడిగితే దేశద్రోహమా?

ఆగస్ట్ 6న సీమాంధ్ర మంత్రులు, సెప్టెంబర్ 9న సీమాంధ్ర పార్లమెంట్ సభ్యులు శ్రీ కృష్ణ కమిటీకి సమర్పించిన నివేదికలలో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఎందుకు అవసరం లేదో, సమైక్యాంధ్రగా ఉండడం ఎందుకవసరమో నిర్దిష్టంగా పేర్కొనలేదు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమంపై వారికి భిన్నాభిప్రాయం ఉండడం సహజమే. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమం దేశ విచ్ఛిన్నకర ఉద్యమమంటూ, దీనిని ఖలిస్తాన్, నాగాలాండ్‌లతో పోల్చారు. డిసెంబర్ 7 వరకు కేంద్ర ప్రభుత్వ నిర్ణయానికి కట్టుబడుతామని అన్నారు. డిసెంబర్ 9 తర్వాత కేంద్ర ప్రభుత్వ నిర్ణయాన్ని ధిక్కరించి రాజీనామాలు చేసి వాస్తవాలతో కూడిన కమిటీ అవసరమని కమిటీ వేయించారు. ఆ కమిటీ కేంద్ర ప్రభుత్వానికి తమ అధ్యయన నివేదిక సమర్పించకముందే ఆంధ్రప్రదేశ్ యథావిధిగా ఉంచాల్సిన అవసరాన్ని శాస్త్రీయంగా, హేతుబద్ధంగా తెలంగాణ రాష్ట్రమేర్పడితే సీమాంధ్రకు ఎలా నష్టం జరుగుతుందో, సమైక్యాంధ్ర ఉండడం వలన తెలంగాణ ప్రజలకు ఎలా న్యాయం జరుగుతుందో వివరించాల్సిన బాధ్యతను వదిలివేశారు. దీనికి కారణం ఏమిటంటే సమైక్యాంధ్రలో వారి (సీమాంధ్ర ప్రజా ప్రతినిధులు, సీమాంధ్ర కాంట్రాక్టర్లు, పరిశ్రమాధిపతులు, రియల్ ఎస్టేటర్లు) ప్రయోజనం మాత్రమే దాగి ఉన్నది. వీరి వాదనలో సీమాంధ్ర ప్రజల ప్రయోజనం ఏమాత్రం లేదు. వీరి ప్రయోజనాన్ని ఐదుకోట్ల సీమాంధ్ర ప్రజల ప్రయోజనానికి ముడిపెట్టి తమ ప్రయోజనాన్ని నెరవేర్చుకునే ప్రయత్నం చేస్తున్నారు.

ఇంకా ఒకడుగు ముందుకేసి తమ నివేదికలో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమం జాతి విచ్ఛిన్నకర ఉద్యమమని, దేశం నుండి వేరుపడే ఉద్యమమని అవాస్తవాలతో కూడిన విషయాలు పదే, పదే ప్రస్తావించడం తెలంగాణ ప్రజలను మరోసారి అవమానించడం, సీమాంధ్ర ప్రజలను మోసం చేయడమే అవుతుంది. ఇంకా ఆ నివేదికలో తెలంగాణ ప్రాంత రాజకీయ నాయకులు నిరుద్యోగులుగా మారి ఈ సమస్యను సృష్టించారనడం కూడా వాస్తవ విరుద్ధమైనదే. వాస్తవంగా తెలంగాణ ప్రాంత రాజకీయ నాయకులు ఈ ప్రాంత ప్రజలకు చేసిన అన్యాయం చరిత్రలో నిలిచి ఉన్నది. తెలంగాణ ఉద్యమాన్ని తమ స్వప్రయోజనానికి వాడుకుని తెలంగాణ ప్రజలను 1969, 1972, 2004, 2009లో ఉద్యమం ఉవ్వెత్తున ఎగిసిపడ్డ ప్రతిసారి తమ విద్రోహ పాత్రనే పోషించారు.

ఈ దేశంలో మాకో రాష్ట్రం కావాలి అని ప్రజలందరు ఉద్యమించి రాష్ట్రాన్ని సాధించుకునే ప్రయత్నం ఎలా జాతిద్రోహం అవుతుంది?

అయిదు దశాబ్దాల ఆంధ్రప్రదేశ్ చరిత్రలో నీళ్లు, నిధులు, వనరులు, ఉద్యోగాలు పూర్తిగా సీమాంధ్ర వర్గం దక్కించుకుందని, సమైక్యాంధ్రలో తెలంగాణ ప్రజలు దగాపడ్డారని, నిర్దిష్టంగా ఆయా రంగాలలో జరిగిన దోపిడీని ప్రజలందరు తెలుసుకున్నారు. ఈ దోపిడీని ప్రజలకు వివరించడంలో తెలంగాణలోని అశేష మేధావివర్గం, సాంస్కృతిక రంగం విశేష కృషి చేసింది. ఫలితంగా గ్రామ పునాదుల వరకు తెలంగాణ ఉద్యమం వెళ్లింది. ఇందులో భాగంగానే తెలంగాణ ప్రజలు ఉద్యమిస్తున్నారు. గత ఉపఎన్నికలల్లో తీర్పునిచ్చారు కూడా.

గత అయిదు దశాబ్దాలుగా సమైక్యాంధ్ర రాష్ట్రంలో జరుగుతున్న వివిధ కుంభకోణాలలో సీమాంధ్రకు చెందిన ప్రజా ప్రతినిధులు, అధికార యంత్రాంగం కలిసి ఎంత ప్రజాధనం దోపిడీ చేసిందనే విషయం స్పష్టంగా బయటపడుతూనే ఉంది. అలాగే నీరు, ఉద్యోగాలు, వనరులు, అధికార దర్పం సీమాంధ్ర వర్గానికే దక్కడం వల్ల తెలంగాణ ప్రజలు అనేక ఇబ్బందులు అనుభవిస్తున్నారు. కృష్ణా, గోదావరి నదులు, వాటి ఉప నదులు తెలంగాణ ప్రాంతంలో సగటున 73 శాతం పారుతున్నా, తెలంగాణ ప్రాంత భూములకు పారుతున్న నీరెంత? సీమాంధ్ర భూములకు పారుతున్న నీరెంత అనే విషయం సమగ్రంగా పరిశీలిస్తే అర్థం అవుతుంది.

గత ట్రిబ్యునల్ అవార్డు ప్రకారం ఆంధ్రప్రదేశ్‌కు కృష్ణా నదిలో 811 టి.ఎం.సి.లు, గోదావరిలో 1408 టి.ఎం.సి.లు దక్కినాయి. కాని వాటిలో తెలంగాణ ప్రాంతానికి దక్కినవాటా కేవలం 350 టి.ఎం.సి.లు మాత్రమేననేది స్పష్టం. మిగతా నీరంతా నాగార్జునసాగర్ కుడి, ఎడమ కాల్వల ద్వారా, ప్రకాశం బ్యారేజీ ద్వారా, ధవళేశ్వరం బ్యారేజీ ద్వారా, పోతిరెడ్డిపాడును పెంచడం ద్వారా, ఈ మధ్యనే నిర్మించిన తాడిపూడి, పుష్కర లాంటి ఎత్తిపోతల పథకాల ద్వారా, ఇంకా ఎన్నో చిన్న నీటి పథకాల ద్వారా సీమాంధ్ర వారే లబ్ది పొందుతున్నారు. సమైక్యాంధ్రలోని సీమాంధ్ర ప్రాంతంలోని మొత్తం భూమిలో 79 శాతం సాగవుతుండగా, తెలంగాణ ప్రాంతంలో కేవలం 27 శాతం భూమి మాత్రమే సాగవుతున్నది. ఈ భూమి కూడా మెజారిటీగా బోరు బావులు. చెరువులు, కుంటలు, కాల్వల ద్వారా మాత్రమే సాగవుతున్నది. తెలంగాణలో గత అయిదు దశాబ్దాలుగా చెరువులు, కుంటలు, కాల్వలను పూడిక కూడ తీయలేదు. వ్యవసాయం మీద ఆధారపడి బతికే ప్రజానీకం పొట్ట చేతపట్టుకుని పట్టణాలకు వలసపోయి దుర్భర జీవితం గడుపుతున్నారు.

ఇక ఉద్యోగాల విషయంలో ఆంధ్రప్రదేశ్ ఏర్పడకముందే తెలంగాణ ప్రాంత ప్రజలకు ఉద్యోగాలు దక్కడం లేదని 1952లో ముల్కి – గైర్ ముల్కి ఉద్యమం వచ్చింది. 1956 తర్వాత ఈ ప్రాంతంలో నిరుద్యోగం మరింత పెరిగింది. రాష్ట్రంలో జోనల్ స్థాయి ఉద్యోగులు 1,06,000 ఉండగా ఈ ప్రాంతానికి చెందిన వారు 42,000 ఉండాలి. కాని కనీసం 20,000 మంది కూడా ఈ ప్రాంతానికి చెందిన వారు లేరు. మిగతా ఉద్యోగాలు జిల్లా సెలక్షన్ కమిటీల ద్వారా నియమించేవి. స్థానిక ప్రాంతానికి చెందిన వారు ఇందులో 85 శాతం ఉండాలి. కాని నేడు తెలంగాణ జిల్లాల్లో 65 శాతం కూడా లేరు. 1975–2006 వరకు దాదాపు 31 సంవత్సరాలలోపు ఎ.పి.పి.ఎస్.సి. నియమించిన 22,613 వివిధ గ్రూప్‌ల ఉద్యోగాలు భర్తీ చేయగా, ఇందులో తెలంగాణ ప్రాంతానికి

30 శాతం వాటా కూడా దక్కలేదు. గత అయిదు సంవత్సరాలుగా ఉద్యోగ సంఘాలు రాష్ట్రంలో దాదాపు ఆరు లక్షల ఉద్యోగాలు ఖాళీ ఉన్నాయనీ, ఇందులో 3.5 లక్షల ఖాళీలు కేవలం తెలంగాణలోనే ఉన్నాయనీ, ఇవి భర్తీ చేయండనీ వారు ఆందోళన చేస్తున్నారు. ప్రభుత్వం వాటిని భర్తీ చేయకుండా, అవుట్ సోర్స్ ద్వారా సీమాంధ్రకు చెందిన వారినే తెలంగాణ ప్రాంతంలో నియమిస్తున్నది. తెలంగాణకు జరిగిన అన్యాయాన్ని సరిదిద్దేందుకు ప్రజలు, ఉద్యోగులు పోరాడడం వల్ల వివిధ జి.ఒ.లు వచ్చినాయి. అవి అమలు చేయడానికి అటు ప్రభుత్వాలు, ఇటు యంత్రాంగం రెండూ ప్రయత్నించలేదు. జి.ఒ. 610ని అమలు చేయడానికి కాంగ్రెస్ ప్రభుత్వం 2008 డిసెంబర్ 27న అప్పటి ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డి ఉద్యోగుల వివరాలు శాసనసభ ముందు పెడతామని ప్రకటించినా, ప్రభుత్వ యంత్రాంగం దాదాపు 67,000ల ఉద్యోగుల జాబితాను ఆయా శాఖలు ప్రభుత్వానికే సమర్పించలేదు. దీనికి సీమాంధ్ర రాజకీయ యంత్రాంగం, అధికార యంత్రాంగం రెండు కుమ్మక్కై ఆ జాబితాను తొక్కిపెట్టడమే కారణం. 2007లో పబ్లిక్ సర్వీస్ కమిషన్ ద్వారా నింపిన 22 గ్రూప్-1 పోస్టులు ఆర్.డి.ఒ.లుగా నియమించబడగా, ఇందులో ఆరుగురు మాత్రమే తెలంగాణ వారుండగా, ఎస్.సి., ఎస్.టి, బి.సి.కి చెందిన వారు రాష్ట్ర వ్యాప్తంగా ఒక్కరు కూడా లేరు.

విద్యుత్ సంస్థలో తెలంగాణ ప్రాంతంలో పనిచేస్తున్న అధికారుల శాతం పరిశీలిస్తే ఈ రంగంలో తెలంగాణ వారు ఎంత అన్యాయానికి గురయ్యారో అర్థం అవుతుంది. ఉన్నతాధికార వర్గం అయిన చీఫ్ ఇంజనీర్, సూపరింటెండెంట్ ఇంజనీర్లు, డివిజనల్ ఇంజనీర్లు, ఎఫ్.ఎ., సి.సి.ఎ., డిప్యూటీ సి.సి.ఎ. లాంటి ఉద్యోగాలలో గత అయిదు దశాబ్దాలుగా 10 శాతం కూడా తెలంగాణ వారిని నియమించలేదు. విద్యుత్ బోర్డు పాలకవర్గంలో గత అయిదున్నర దశాబ్దాలలో నియమించబడిన చైర్మన్లు 13 మందిలో కేవలం ఇద్దరు మాత్రమే తెలంగాణ వారున్నారు. వారి మొత్తం పదవీకాలంలో 78.1 శాతం ఆంధ్ర వారుండగా, కేవలం 5.2 శాతం మాత్రమే తెలంగాణ వారున్నారు. ఈ బోర్డును పరిపాలన సౌలభ్యం కొరకు 1999 ఫిబ్రవరి 1న విడగొట్టగా, జెన్‌కో, ట్రాన్స్‌కోలుగా ఏర్పడ్డాయి. వీటిలో డైరెక్టర్లు మెజారిటీ శాతంగా ఆంధ్ర ప్రాంతం వారే ఉన్నారు. ఇందులో ఆంధ్రప్రాంతం వారు 60 శాతం ఉండగా, రాష్ట్రేతరులు 18.7 శాతం, తెలంగాణ వారు కేవలం 20.3 శాతం మాత్రమే ఉన్నారు. వారి పదవి కాలం కూడా ఈ నిష్పత్తిలోనే ఉంది. తెలంగాణ ప్రాంతంలో విద్యుత్ పంపిణీ పనిచేస్తున్న రెండు కంపెనీలయిన సెంట్రల్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ (సి.పి.డి.సి.ఎల్.), నార్తరన్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ (ఎన్.పి.డి.సి.ఎల్.) లో కూడా మొత్తం డైరెక్టర్లు ఆంధ్ర ప్రాంతం వారే ఉన్నారు.

సింగరేణి సంస్థలో దాదాపు 2700 మంది అధికారులుండగా 2000 మంది సీమాంధ్రకు చెందిన వారే ఉన్నారు. అలాగే రైల్వే రంగంలో కూడా 88 శాతం అధికారులు తెలంగాణేతరులే ఉండగా, ఇందులో దాదాపు 70 శాతం సీమాంధ్రకు చెందిన వారే ఉన్నారు. ఆర్.టి.సి.లో తెలంగాణ ప్రాంతంలోని నాలుగు జోన్‌లు, పది రీజియన్‌లు, ఏడు డిపోలు, రెండు వర్క్‌షాపులలో అధికార యంత్రాంగంలో కూడా 70 శాతం సీమాంధ్రకు చెందినవారే ఉన్నారు.

జ్యుడిషియరీలో తెలంగాణకు అపారమయిన నష్టం జరిగింది. సమైక్యాంధ్రలో ఇప్పటి వరకు ఒక్కసారి కూడా అడ్వకేట్ జనరల్ పదవిలో తెలంగాణ వారిని నియమించలేదు. రాష్ట్ర ఉన్నత న్యాయస్థానంలో, జిల్లాల న్యాయస్థానాలలో న్యాయమూర్తుల, ప్రభుత్వ న్యాయవాదుల నియామకాలలో తీరని అన్యాయం జరిగింది. ఇలా విద్య, వైద్య, వైజ్ఞానిక రంగాలలో కూడా తెలంగాణ ప్రాంత ప్రజలు రెండవ రకం పౌరులుగా వివక్షతతో జీవితం గడిపారు. ఆగస్ట్ మొదటివారంలో భారత ప్రభుత్వం దేశంలోని 250 జిల్లాలను వెనకబడినవిగా ప్రకటించింది. ఇందులో మన రాష్ట్రానికి చెందిన జిల్లాలు 13 ఉండగా, ఇందులో పది జిల్లాలు తెలంగాణకు చెందినవే ఉన్నాయి. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ప్రభుత్వం ప్రకటించిందే ప్రమాణికం అవుతుంది కదా! కేంద్ర ప్రభుత్వ ప్రకటన ద్వారా తెలంగాణ ప్రజలు రాష్ట్ర ఏర్పాటు కోరుకోవడంలో శాస్త్రీయత ఉన్నదనేది మరోసారి నిరూపించబడింది. అలాగే సీమాంధ్ర, కోస్తాంధ్ర ప్రాంతానికి చెందిన విశాఖ స్టీల్‌లోకానీ, ఆంధ్ర షుగర్స్, ఆంధ్ర పేపర్ మిల్స్‌లో కాని వంద మంది అధికారులు కూడా తెలంగాణ వారు లేరనేది స్పష్టం. అలాగే జోన్ 1,2,3లలో తెలంగాణ ప్రాంత ఉద్యోగులు అయిదు శాతం కూడా లేరు. తెలంగాణ ప్రాంతంలోని 6వ జోన్‌ను ఫ్రీజోన్‌గా మార్చే ప్రయత్నం చేస్తూ, తెలంగాణ ప్రజలను ఇంకా రెచ్చగొడుతున్నారు. ఒకవైపు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఉద్యమం ఉవ్వెత్తున కొనసాగుతుంటే, ఇంకొక వైపు సీమాంధ్రకు చెందిన వారు ప్రతి రంగాన్ని తమ ఆధిపత్యంలోకి తెచ్చుకునే ప్రయత్నం చేస్తూనే ఉన్నారు.

గత ప్రభుత్వం జలయజ్ఞం మొదలుపెడితే ఇందులో తెలంగాణకు చెందిన ప్రాజెక్టుల నిర్మాణం ఎక్కడేసిన గొంగళి అక్కడే ఉండగా, కోస్తాంధ్రకు మూడో పంటకు నీరందించేందుకు తెలంగాణలోని దాదాపు రెండు వందల గ్రామాలను ముంచే పోలవరం ప్రాజెక్టు యుద్ధ ప్రాతిపదికన కడుతున్నారు. దీనికి జాతీయహోదా కూడా కల్పించేందుకు కేంద్రప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఇంకోవైపు బయ్యారం లాంటి గనులను అక్రమంగా తాము దక్కించుకునేందుకు సీమాంధ్ర పెట్టుబడిదారులు ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఆగస్ట్ 17న కేంద్రం ఆ గనుల లీజును రద్దు చేసినా, ఇప్పటి వరకు రాష్ట్ర ప్రభుత్వం అందుకు సంబంధించిన జి.ఒ. 64ను రద్దు చేయకపోవడం ఎవరి ప్రయోజనం కోసం ఈ ప్రభుత్వం పనిచేస్తున్నదనేది తెలంగాణ ప్రజలు గ్రహిస్తున్నారు.

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు సమస్య పరిష్కారానికి కమిటీ ఒక దారి చూపుతుందని తెలంగాణ ప్రాంతంలో కొందరు నమ్ముతుంటే ఆ నమ్మకాన్ని వమ్ము చేస్తూ మా దగ్గర ఎటువంటి పరిష్కారం లేదు, అంతా కేంద్ర ప్రభుత్వమే చూసుకుంటుందని (సెప్టెంబర్ 6న, ఆంధ్రజ్యోతితో ఢిల్లీలో మాట్లాడుతూ) ప్రకటిస్తున్న ఆ కమిటీ సభ్య కార్యదర్శి దుగ్గల్ తెలంగాణ ప్రజలను మరోసారి వంచించడం కాదా? రోజుకో ప్రకటన చేస్తూ రాష్ట్ర ప్రజలను మరోసారి గందరగోళానికి గురిచేసే ప్రయత్నం చేస్తున్నారు. అలాగైతే, అసలు కమిటీ ఎందుకేసినట్లు? అలాగే ఎటువంటి ఉద్యమాన్నైనా హోం శాఖ చూసుకుంటుందని ప్రకటించడం బాధ్యతా రాహిత్యమే అవుతుంది.

ప్రజల ప్రజాస్వామిక హక్కులడిగితే పోలీసుల ఇనుప బూట్లు తెలంగాణ ప్రాంతమంతా పరేడ్ చేస్తాయంటే ఈ ప్రాంతమంతా కాశ్మీర్‌ను చేసినట్లు చేస్తారా? గత అయిదు దశాబ్దాలుగా వేలాదికోట్ల రూపాయలు ఖర్చు చేసి పారా మిలిటరీ బలగాలను మోహరించి ప్రతి ఏడుమంది ప్రజలకు ఒక సైనికున్ని దించినా, ఎంతో ప్రాణనష్టం (పౌరులు, పోలీసు బలగాలు) జరిగినా, ఇప్పటికీ కాశ్మీర్‌లో పౌర పాలన కొనసాగుతున్నదా? రావణకాష్టంలా రగులుతూనే ఉందనే విషయం ప్రభుత్వాలు మరిచి, తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును కూడా పోలీసులను మోహరించి అడ్డుకుంటామంటే సాధ్యమేనా? ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజల అభిప్రాయాన్ని గౌరవించకుండా, ప్రజాస్వామిక, రాజ్యాంగ బద్ధమైన హక్కును కూడా కొందరి ప్రయోజనాల కొరకు కాలరాస్తుంటే ఎలా?

వాస్తవంగా తెలంగాణ ప్రాంతం ఎగువన ఉండడం వలన జీవనదులలో నీరు మాకు వస్తదో, రాదో అనే భయం అక్కడి రైతాంగానికి లేకున్నా, హైదరాబాద్ నగరంలో స్థిరపడిన వ్యాపారస్తులు, పారిశ్రామిక వేత్తలు తమ స్వంత వ్యాపారాల కొరకు సీమాంధ్ర ప్రజలను భయ పెడుతున్నారు. తెలంగాణ ఏర్పడితే సామాన్య ప్రజలకు కూడ ఇబ్బంది

ఏర్పడుతుందని అభూత కల్పనలు సృష్టిస్తున్నారు. మహారాష్ట్ర, కర్ణాటకలలో పుట్టిన జీవనదులయిన గోదావరి, కృష్ణా ఆ రాష్ట్రాలు దాటి ఆంధ్రప్రదేశ్‌కు రావడం లేదా? రేపు తెలంగాణ ఏర్పడితే కూడా మూడు రాష్ట్రాల గుండా ప్రవహించి సీమాంధ్రకు నీళ్లు చేరుకుంటాయి. సీమాంధ్రకు దక్కాల్సిన వాటా కచ్చితంగా అధికార యంత్రాంగం కేటాయిస్తుంది. రాష్ట్రాల ఏర్పాటు ప్రక్రియలో ఇదొక భాగం మాత్రమే.

మహారాష్ట్ర నుండి గుజరాత్ విడిపోయినప్పుడు ముంబై (నాడు బొంబాయి)లో ఉన్న గుజరాత్ వ్యాపారస్తులు, పారిశ్రామికవేత్తలందరు గుజరాత్‌కు పోయారా? ముంబైలో స్వేచ్ఛగా వ్యాపారం, పరిశ్రమలను అభివృద్ధి చేసుకుంటూనే ఉన్నారు కదా. ఇక్కడేందుకు సీమాంధ్ర వ్యాపారస్తులకు భయమేస్తుంది? వీరి భయానికి కారణమేమిటంటే సమైక్యాంధ్ర రాష్ట్రంలో ప్రభుత్వంలో భాగస్వామ్యమై అన్ని రకాల వనరులను తమకు దక్కించుకునే అవకాశం పోతుందననేదే. వీరి ప్రయోజనానికి తెలంగాణ నాలుగు కోట్ల ప్రజల రాజ్యాంగ బద్ధమైన ప్రజాస్వామిక హక్కును కాలరాస్తామంటే ఎలా?

వాస్తవంగా సీమాంధ్ర ప్రజలు సమైక్యాంధ్ర కోరుకుంటున్నారా? వ్యాపారులు, పరిశ్రామిధిపతులుగా స్థిరపడిన రాజకీయ నాయకులు, ప్రజా ప్రతినిధులు కోరుకుంటున్నారా అనే విషయం స్పష్టంగా పరిశీలిస్తే కేవలం వ్యాపారులు, పారిశ్రామికాధిపతులు మాత్రమే సమైక్యాంధ్రను కోరుకుంటున్నారనేది వాస్తవమని తేలిపోయింది. సమైక్యంగా ఉంటేనే సీమాంధ్ర అభివృద్ధి చెందుతుందనడానికి నిర్దిష్టంగా ఒక హేతు బద్ధమయిన, శాస్త్రీయమైన కారణాలు వీరు చూపడం లేదు. అలాగే హైదరాబాద్‌లోని తమ అక్రమ వ్యాపారాలకు ఎక్కడ గండి పడుతుందో, తెలంగాణ ప్రాంత వనరులయిన బొగ్గు, విద్యుత్, భూమి లాంటి వనరులు తమకు దక్కడం ఎక్కడాగుతుందోననే భయంతోనే తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు చేయడం వలన సీమాంధ్ర ప్రజలకు అన్యాయం జరుగుతుందని గోబెల్ ప్రచారం చేస్తున్నారు. తెలంగాణ, సీమాంధ్ర ప్రజల మధ్య విద్వేషాలు రెచ్చగొడుతున్నారు. వారి వనరుల దోపిడీని కోల్పోతామనే సమస్యను సీమాంధ్ర ప్రజానీకానికి అంటగట్టుతున్నారు.

వాస్తవంగా సీమాంధ్ర ప్రాంతంలోని అపారమయిన గ్యాస్ నిక్షేపాలు, ఇప్పటికే ప్రాజెక్టుల ద్వారా, కాల్వల ద్వార పెరిగిన భూగర్భ జలాలు, ప్రతి సంవత్సరం అందుతున్న నీటి ద్వారా పంటల ఉత్పత్తి అమోఘంగా ఉంది. ఇప్పటికే కోస్తాంధ్ర వ్యవసాయ ఉత్పత్తులలో రాష్ట్రంలో అగ్రభాగాన నిలుస్తున్నది. ఈ విషయం నివేదికలు కూడా రుజువు చేస్తున్నాయి. రాజధాని నగరంగా ఆంధ్రలోని ఏ నగరాన్ని పెట్టుకున్నా అనతి కాలంలోనే అభివృద్ధి చెందుతుంది. రాజ్యాంగ బద్ధమయిన రాష్ట్ర ఏర్పాటును కోరుతున్న ప్రజలను తమ స్వప్రయోజనం కొరకు విచ్ఛిన్నకారులని ముద్రవేయ ప్రయత్నిస్తున్న వారిని సీమాంధ్ర విద్యార్థులు, మేధావులు, అశేష ప్రజానీకం ప్రశ్నించాల్సిన అవసరం ఉంది. రెండు ప్రాంతాల ప్రజల న్యాయమైన సమస్యల పరిష్కారం జరగాల్సి ఉన్న ఈ తరుణంలో ఇటువంటి విద్వేషాలు సమాజాభివృద్ధికి దోహద పడకపోగా, తెలంగాణ ప్రజలలో మరింత ఉద్వేగాలు రెచ్చగొట్టినట్టే అవుతుందనేది సీమాంధ్ర మంత్రులు, ఎం.పి.లు, ఎం.ఎల్.ఎ.లు గ్రహించాలి.

*(రచయిత హైకోర్టు న్యాయవాది)* వీ

*ప్రపంచ వ్యాప్తంగా ప్రభుత్వాలను అధికారంలో ఉంచాలన్నా, దించాలన్నా ఇప్పుడు గనుల మాఫియా కనుసైగలతోనే జరుగుతోందని అంటున్నారు* **ఇ.ఎస్. బ్రహ్మచారి**

# గనులను జాతీయం చేస్తే ?

ఇనుప ఖనిజం, గ్రానైట్ గనులతోపాటు ఇసుక తవ్వకాన్నీ జాతీయం చేస్తే రాష్ట్రానికి ఉన్న రు.18,300 కోట్ల బకాయిలను 15 రోజుల్లో చెల్లించవచ్చు.రాష్ట్ర ప్రభుత్వం ఒక్క హెలికాప్టర్ కొనాలంటే నిధుల సమీకరణ కోసం ఏడాదిపాటు తర్జన భర్జన పడాల్సి వస్తోంది. ఒక్కో గని యజమాని వద్ద 3 హెలికాప్టర్లు ఉన్నాయి.

– ఆదాల ప్రభాకరరెడ్డి

గనులను జాతీయం చేస్తే ప్రజలకు రెండుపూటలా నేరుగా క్యారియర్లే ఇంటికి పంపొచ్చు – జె.సి.దివాకరరెడ్డి

మే 24 ఉదయం సి.ఎల్.పి కార్యాలయంలో ఈ ఇద్దరు మాజీ మంత్రులు చేసిన వ్యాఖ్యలివి. ఆ మర్రోజు 25న ఆంధ్రజ్యోతి ఈ వార్త ప్రచురించింది. ఎందుకు చెప్పారోగాని పాలకులకి చికాకూ చిక్కూ కలిగించేదే. వీళ్లు చెప్పింది మనరాష్ట్రం గురించే.

మైనింగ్ కోసం అటవీ ప్రాంతాల్ని ఎక్కువగా ఇచ్చిన రాష్ట్రం ఛత్తీస్‌ఘడ్ అయితే ఆంధ్రప్రదేశ్‌ది రెండోస్థానం. వ్యవసాయేతర కార్యాలకు 5 లక్షల హెక్టార్ల వ్యవసాయ భూముల్ని మళ్లించింది. అలాగని కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ చెప్పింది. బాక్సైట్ తవ్వకాలను విశాఖ మన్యంలో జిందాల్ కంపెనీకి, విశాఖ ఏజెన్సీలో రస్ అల్ ఖైమా సంస్థకి ప్రభుత్వం అప్పగించింది.

అనిల్ కుమార్‌కు ఖమ్మం జిల్లాలో ఏకంగా 1 లక్ష 37 వేల ఎకరాల భూమిని ప్రభుత్వం సంతర్పణ చేసింది. 13 లక్షల కోట్ల రూపాయల విలువచేసే ఖనిజం లభిస్తుందని అంచనా. రెండోకంటికి తెలియకుండా ఫైళ్లు నడిపి చట్టాలని తుంగలోతొక్కి ఆగమేఘాల మీద అప్పగించింది ప్రభుత్వం. ఇది దేశంలోకెల్లా అతి పెద్ద కుంభకోణం. టాటాలు, బిర్లాలు వంటి వారికి కూడా ఇంత విస్తీర్ణంలో ఖనిజ నిక్షేపాలు లేవు.

ఓబుళాపురంలో జనార్ధనరెడ్డికి ఇచ్చిన గనుల విస్తీర్ణం 235 ఎకరాలు. బయ్యారం సంతర్పణ దీనికి ఇంచుమించు 600 రెట్లు. ప్రభుత్వం అడ్డగోలుగా వ్యవహరిస్తోంది. దొడ్డిదారిన ధారాదత్తం చేసి రాచమార్గం ఏర్పరిచే కృషి చేస్తున్నది. అయిదారేళ్ల నుంచి రోజూ 100 లారీలకి పైగా ఖనిజాన్ని తరలించుకు పోతున్నారు. అక్కడ 62 శాతం ఇనుము ఉందని ఎ.పి.ఎం.డి.సి చెప్పింది. అక్కడున్నది ఓబుళాపురం కంటే నాణ్యమయిన ఖనిజం.

ఇక ఓబుళాపురం మైనింగ్ కంపెనీ గురించి జరుగుతున్న గలాభా అంతా ఇంతా కాదు. దానికి అధిపతులు గాలి సోదరులు. గాలి జనార్ధనరెడ్డి కర్ణాటక టూరిజం మంత్రి. ఆయన అన్న కరుణాకరరెడ్డి రెవిన్యూ మంత్రి. వీళ్ల తమ్ముడు అసెంబ్లీ సభ్యుడు. కర్ణాటక పాల సొసైటీకి అధ్యక్షుడు. ఇంకేం కావలి. ఏమైనా చెయ్యడానికి వెనకాడలేదు.

కర్ణాటకలో 2009–10లో 71 లక్షల టన్నుల ఇనుము అక్రమంగా ఎగుమతైందని జూలై 9న ముఖ్యమంత్రి అసెంబ్లీలో చెప్పారు. బి.జె.పి. అధికారంలోకొచ్చిన మొదటి సంవత్సరం 2008–09లో 33 లక్షల టన్నులు, 2003–04 లో 20 లక్షల టన్నులూ, 2004–05లో 52 లక్షల టన్నులూ, 2005–06 లో21 లక్షల టన్నులూ, 2006–07లో 47 లక్షల టన్నులూ, 2007–08 లో 57 లక్షల టన్నులూ అక్రమంగా తరలిపోయాయి.

ఓబుళాపురం మైనింగ్ కంపెనీ కర్ణాటక – ఆంధ్రప్రదేశ్ సరిహద్దు గుర్తుల్ని చెరిపివేసింది. అక్రమ తవ్వకం ఇటువైపా అటువైపా అనేది తేల్చడం కష్టమయ్యేట్లు చేసింది. గాలి కంపెనీ సరిహద్దుల్ని మార్చి వేసిందని 2008లో లోకాయుక్త నివేదిక తేల్చింది. జనార్ధనరెడ్డి తాను తవ్వుకుంటున్నది ఆంధ్రప్రదేశ్‌లోనేననీ, కర్ణాటకలో కాదనీ చెప్పాడు. మైనింగ్ మాఫియాపై ప్రభుత్వం చర్య తీసుకోవడం లేదని ఆ రాష్ట్ర లోకాయుక్త సంతోష్ హెగ్డే రాజీనామా చేసి తర్వాత సర్దుకున్నాడు. సుప్రీంకోర్టు ఆదేశం మేరకు సర్వే ఆఫ్ ఇండియా సంస్థ హద్దులు తేల్చే పనిలో ఉంది.

యడ్యూరప్ప వాళ్లకి కళ్లెమేసే స్థితిలో లేడు. ఆయన ఆర్.ఎస్.ఎస్ లో15 ఏళ్లు పనిచేశాడు. జనసంఘ్, బి.జె.పి పార్టీలలో 38 ఏళ్లు గడిపాడు. పార్టీ అధిష్ఠానం అదంతా పక్కన బెట్టింది. మైనింగ్ మాగ్నెట్స్‌కే వంత పాడింది. అక్కడ వాళ్లకున్న పట్టు అది. పార్టీలో ఎంతకాలం ఉన్నా పోయిన సంవత్సరం టి.వి ముందూ, కిందటి నెలలో ఒక బహిరంగ సభలో ఏడవటం తప్ప ఏమీ చెయ్యలేకపోయాడు. రెండోసారి సుష్మా స్వరాజ్ సమక్షంలో (ఆమెని గాలి సోదరులు అమ్మ అంటారు) యడ్యూరప్ప తలవంచాడు. లారీకి 1000 రూపాయల రుసుం చెల్లించ మనగానే గాలి సోదరులు తిరగబడ్డారు. ముఖ్యమంత్రికి ఎసరుపెట్టారు. ముఖ్యమంత్రిని ఏడ్చేట్లు ఒత్తిడి పెట్టారు. యడ్యూరప్పని దారికి తెచ్చుకున్నారు. సిబిఐ చేత దర్యాప్తు జరిపించాలని కర్ణాటక అసెంబ్లీలో చేసిన డిమాండ్‌ను యడ్యూరప్ప తిరస్కరించాడు. ఇప్పుడేమో అక్రమాలు జరిగిన ఆనవాళ్లే లేవని కితాబిచ్చాడు. సాక్ష్యాలుంటే ప్రతిపక్షాలు కోర్టుకు పోవచ్చన్నాడు. గాలి సోదరులు 27 లక్షల టన్నుల ఇనుపఖనిజాన్ని కొల్లగొట్టారని ఒక ఎన్.జి.ఒ సంస్థ లెక్కగట్టింది. కర్ణాటక నుంచి 35 లక్షల టన్నుల ఇనుప ఖనిజం అక్రమంగా ఎగుమతి అయిందని అసెంబ్లీలో చెప్పిన యడ్యూరప్ప, అదే నోటితో అసలు అక్రమ తవ్వకాలు జరిగిన దాఖలాలే లేవు పొమ్మన్నాడు. దీన్నిబట్టి ఆనాడాయన కార్చిన కన్నీళ్లు మొసలి కన్నీళ్లని తేటతెల్లమయింది. ఆయన మైనింగ్ ముఠాల చేతిలో కీలుబొమ్మ అనుకుంటే

పొరపాటే. భాగస్వామి అనటం సరైనదేమో. కంపెనీల యజమానులూ, పాలకులూ తోడుదొంగలని జనం నమ్ముతున్నారు. గడచిన పదేళ్లలో మూడు కోట్ల టన్నుల ఇనుప ఖనిజం ఎల్లలు దాటించారన్న ముఖ్యమంత్రి, విచారణకు ససేమిరా అన్నాడు. ఇంకేం, తాను 24 కారెట్ల బంగారాన్నని విలేకరులకు చెప్పాడు జనార్దనరెడ్డి. అలా కర్ణాటక ప్రభుత్వాన్ని గుప్పెట్లోకి తెచ్చుకున్నారు. వాళ్లకి బి.జె.పి. సాగిలపడక తప్పలేదు. గవర్నర్‌ని ధిక్కరించారు. రాజ్యాంగేతర శక్తిగా తయారయ్యారు. ఆంధ్రప్రదేశ్‌లో తన వ్యాపార భాగస్తుణ్ణి గద్దెనెక్కించేందుకు కృషి చేస్తున్నాడు. అక్కడ బి.జె.పి. ఇక్కడ కాంగ్రెస్ లో ఒక ముఠా. ఇదీ వరస. ప్రజల బాగోగులు గాలికి. ఆదాయం 'గాలి'కి.

మన దేశంలో అపార ఖనిజ సంపద ఉంది. 89 ఖనిజాల్ని వెలికి తీస్తుంది. 2000-2001లో వెలికి తీసిన ఖనిజాల విలువ 56,807 కోట్ల రూపాయలు. 1991లో మన్మోహన్ చేపట్టిన ఆర్థిక సంస్కరణలూ, 1993లో రూపొందించిన జాతీయ గనుల విధానమూ ప్రైవేట్ కంపెనీలకి బాగా ఉపయోగపడ్డాయి. ఇండియాలో 3100 గనులలో ఖనిజాలు వెలికి తీస్తున్నారు. ఇదంతా ప్రజల పరం అయితే దేశం సుభిక్షమవుతుంది నిజమే. కాని దాన్నంతా ప్రైవేట్ సంస్థలకు కట్టబెట్టేందుకు కంకణం కట్టుకున్నారు ప్రధాని మన్మోహన్ సింగ్, చిదంబరం. ఒడిషాలోని బాక్సైట్ నిక్షేపాల విలువ 4 లక్షల కోట్ల డాలర్లని మించి ఉంటుంది. మన స్థూల జాతీయోత్పత్తి 2009లో 1 లక్షా 24 వేల కోట్ల డాలర్లు. అంటే అక్కడి బాక్సైట్ విలువ మన జి.డి.పి కి మూడింతలకి మించిపోయింది. అక్కడ సున్నపురాయి, బాక్సైటు, తగరం, అభ్రకం, కింబర్‌లైట్-హీరా డోలమైట్, ఇనుము, బొగ్గు గనులు ఉన్నాయి.

ఈ సహజ వనరులను కేంద్ర ప్రభుత్వం ఇప్పటికే బహుళజాతి సంస్థలకు విక్రయించింది. ఖనిజాలని వెలికితీసే ప్రయత్నం చెయ్యని గనులు ఎన్నో ఉన్నాయి. బ్రిటిష్ పాలకులు బలంతో దేశ ఖనిజాల్ని ఎత్తుకుపోయారు. ఇప్పుడు వివిధ దేశాల కంపెనీలకి మన పాలకులే అమ్మి, కాదన్న వాళ్లని బలంతో నెట్టివేసి అన్ని గనుల్నీ బహుళజాతి కంపెనీలకి అప్పజెప్పే కార్యక్రమం చేపట్టారు.

ఆరావళీ పర్వత ప్రాంతంలో అక్రమ తవ్వకాలు జరుగుతున్నాయనీ వాటిని నిరోధించాలనీ రాజస్థాన్ ముఖ్యమంత్రి గెహ్లాట్ అధికారుల్ని కోరాడు. రాష్ట్ర మైనింగ్ రెవిన్యూ 1500 కోట్ల రూపాయలు. అందులో 700 కోట్లు ఆరావళీ పర్వత శ్రేణుల్లో ఉన్న 15 జిల్లాల నుంచే వస్తుంది. అధికారులు నిక్కచ్చిగా పనిచేయాలని ఆదేశించారు సరే, మంత్రులు, ఎం.ఎల్.ఎ.లు గదా అసలు వాళ్లు. ఎక్కువ లబ్ది పొందేవాళ్లు. వాళ్ల సంగతేమిటి?

బెంగాల్‌లో ప్రైవేట్ పెట్టుబడికి భూములు కట్టబెట్టబోయి మార్క్సిస్టులు ప్రజలకి దూరమయ్యారు.

ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వం 2005లో 70 కోట్ల రూపాయల ఒప్పందాలు చేసుకొంది. మైనింగ్ పేరుతో అటవీ భూములు భారీగా కబ్జా అవుతున్నాయని పి. జోషి నివేదిక (2009) లో ఉంది. ఆయన అప్పటి ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వంలో గ్రామీణాభివృద్ధి శాఖ కార్యదర్శి.

ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్ రాష్ట్రాలలో లక్షల టన్నుల ఇనుప ఖనిజం ఉంది. మరో 28 రకాల ఖనిజాలున్నాయి. రాగి, పాలరాయి, గ్రానైట్, సిలికా, బొగ్గు, డోలమైట్ లాంటివి. వీటికి సంబంధించి ఎన్నో అవగాహన ఒప్పందాలు జరిగాయి. జార్ఖండ్‌లోనే వాటి సంఖ్య 90. కొండలూ, నదులూ, అడవులూ - అన్నిటిమీదా ఒప్పందాలు ఎప్పుడో అయిపోయాయి.

ఐ.ఎ.ఎన్.ఎస్. రిపోర్ట్ ప్రకారం జార్ఖండ్‌లో రోజుకి 106 కోట్ల రూపాయల విలువ చేసే 7515 టన్నుల బొగ్గు అక్రమ తవ్వకం జరుగుతోంది. ఆ రాష్ట్రం ఆమేరకు భారీగా నష్టపోతోంది. జార్ఖండ్ ముఖ్యమంత్రిగా ఉన్న మధుకోడా ఒకప్పుడు గని కార్మికుడు. తర్వాత గనులు లీజుకి పొందాడు. ఆ శాఖని గుప్పెట్లో పెట్టుకొని వేలకోట్లు దండుకున్న విషయం తెలిసిందే.

గోవాలో రాజకీయ నాయకులు అక్రమ తవ్వకాలకి అండదండగా ఉన్నారని స్పీకర్ ప్రతాప్ సింగ్ రాణే చెప్పాడు. ప్రజలనీ, ప్రభుత్వాన్నీ మోసగిస్తున్నారన్నాడు. గనుల శాఖ ముఖ్యమంత్రి చేతుల్లో పెట్టుకొని కుమ్మక్కై కొల్లగొడుతున్నారని ప్రతిపక్షాలు గోల చేస్తున్నాయి. ఇందువల్ల ఆ చిన్న రాష్ట్రం ఏటా రు. 250 కోట్లు నష్టపోతున్నదని అంచనా.

బొగ్గు మాఫియా ముఠాలు ఏటా 1800 కోట్ల రూపాయల విలువ చేసే 60 లక్షల టన్నుల బొగ్గు దోచుకుంటున్నాయని కేంద్ర బొగ్గుశాఖ తేల్చింది. అక్రమ మైనింగ్‌ను నిరోధించేందుకు కమిటీలని పెట్టాలని ఆయా రాష్ట్రాలకు చెప్పింది. ఒడిషా, జార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రాల్లో మాఫియా చర్యలు పెచ్చరిల్లుతున్నాయి. కేంద్ర బొగ్గుశాఖ మంత్రి శ్రీప్రకాష్ జైస్వాల్ ఇండియాలో 10 వేల మైనింగ్ మాఫియా గ్రూపులున్నాయని చెప్పాడు.

203 బొగ్గు బ్లాకుల్లో మైనింగ్ కార్యకలాపాల్ని పర్యావరణ మంత్రిత్వ శాఖ అభ్యంతరం వ్యక్తపరిచింది. కనక వాటిలో తవ్వకాలను నిషేధించారు. నిషేధించినందువల్ల ప్రభుత్వ ఖజానాకి నష్టం వస్తుందని ప్రధాని కార్యాలయం (పి.ఎం.ఒ.) కలగజేసుకున్నది. దాని ప్రమేయం వల్ల ఇప్పుడు వాటిలో 77 బ్లాకుల్లో అనుమతివ్వాలని కమిటీ సూచించింది. ఇదంతా ప్రైవేటు కంపెనీలకి కట్టబెట్టేందుకే.

మైనింగ్ మాఫియా కొలంబియా, ఆఫ్రికా దేశాలలో ఖనిజ సంపదను కొల్లగొట్టి దేశాలని గుల్ల చేశాయి. కంపెనీలేమో కోటాను కోట్లకు పడగలెత్తాయి. ప్రజలేమో ఆకలితో అలమటిస్తున్నారు. ఆస్ట్రేలియా ప్రధాని కెవిన్ రుడ్‌ని పదవీచ్యుతుణ్ణి చేసి ఆ స్థానంలో జూలియా గిలార్డ్‌ని కూర్చోపెట్టారు. ఆమె కార్పొరేట్ల ప్రయోజనాల్ని కాపాడేందుకు ప్రయత్నాలు ముమ్మరం చేస్తోంది. లేబర్ ప్రభుత్వం మైనింగ్ పరిశ్రమ మీద రిసోర్స్ సూపర్ ప్రాఫిట్స్ ట్యాక్స్ (ఆర్.ఎస్.పి.టి) పేరుతో 40 శాతం పన్ను ప్రతిపాదించింది. వాళ్ల డిమాండ్లు త్వరలో తీర్చకపోతే, పన్నుతోపాటు ప్రభుత్వం మీద కూడా పోరాడతామని మైనింగ్ మారాజులు జూలియాకి తుది హెచ్చరిక చేశారు. ఇప్పుడామె దాన్ని గణనీయంగా తగ్గించే కార్యక్రమంలో ఉంది. బడ్జెట్‌లోటు తగ్గించేందుకని ప్రభుత్వ వ్యయాన్ని కుదించబోతోంది. స్వేచ్ఛా వాణిజ్య సంస్కరణల్ని వేగవంతం చేయబోతోంది. కెవిన్‌ని దించడంలో మైనింగ్ కంపెనీల పాత్రే ప్రధానమైంది. మైనింగ్ టైకూన్స్ కెవిన్‌ని దించిన ఘనతలో ఎక్కువ పాలు తమదేనని చెప్పుకున్నారు. రిసోర్స్ టాక్స్ పట్ల పరిశ్రమల వ్యతిరేకతే తిరుగుబాటుకి ప్రధాన కారణమని చెప్పారని సిడ్నీ మార్నింగ్ హెరాల్డ్ పత్రిక రాసింది. రెండు నెలల పాటు ఆందోళనలు చేశారు. చెయ్యని అకృత్యాలు లేవు. మీడియాని మేపారు. సంక్షోభం వస్తుందనీ, ఉద్యోగాలు భారీ సంఖ్యలో పోతాయని ప్రజల్ని భయభ్రాంతులకి గురిచేశారు.

కెవిన్ తన పార్టీలో మద్దతు కోల్పోయాడు. 24 జూన్‌న నాయకత్వం నుంచి తప్పుకోవలసి వచ్చింది. డిప్యూటీ ప్రధాని జూలియాను పీఠమెక్కించారు. ఎక్కగానే విధానాన్ని మార్చివేసింది. రాబోయే రెండేళ్లలో ఆర్.ఎస్.పి.టి. వల్ల 12000 కోట్ల డాలర్లొచ్చి ఉండేవి. కొత్త విధానంలో 4500 కోట్ల డాలర్లు మాత్రమే వస్తాయి. అంటే 7500 కోట్ల డాలర్లు

తగ్గుతాయి. ఈ మొత్తం జూలియాని గద్దెనెక్కించినందుకు కంపెనీలకు నజరానా. కొత్త పాలకులు 40 శాతం నుంచీ 22.5 శాతానికి తగ్గించారు. అది కూడా పెట్టుబడి మీద ఆదాయం 13 శాతం దాటితేనే వర్తిస్తుంది. అంతకుముందు 6 శాతం దాటితేనే చెల్లించాలి. కొత్త రేట్ల వల్ల 320 కంపెనీలు మాత్రమే ఈ పన్ను కడతాయి. కెవిన్ రడ్ విధానంలో 2500 కంపెనీలు ఈపన్ను పరిధిలోకి వచ్చి ఉండేవి.

ఆధునిక యుద్ధాల్లో అల్యూమినియం భారీస్థాయిలో ఖర్చవుతుంది. 20 శాతం ఎక్కువ సేకరించాలని అమెరికా పెంటగాన్ లక్ష్యంగా పెట్టుకుంది. ఇదంతా వెనకబడిన దేశాల నుంచి రావలసిందే. అల్యూమినియం కంపెనీ ఆఫ్ అమెరికా 40 దేశాల్లో బాక్సైట్ నుంచి దీన్ని తీస్తుంది. ఆ దేశాల జాబితాలో ఇండియా కూడా ఉంది. దీన్ని యూరప్, అమెరికాల యుద్ధ పరిశ్రమలకి పంపుతున్నారు

అఫ్ఘనిస్తాన్‌లో ఇప్పటికింకా తాకని ఖనిజ నిల్వలు 1 లక్ష కోట్ల డాలర్లు చేస్తాయని అమెరికా తెలుసుకుంది. ఇంతకుముందు అనుకున్న దానికన్నా ఇది చాలా ఎక్కువ. లిథియం బాగా దొరుకుతుంది. దీన్ని లాప్‌టాప్, బ్లాక్‌బెర్రీల బాటరీల్లో వాడతారు. ఇక్కడ దిమ్మరపోయేటంత ఖనిజం నిక్షిప్తమయి ఉంది అన్నాడొక అధికారి. ఆ దేశ జి.డి.పి రు.1200 కోట్ల డాలర్లు మాత్రమే. ఇది ఆ దేశ ఎకనామీకి వెన్నెముక అవుతుంది అని గనుల మంత్రిత్వ శాఖ సలహాదారు జలీల్ అన్నాడు. రష్యా 1980లలో అఫ్ఘనిస్తాన్‌ని ఆక్రమించినప్పుడు దీని సమాచారం సేకరించింది. విరివిగా లభించేవి ఇనుమూ, రాగీ ఘజని జిల్లాలో భారీగా ఉన్నాయి. బొలీవియాలో అన్ని దేశాలకన్నా ఎక్కువ లిథియం నిల్వలున్నాయి. బొలీవియాలో ఉన్నన్ని నిల్వలు అఫ్ఘనిస్తాన్‌లో ఉన్నాయి. ఒబామా వాటిని కొల్లగొట్టకుండా విశ్రమిస్తాడా? తమకు అప్పగించేంత వరకూ బహుళజాతి కంపెనీలు నిద్రపోనిస్తాయా?

అమెరికా, కెనడాలు మానవ హక్కుల గురించి మట్లాడుతూ వాటిని హరించడంలో ముందుంటాయి. గోల్డ్ కార్ప్ అనే కెనడా బహుళజాతి సంస్థ దె సిరియా (హోండురాస్‌లో ఒక ప్రాంతం)లో సహజ వనరుల్ని నాశనం చేసింది. మొత్తం జనాభా 42 వేలమందిలో నూటికి 80 మంది ఆరోగ్యం కోల్పోయారు. మైనింగ్ చర్యల వల్ల తాగునీటిలో ఆర్సెనిక్, సీసం, పాదరసం లాంటి లోహాలు కలిసి కలుషితమైపోయాయి. కార్పొరేట్లకి అనుకూలంగా నిర్ణయాలు తీసుకునేందుకు అధికారులకీ, నాయకులకీ లంచాలు ఇస్తున్నారు. హోండురాస్‌లో 2009లో జరిగిన సైనిక తిరుగుబాటు వెనక కెనడా పెట్టుబడి ఉంది. గనుల సంస్థల పాత్ర పెద్దదని వేరే చెప్పక్కర్లేదు.

కొలంబియా వెలికితీత పరిశ్రమల్లో ఉన్న బహుళజాతి పెట్టుబడి ఆ దేశంలో అంతర్యుద్ధాన్ని స్థిరపరుస్తోంది. పౌరుల మీద మిలిటరీ బీభత్సాన్నీ ఉధృతం చేస్తోంది. 1990 దశకంలో నయా ఉదారవాద పునర్వ్యవస్థీకరణ నేపథ్యంలో ఈ ప్రక్రియ జరుగుతోంది. సంపద కేంద్రీకరణ ముమ్మరమయింది. రైతులు పొలాలు వదిలి పారిపోవలసి వస్తోంది. 21వ శతాబ్దంలో కొలంబియా పెట్టుబడిదారీ విధానాన్ని అర్థం చేసుకోడానికి మార్క్స్ చెప్పిన ఆదిమ సంచయనం అనే భావన తగిన పరికరం. కొలంబియాలో ఈ పదేళ్లలో దాదాపు 30 లక్షలమంది నిర్వాసితులయినారు. వీళ్లలో 20 లక్షలమంది గనుల ప్రాంతాల నుంచి గెంటబడ్డ వారే. అక్కడి హింస ఊహకందదు. వ్యతిరేకంగా పనిచేసిన వాళ్లని చాలామందిని బెదిరించారు. చంపివేశారు. మానవ హక్కుల్ని ఉల్లంఘించి ప్రవర్తించారు. పేదరికాన్ని పెద్ద స్థాయికి పెంచారు.

బయ్యారం వ్యవహారం మీద విచారణ అవసరం లేదని ప్రభుత్వం తేల్చి చెప్పింది. ఓబుళాపురం అక్రమ మైనింగ్ గురించి సి.బి.ఐ విచారణకు యడ్యూరప్ప ససేమిరా ఒప్పుకోవడంలేదు. పాలకులు కంపెనీలని ఎలా కంటికి రెప్పలా కాపాడుతున్నారో బయట పడుతున్నది.

కర్ణాటకలో గాలి సోదరులకి రక్షణకల్పిస్తూ, ఖమ్మంలో రక్షణ స్టీల్స్‌ని తప్పుపట్టడం – ఇంతకన్న నీతిమాలిన పని ఉంటుందా! ఒడిషాలో అక్రమ మైనింగ్ మీద రాహుల్ గాంధీ తీవ్రంగా మాట్లాడాడు. ఆ ప్రభుత్వం పర్యావరణ నిబంధనల్ని పాటించడం లేదని విమర్శించాడు. అక్కడ కాంగ్రెస్ పార్టీ ప్రతిపక్షం కనక అధికార బి.జె.పి ముఖ్యమంత్రిని రాజీనామా చెయ్యమంటున్నది. కాని రక్షణ స్టీల్స్ విషయంలో యాజమాన్యం కొమ్ముకాస్తోంది. సొంత పార్టీ వాళ్లయితే ఓకె. ఇతర పార్టీల వాళ్లయితే తప్పు. అధికార, ప్రతిపక్ష పార్టీలన్నీ ఒకేరకమైన ఎత్తుగడలతో ముందుకుపోతున్నాయి. అంతమాత్రాన నాయకుల్ని కంపెనీల చేతుల్లో కీలుబొమ్మలు అనటం కుదరదు. భాగస్వాములనవచ్చు. వాళ్లూ వీళ్లూ తోడు దొంగలనవచ్చు. ఈ సత్యం ఇవ్వాళ అందరికీ తెలిసిపోయింది. జనం వీళ్లని నమ్మడం లేదు. అందుకే ధరల పెరుగుదలకి వ్యతిరేకంగా ఉద్యమమన్నా నమ్మి వీళ్ల వెంట స్వచ్ఛందంగా వచ్చే జనం కరువయ్యారు.

అటవీ ప్రాంతాల్లో నివసించే 9 కోట్లమంది గిరిజనుల్లో 1991కి ముందే గనుల తవ్వకాల వల్ల రెండున్నర కోట్లమంది బయటకు పోవలసి వచ్చింది. ఇప్పుడు చాలామందికి అదే పని చేయక తప్పడం లేదు.

2004లో ఆర్థిక మంత్రిగా ప్రమాణం చేసే దాకా 'వేదాంత' సంస్థకు నాన్ ఎక్జిక్యూటివ్ డైరెక్టర్ గా ఉన్న చిదంబరం, మంత్రి అయిన వెంటనే ఆ కంపెనీకి అనుకూలంగా సంతకాలు పెట్టిన చిదంబరం, హోం పగ్గాలు పట్టాక ఏమి చేసైనా గనులు అప్పగించాలని పట్టుదలతో ఉన్న చిదంబరం అనుసరిస్తున్న విధానాన్ని మన మాజీ మంత్రివర్యులు ఇదేమాదిరి విమర్శిస్తారా? అక్కడి ఆదివాసులను బయటకు పంపించేందుకు ఆయన చేస్తున్న ప్రయత్నాలను ఆపమని అనగలరా?

అప్పట్లో ఫ్యాక్టరీల్లో పనిచేసేందుకు కూలీల కొరత బాగా ఉంది. కనక పొలాలు కోల్పోయిన వాళ్లకీ, వృత్తులు పోయిన వాళ్లకీ కూలిపనులు దొరికాయి. ఇవ్వాళ ఆ పరిస్థితి లేదు. ఎక్కడ చూసినా నిరుద్యోగులే. వీళ్లకి పనులు దొరకడం కష్టం. అందరికీ అయితే దొరికే ప్రశ్నే లేదు. పేదరికంలో కూరుకుపోవలసిందే. అభివృద్ధి లాబీ అబద్ధాలు చెబుతుంది. మైనింగ్‌వల్ల ఎన్నో ఉద్యోగాలొస్తాయని చెబుతారు. అంతా ఉత్తదే. చాలాకొద్ది మందికే వస్తాయి. అవికూడా కీతా జీతాల వాచ్‌మన్ పనుల లాంటివే. దేశ ఆదాయం పెరుగుతుందంటారు. నిజానికి ప్రభుత్వానికి 10 శాతం అయినా దక్కదు. భారీ భాగం యజమానులకే పోతుంది.

చంద్రుడి మీద హీలియం–3 లభిస్తుంది. ఇది భూమిలో దాదాపు దొరకదు. ఇది ఫ్యూజన్ రియాక్టర్లకి మంచి ఇంధనం. 2007 తర్వాత చంద్ర మండలం వైపు పయనంలో పోటీ పడుతున్న దేశాలు పెరిగాయి. ఫ్యూజన్ ద్వారా విద్యుదుత్పత్తి చేసే కేంద్రాలు ప్రస్తుతం డ్యుటీరియం, ట్రిటియం వలయాన్ని అభివృద్ధి చేస్తున్నాయి. ఈ ప్రయత్నంలో కొన్ని సమస్యలున్నాయి. హీలియం–3 వాడితే సమస్యలుండవని శాస్త్రవేత్తల అభిప్రాయం. అందుకని చంద్ర మండలాన్ని ఆక్రమించి గనులు స్వాధీనం చేసుకోవాలని ఆరాట పడుతున్నారు. అందుకోసం పోటీ పెరుగుతున్నది.

చంద్ర మండలంలో గనులు లభిస్తే లాభించేది మైనింగ్ మాఫియాలు, అధికార పార్టీల నాయకులు. దేశాలకు ఆదాయం రానివ్వరు. అంతేకాదు, అక్కడ జరగబోయేదీ అక్రమ మైనింగే.

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)*

*ఇజ్రాయిల్ - పాలస్తీనా దేశాల మధ్య నిత్యం జరుగుతున్న ఘర్షణ వల్ల ఎంతో మంది పాలస్తీనీయులు ఎదుర్కొంటున్న తీవ్ర నిర్బంధాన్ని వివరిస్తున్నారు* **కె. నరేంద్రమోహన్**

# పాలస్తీనా పోరాటం పూర్వాపరాలు

ఏప్రిల్ సంచికలో నేను పాలస్తీనా పోరాట చారిత్రక నేపథ్యం గురించి క్లుప్తంగా పరిచయం చేశాను. చదువరుల సూచన మేరకు సమకాలీన పరిస్థితి గురించి రాసే ప్రయత్నం చేస్తున్నాను. పత్రికా వ్యాసంలో ఉండే నిడివి సమస్య వల్ల క్లుప్తంగా రాస్తున్నాను.

1948లో ఇజ్రాయిల్‌ను ఏకపక్షంగా ప్రకటించిన తరువాతి చరిత్ర క్రమం ప్రధానంగా విస్తరణ, యుద్ధం, అణచివేత, మొదట బ్రిటిష్ సామ్రాజ్యానికి తదుపరి అమెరికాకు ప్రాంతీయ ప్రాతినిధ్యం, రక్షణ పేరుతో వీటికి వ్యతిరేకంగా పోరాటాలు, పరిష్కారానికి బదులు అమెరికా పర్యవేక్షణలో కొండవీటి చాంతాడులాంటి ఎడతెగని శాంతి ప్రక్రియ, అదే క్రమంలో పాలస్తీనా విమోచన సంస్థ (పి.ఎల్.ఒ.) నాయకుల లొంగుబాటు, ఏ దేశ పౌరసత్వం లేని లక్షలాది శరణార్థులు, పాలస్తీనా ప్రజల ఇళ్లు, పొలాలు, తోటలు కూల్చివేస్తూ విస్తరిస్తున్న యూదు కాలనీలు, వాటి వెనుక వందల కిలోమీటర్ల మేరకు ఇజ్రాయిల్ కడుతున్న గోడ, సమస్యను స్వప్రయోజనాల కోసం వాడుకున్న పొరుగు దేశాల అరబ్ నియంతలు, వెరసి రావణ కాష్టంలా రగులుతున్న సమస్య–సారాంశంలో ఇదీ పాలస్తీనా పరిస్థితి.

వివరాలలోకి వెళ్లేముందు కొన్ని సైద్ధాంతిక విషయాలు తెలుసుకోవాలి. జియోనిజానికి 19వ, 20వ శతాబ్దాలలోని వలసవాద/సామ్రాజ్యవాదులకు ఒక ముఖ్యమైన తేడా గమనించాలి. ఆసియా, ఆఫ్రికాలో కొనసాగిన యూరోప్ దేశాల పాలనలో స్థానిక ప్రజల పనిని, వనరులను దోచుకోవడం జరిగితే, జియోనిస్ట్ లక్ష్యం వారిని దోచుకోవడమే కాకుండా, వారిని పారదోలి వారి స్థానంలో యూదు సమాజాన్ని స్థాపించడం. ఇందుకు బైబిల్ పాత నిబంధనలోని అబ్రహం కథ నుండి కల్పిత చరిత్ర దాక అన్ని రకాల అబద్ధపు ప్రచారాల్ని ఇప్పటికీ వాడుతున్నారు. ఈ తప్పుడు కథల ప్రచారానికి కోట్లాది డాలర్ల బడ్జెట్లతో నడిచే ఐపాక్ (అమెరికన్ ఇజ్రాయిల్ పబ్లిక్ అఫేర్స్ కమిటీ–ఎ.ఐ.పి.ఎ.సి.), ఐజాక్ (ఆస్ట్రేలియా ఇజ్రాయిల్ అండ్ జ్యూయిష్ అఫేర్స్ కౌన్సిల్–ఎ.ఐ.జె.ఎ.సి.) వంటి దాదాపు 20 సంస్థలు ప్రధానంగా అమెరికాలో పనిచేస్తున్నాయి.

**వీటిలో ముఖ్యమైన కట్టుకథలు :** దేశం లేని ప్రజలకు ప్రజలు లేని దేశం; నిరంతరం ఉనికి కోసం పోరాడుతున్న ఇజ్రాయిల్; పశ్చిమ ఆసియాలోని ఏకైక సంపూర్ణ ప్రజాస్వామ్యం; హిట్లర్ యూదు సంహారానికి పరిహారం; యూదు రక్తపిపాసతో రగులుతున్న అరబ్, ముస్లిం మతోన్మాదులు. పాలస్తీనా నిర్జన ప్రదేశం అని వాదించడానికి చారిత్రక పత్రాలను తిరగరాసారు. దీనిలో బాగా ప్రచారంలోకి వచ్చిన వక్రీకరణ జోన్ పీటర్స్ రాసిన 'ఫ్రం టైం ఇంమెమోరియల్' అనే రచన. ప్రముఖ యూదు పరిశోధకుడు నార్మన్ ఫిన్కెల్‌స్టైన్ – ఇతని తల్లిదండ్రులు ఇద్దరూ హిట్లర్ క్యాంపులలో బందీలుగా ఉన్నవారే– ఈ రచనలో చూపించిన ఆధారాలన్నీ తప్పుడువేనని నిరూపించాడు.

కానీ అంతరంగిక చర్చలలో ఇజ్రాయిల్ నాయకులు ఎటువంటి తటపటాయింపు లేకుండానే మాట్లాడారు. 'మనలో మనం స్పష్టంగా గుర్తించవలసింది ఏమిటంటే రెండురకాల ప్రజలకు ఈ దేశంలో స్థానం లేదు. ఈ చిన్న దేశంలో అరబ్బులు ఉంటే మనం మన లక్ష్యాన్ని సాధించలేం. అరబ్బులను పక్క దేశాలకు తరలించడం మినహా మరో మార్గం లేదు. ఒక్క గ్రామం, ఒక్క తెగ కూడా ఇక్కడ ఉండడానికి వీలు లేదు.' (జోసెఫ్ వేయిట్జ్, జూయిష్ ఏజన్సీ వలసీకరణ డిపార్ట్‌మెంట్ అధిపతి – ఎ సోల్యూషన్ టు ది రెఫ్యూజీ ప్రాబ్లమ్, దవర్, సెప్టెంబర్ 29, 1967).

ఇజ్రాయిల్ సైన్యాధిపతి, తదుపరి రక్షణ మంత్రి మోషే దయాన్ మాటల్లో చెప్పాలంటే 'మనం అరబ్బులతో నిండి ఉన్న దేశానికి వచ్చి యూదు హిబ్రూ రాజ్యాన్ని నిర్మిస్తున్నాం. అరబ్బు గ్రామాల స్థానంలో యూదు గ్రామాలూ నిర్మించబడ్డాయి. మహలుల్ స్థానంలో నహల్, జిబ్ట స్థానంలో గీవాట్, హనిఫాస్ స్థానంలో సారిద్, టేల్ షంమం స్థానంలో కఫర్ యేషువా. అరబ్బు గ్రామాల స్థానంలో నిర్మించబడని ఊరు ఒక్కటి కూడా లేదు.' (మోషే దయాన్, టెక్నియన్ విద్యార్థుల ముందు ప్రసంగం, మార్చ్ 19, 1969– హారెట్జ్, ఏప్రిల్ 4, 1969.)

20వ శతాబ్దం మొదట్లో పాలస్తీనాలో సుమారు వెయ్యి గ్రామాలు, జెరుసలెం, హైఫా, గాజా, నాబ్లస్, నజారెత్, వంటి సుమారు ఇరవై పట్టణాలు ఉండగా, ఇజ్రాయిల్ రాజ్య ప్రకటన (మే 14, 1948) తరువాత ఆరు నెలల కాలంలో తాను ఆక్రమించిన ప్రాంతంలో దాదాపు నాలుగు వందల గ్రామాలను నేలమట్టం చేయగా సుమారు పది లక్షల జనాభా ఉన్న పాలస్తీనా ప్రజలలో దాదాపు లక్షా ముప్పై వేల మంది మాత్రమే మిగిలారు.

సుమారు నాలుగున్నర కోట్ల ఎకరాల పంట భూములు, 53,000 ఎకరాల నారింజ తోటలు, లెక్క తెలియని ఆలివ్ తోటలు, పదివేలకు పైగా వ్యాపార సంస్థలు, జియొనిస్టుల చేతుల్లోకి పోగా, 1951 నాటికి ఇజ్రాయిల్లోని సుమారు పాతిక శాతం భవనాలు అరబ్బుల నుండి గుంజుకున్నవే. (ఐక్యరాజ్య సమితి శరణార్థుల కార్యాలయం అంచనాలు).

ఇక రక్షణ మాటకొస్తే, బ్రిటిష్ సామ్రాజ్యం ఇరాక్ సింహాసనం మీద కూర్చోబెట్టిన ఫైసల్, 1919 లోనే జియొనిస్ట్లతో శాంతి ఒప్పందం చేసుకున్నాడు. ఇజ్రాయిల్ అరబ్బుల మొదటి యుద్ధంలో, అదే బ్రిటిష్ అండతో ట్రాన్స్ జోర్డన్ (జోర్డన్) రాజుగా మారిన అబ్దుల్లా, ఇజ్రాయిల్ నాయకులతో రహస్య మంతనాలు జరిపి జెరుసలెం ప్రాంతానికి మాత్రమే

తన సైన్యాన్ని పరిమితం చేసాడు. ఆ యుద్ధంలో అరబ్బు రాజ్యాలలో శిక్షణ పొందిన సైన్యం జోర్డన్ సైన్యం ఒక్కటే.

ఇజ్రాయిల్ సైన్యం, ఇర్గున్, లెహి సంస్థలు సాగించిన మూకుమ్మడి హత్యాకాండలు (దేయిర్ యెసిన్, తంతురా, లిద్దాహ్ తదితర), గ్రామాల్లో ప్రముఖుల హత్యలతో భయానక వాతావరణంలో చెల్లా చెదరైన పాలస్తీనా ప్రజలు జోర్డన్, ఈజిప్ట్‌ల ఆధీనంలో ఉన్న గాజా, జెరుసలెం (వెస్ట్‌బాంక్) ప్రాంతాల్లో తలదాచుకోగా 1967లో, ఆ ప్రాంతాలను (సిరియాలోని గోలన్ హైట్స్‌తో సహా) ఇజ్రాయిల్ ఆక్రమించింది.

ఇక ఇజ్రాయిల్ లోపలి మాటకొస్తే, సామాజిక ఆర్థిక హోదాలో నాలుగు శ్రేణుల ప్రజలున్నారు – మొదటి శ్రేణి యూరప్ నుండి వచ్చిన శ్వేతజాతి యూదులు (అసఖేనజి), రెండవ శ్రేణి ఆఫ్రికా, అసియాకు చెందిన యూదులు (మిజ్రహిం), మూడో శ్రేణి ఇజ్రాయిల్‌లో మిగిలి ఉన్న అరబ్బులు అట్టడుగున కొత్తగా ఆక్రమించిన ప్రాంతాలలోని అరబ్ ప్రజలు.

ఇజ్రాయిల్ వ్యూహకర్తలు మొదటి నుండి ఎదుర్కొన్న సమస్య పాలస్తీనా ప్రజలు లేకుండా పాలస్తీనా భూమిని, నీటిని, వనరులను ఆక్రమించుకోవడం ఎలా? దీనితో ముడిపడి ఉన్న మరో ఇజ్రాయిల్ లక్షణం సైన్యానికి ఉన్న రాజకీయ బలం. అరియెల్ షరోన్ మొదటి ప్రభుత్వ కాలం నుండి దాదాపు ప్రధానమంత్రులు అందరు సైన్యాధ్యక్షులు గానో, అధికారులు గానో పనిచేసిన వారే. కాబినెట్ మంత్రులు, జెరుసలెం మేయర్ వంటి పదవులలో కూడా మాజీ సైనికాధికారులు గణనీయమైన సంఖ్యలో ఉన్నారు. కాబినెట్ సమావేశాల్లో సైన్యాధిపతులు పాల్గొనడమే గాక, రాజకీయ నిర్ణయాలు, విదేశీ విధానాలు, ఇంటెలిజెన్స్ వ్యవహారాల మీద కూడా బాహాటంగా ప్రకటనలు చేయడం మామూలే. ఇజ్రాయిల్ రాజకీయాలు, ఎత్తుగడలు ఎన్ని గిరికీలు కొట్టినా, ఈ రెండు మాత్రం స్థిరంగా ఉంటాయి.

మొదటి లక్ష్యాన్ని సాధించడానికి ఎంచుకున్న మార్గం సెటిల్‌మెంట్స్ అని పిలవబడే యూదు కాలనీలు. సైనికుల మీద రాళ్లు వేసారనో, పి.ఎల్.ఒ. సభ్యులు ఉన్నారానో, మిలిటరీ అవసరాల కోసమనో, ఏదో సాకుతో గాజా, పడమటి ఒడ్డు (జోర్డన్ నది పడమటి ఒడ్డును వెస్ట్‌బాంక్ అంటారు)లో ఉన్న అరబ్ ప్రజల ఇళ్లు కూల్చివేయడం, వాటి స్థానంలో, లేక నేలమట్టం చేసిన పంటపొలాల, తోటల స్థానంలోనో కాలనీలు కట్టడం, వాటిని కలుపుతూ కాలనీ వాసులకు మాత్రమే ప్రవేశం ఉన్న రోడ్లు, వాటి పక్కనే చెక్‌పోస్టులు, అజమాయిషీకి సైనికులను నియమించడం అనేవి ప్రధాన ఎత్తుగడలు.

పన్నుల రాయతీలు ఇచ్చి, చవకగా ఇళ్లు అమ్మి ఈ సెటిల్‌మెంట్ల లోకి దాదాపు మూడులక్షల మందిని ప్రవేశపెట్టింది. వీరిలో ఒక భాగం మతోన్మాద యూదులు. 'ఆత్మరక్షణ' కోసం వీళ్ల చేతిలో ఆధునిక ఆయుధాలుపెట్టి పాలస్తీనా ప్రజల నడుమ వదిలింది ఇజ్రాయిల్. బడికి వెళుతున్న పిల్లలమీద, పొల్లాలో రైతుల మీద దాడులు చేయడం, అరబ్ ప్రజల ఇళ్లమీద రాళ్లు విసరడం, కాల్పులు జరపడం, కోతకొచ్చిన పంటలను, తోటలను నాశనం చేయడం ఈ ఉన్మాదుల పని. వీరికి రక్షణగా ఇజ్రాయిల్ సైనికులు తమవంతుగా దాడులు చేయడం, చెక్ పోస్టుల దగ్గర ప్రజలను వేధించడం చేస్తుంటారు. చాప కింద నీరులాగా సాగుతున్న ఇజ్రాయిల్ ఆక్రమణ వల్ల వెస్ట్‌బాంక్ ఇప్పటికీ ఒకదానితో ఒకటికి సంబంధంలేని నాలుగు ప్రధాన బహిరంగ జైళ్ల లాగా మిగిలింది. ఇల్లు ఒక జైలులో. పనో, చదువో, పొలమో, వైద్యమో మరొక జైలులో. హైదరాబాద్ ట్యాంక్‌బండ్ నుండి కూతవేటు దూరంలో ఉన్న సెక్రటేరియట్ వంటి ప్రదేశానికి వెళ్లాలంటే చెక్‌పోస్టుల దగ్గర మూడు నాలుగు గంటలు, సైనికులు దయతలిచే దాకా పడిగాపులు పడాలి. కారు చవకగా భూములు, నీరు, ఖనిజ సంపద, వాటిపైన అతి తక్కువ జీతాలకు దొరికే పాలస్తీనా శ్రామికులు, ఇది ఇజ్రాయిల్ విష ప్రచారం. ప్రోత్సహిస్తున్న యూదు మతోన్మాదం. వాటికి మద్దతుగా అమెరికాలోని క్రైస్తవ ఛాందస సంస్థల పాత్ర, వెనుకనున్న రాజకీయ ఆర్థికం.

ఇక సమస్య పరిష్కారం మాటకొస్తే, 'శాంతి ప్రక్రియ' పేరుతో అమెరికా, ఇజ్రాయిల్ నడుపుతున్న నాటకంలో మొదట బిల్ క్లింటన్ ఆధ్వర్యంలో క్యాంపు డేవిడ్ చర్చలు, తరువాత బుష్ అజమాయిషీలో 'రోడ్డు మ్యాప్' కార్యక్రమాలు చూస్తే పరిస్థితి అర్థమౌతుంది.

క్యాంపు డేవిడ్ చర్చల్లో (జూలై 11-25, 2000) ఇజ్రాయిల్ ప్రధాని యెహుద్ బరక్ ఎన్ని ప్రతిపాదనలు చేసినా పి.ఎల్.ఒ. నాయకుడు అరాఫత్ వాటిని తిప్పికొట్టాడు అనేది ఇజ్రాయిల్ ప్రచారం. కాని నిజానికి జరిగిందేమిటో చర్చల్లో పాల్గొన్న క్లింటన్ సలహాదారు రోబర్ట్ మాలే రాసుకొన్న వివరమైన నోట్స్ తెలియజేశాయి. చర్చల్లో పాల్గొన్న బరక్ అరాఫత్‌తో ముఖాముఖి మాట్లాడకుండా, కాగితం మీద ఏమీ పెట్టకుండా, అమెరికన్ అధికారుల ద్వారా తన ప్రతిపాదనలు పంపించాడు. పాలస్తీనా ప్రతినిధులు ఐరాస తీర్మానాలు 194 ( డిసెంబర్ 11, 1948), 242 (నవంబర్ 22, 1967) (శరణార్థులకు తిరిగి వచ్చే హక్కు, ఆక్రమిత ప్రాంతాల నుండి సైన్యం తొలగింపు) మీద ఆధారపడగా బరక్ ముందుగా ఘర్షణ ముగిసిందనే ప్రకటన చేయాలని డిమాండ్ చేసాడు. అలా చేస్తే ఐరాస తీర్మానాలు ముగిసినట్లే.

ఇక బరక్ శాంతి ప్రతిపాదనలు – చాలావరకు కాగితం మీద పెట్టకుండా – తూర్పు జెరుసలెం శివారు గ్రామం అబూ దిస్ పేరును తూర్పు జెరుసలెంగా మార్చి దానిని (మరో రెండు గ్రామాలతో కలిపి) పాలస్తీనా రాజధాని చేయడం, యూదుకాలనీలు ఉన్న ప్రధాన ప్రాంతాలు వాటి నడుమ ప్రాంతాన్ని ఇజ్రాయిల్లో కలపడం. ఆ ప్రాంతంలో ఉన్న పాలస్తీనా ప్రజలకు మాత్రం ఇజ్రాయిల్ పౌరసత్వం నిరాకరించడం. పాలస్తీనాలో కొన్ని 'కీలక ప్రాంతాలు', 'కొంత కాలం' ఇజ్రాయిల్ సైనిక అధీనంలో కొనసాగడం, పాలస్తీనా సరిహద్దులు, ఆకాస ప్రాంతం, తీరంలో ఇజ్రాయిల్ అజమాయిషీ కొనసాగడం, వీటికి బదులుగా పాలస్తీనా ప్రతినిధులు పోరాట విరమణ ప్రకటించాలి.

దాదాపు ఇటువంటివే ఇతర ప్రతిపాదనలు చేసిన బరక్ చివరి నిమిషంలో ఆ మూడు గ్రామాల ప్రతిపాదన కూడా వెనక్కి తీసుకున్నాడు. అదే సమయంలో లికుడ్ పార్టీ నాయకుడు అరియల్ షరోన్ (అప్పటి ప్రతిపక్ష నాయకుడు)కు పెద్ద ఎత్తున రక్షణ కల్పించి జెరుసలెంలోని హారం షరీఫ్ మసీదు లోనికి పంపించాడు. యాభై ఏళ్లకు పైగా అరబ్ ప్రజల హత్యలలో స్వయంగా పాల్గొన్న, సబ్రా, షటిల్ల శరణార్థుల క్యాంపుల్లో (లెబనాన్, సెప్టెంబర్ 16-18, 1982) మూడువేల మంది పాలస్తీనా ప్రజలను ఊచకోత కోయించిన షరోన్ పట్ల ఉన్న వ్యతిరేకత బరక్‌కు తెలుసు. షరోన్ 'విహారం' తరువాత చెలరేగిన ఆందోళన, దానివల్ల ఇజ్రాయిల్‌లో రాజకీయ అస్థిరత వల్ల బరక్ ప్రభుత్వం ముగిసింది.

ఇక రెండవ బుష్ నడిపిన 'రోడ్డు మ్యాప్' వివరాలు. మొత్తం ప్రతిపాదనలు అమెరికా ప్రభుత్వం అక్టోబర్ 2002లో ఇజ్రాయిల్ ప్రధాని షరోన్‌కు ముందుగా అందించింది. అదే సంవత్సరం డిసెంబర్ 20న ఇజ్రాయిల్ చేసిన మార్పులతో, తుది నివేదిక తయారు చేసింది. ఆ తరువాత కాలంలో షరోన్ ప్రధాన అధికారి (చీఫ్ అఫ్ స్టాఫ్) డొవ్ వేస్‌గ్లాస్ సుమారు వంద మార్పులు సమర్పించాడు. ఏప్రిల్ 30,

*ఇటలీలో మార్క్సిస్ట్ ఆలోచనాపరుల బృందంగా నడుస్తున్న 'ఎడిషన్స్ సైన్స్ మార్క్సిస్ట్– ఎస్.ఎ.ఆర్.ఎల్.' (మార్క్సిస్ట్ శాస్త్ర ప్రచురణలు) గత కొంతకాలంగా మార్క్సిజం గురించి, పెట్టుబడిదారీ విధానం గురించి, సోషలిజం గురించి అధ్యయనాలు ప్రచురిస్తోంది. ఈ సంస్థ నాయకుడు అరిగో సెర్వెట్టో రాసిన 'క్లాస్ స్ట్రగుల్స్ అండ్ ది రెవల్యూషనరీ పార్టీ, ది డిఫికల్ట్ క్వశ్చెన్ ఆఫ్ టైమ్స్, ది పొలిటికల్ షెల్ వంటి పుస్తకాలతో పాటు 2008 నవంబర్‌లో 'ది కమ్యూనిస్ట్ ఛాయిస్ – అండర్‌స్టాండింగ్ ది ప్రెజెంట్ – ఛేంజింగ్ ది ఫ్యూచర్' అనే పుస్తకాన్ని ఇటాలియన్‌లో ప్రచురించింది. 2009లో వెలువడిన ఆ పుస్తకపు ఇంగ్లిష్ అనువాదానికి ముందుమాట ఇక్కడ ప్రచురిస్తున్నాం. – సం.*

# స్వేచ్ఛాకాంక్షే జీవిత ధ్యేయం

*'... ఈ జవాబులను ఆచరణాత్మక వినియోగం కోసం ఉద్దేశిస్తున్నాను... మేధావుల అధ్యయనాల ఇరుకు గోడలను పగులగొట్టే వారికోసం... ఎవరికి నిజంగా ఆదర్శాలు అవసరమో వారి కోసం ఉద్దేశిస్తున్నాను. ఎందుకంటే ఆదర్శాలు లేకుండా మంచి బతుకు సాధ్యం కాదు' – లెనిన్ (1894)*

వాస్తవాన్ని అర్థం చేసుకోవడం ఇవాళ ఇదివరకటికన్న చాలా ముఖ్యం. మన 'ప్రపంచ' సమాజం ఎన్ని కీలకమైన మార్పులకు లోనవుతున్నదంటే మనం వాటిని అర్థం చేసుకోకపోయినా, ఆ మార్పులు జరిగిపోతూ ఉంటాయి. చరిత్ర ఒక అసాధారణ పద్ధతిలో త్వరితగతిన ముందుకు సాగుతోంది. కొద్ది సంవత్సరాల కాలంలోనే మహా శక్తిమంతమైన ప్రపంచ శక్తి అమెరికా అతి వేగంగా పతనమైపోవడాన్ని చూస్తున్నాం. ప్రపంచ సంక్షోభం మధ్య అమెరికా ఒక బలహీనమైన బిందువుగా కనబడుతోంది. అదే సమయంలో కొత్త శక్తులు, ప్రధానమైన ఉదాహరణలు చెప్పాలంటే చైనా, భారతదేశం అసాధారణమైన వేగంతో అభివృద్ధి చెందుతున్నాయి. మానవ జాతిలో మూడో వంతు ఈ దేశాలలోనే ఉంది. గత శతాబ్దంలో అత్యంత భయానకమైన రక్తపాతాలను చవిచూసిన యూరోపియన్ దేశాలు ఈ కొత్త శక్తుల పోటీని ఎదిరించడానికి ఏకమవుతున్నాయి.

ప్రపంచ ద్రవ్య వ్యవస్థ లక్షలాది మంది ప్రజలను ప్రభావితం చేస్తూ ఎప్పటికప్పుడు సంక్షోభాలతో కంపించిపోతోంది. ఇరాక్ వంటి మానని పుండు అలా ఉండగానే భూగోళం మొత్తం మీద డజన్ల కొద్దీ ఇతర సంఘర్షణా ప్రాంతాలు రక్తమోడుతున్నాయి. ఐక్యరాజ్య సమితికి చెందిన ఆహార, వ్యవసాయ సంస్థ ప్రస్తుత ఆహార సంక్షోభం వల్ల కొత్తగా పదికోట్ల మంది ప్రజలు పోషకాహార లోపం స్థితిలోకి జారిపోతారని ప్రకటిస్తోంది. అంటే, ప్రపంచ జనాభాలో ఆరో వంతు మంది ఆకలి చావుల స్థితిలో ఉంటారన్నమాట.

మనకు కనబడుతున్న ఈ దృశ్యం అత్యంత వేగంగా మారిపోతున్న ప్రపంచానిది. బలపడుతున్న శక్తులు పెరిగిపోతున్న బలాన్ని చూపుతూ తమకు చోటు కావాలని ఇతరులను మోచేతులతో అటూ ఇటూ తోస్తున్నాయి. దిగజారుతున్న శక్తులు ఇంత కాలం అనుభవించిన అధికారాలను నిలబెట్టుకోవడానికి పోరాడుతున్నాయి. ప్రపంచ వ్యాప్తంగానే సాధారణ ఆర్థిక పరస్పర సంబంధాలు ప్రభుత్వాల రాజకీయ చర్యలకు ఊహించని ఫలితాలను ఇస్తున్నాయి.

ప్రపంచాన్ని నడుపుతున్న ఈ ఘటనల గతితర్కాన్ని అర్థం చేసుకోవడంలో విఫలం కావడమంటే, ఈ ఘటనలు జరిగిపోతూ ఉంటే మౌన సాక్షులుగా చూస్తూ ఉండడమో, లేదా ఆ ఘటనలకు బాధితులుగా

---

2003న అమెరికా రాయభారి డానియెల్ కర్ట్‌జర్ షరోన్‌కు యురోప్ ప్రతినిధులు పి.ఎల్.ఒ. అధ్యక్షుడు మహమూద్ అబ్బాస్ కు అందజేసారు.

దీనిలో ఉన్న డిమాండ్లు అమెరికాతో ప్రజాస్వామికమైనదిగా గుర్తించదగ్గ ప్రభుత్వాన్ని ఏర్పరచాలి. ఇజ్రాయిల్ చేత నమ్మకస్తులుగా గుర్తించబడిన మూడు రక్షణ దళాలు నిర్మించాలి. వీటితోటి 'ఉగ్రవాదాన్ని' అంతం చేయాలి. తదుపరి ఇజ్రాయిల్ తన సైనిక ఆక్రమణను తొలగిస్తుంది. ఎలా తొలగిస్తుందో హామీలు లేవు. అంటే ఆత్మాహుతి దాడులు, చిన్న చిన్న రాకెట్ దాడులు జరుపుతున్న హమాస్, ఇస్లామిక్ జిహాద్ వంటి సంస్థలు దాడులు నిలిపివేయడమే కాక ప్రజా సంఘటన (పాపులర్ ఫ్రంట్ ఫర్ ది లిబరేషన్ ఆఫ్ పాలెస్తీనా), ప్రజాస్వామిక సంఘటన (డెమోక్రటిక్ ఫ్రంట్) వంటి రాజకీయ సంస్థలను సమూలంగా తొలగించాలి అంటే అర్థం, అప్పటికే లొంగి ఉన్న అబ్బాస్, పాలస్తీనా సమాజంలో అంతర్యుద్ధం మొదలుబెట్టాలి.

దీనికి ప్రతిస్పందనగా అబ్బాస్ అన్ని సంస్థలచేత పోరాట విరమణ చేయించగా, హమాస్ సంస్థ దీర్ఘకాలిక కాల్పుల విరమణ (1967)కి సరిహద్దులతో రెండు రాజ్యాల స్థాపనకు అనుకూలత ప్రకటించింది. రోడ్డు మ్యాప్ ప్రకారం జరిగిన ఎన్నికలలో హమాస్ గజా ప్రాంతంలో గెలిచి అమెరికా ఇజ్రాయిల్‌కు కొత్త సమస్య తెచ్చిపెట్టింది. హమాస్‌ను అధికారం నుండి దించి మళ్లీ పి.ఎల్.ఒ.ను నిలబెట్టి, తిరిగి ఉగ్రవాద చర్యలలోకి దించడానికి జరుపుతున్న ప్రయత్నమే గాజా దిగ్బంధం.

ఈ వ్యాసం కేవలం ప్రస్తుత పరిస్థితిని అర్థం చేసుకోవడం ఎలా అన్న ప్రశ్నకు జవాబుగా రాసినది. వివరంగా తెలుసుకోదలచిన వారు టాన్యా రేయిన్‌హార్ట్, ఇలన్ పాప్పె, నార్మన్ ఫిన్కెల్‌స్టీన్, నోం చోమ్స్కి, యురి డేవిస్, యురి అవినేరి రచనలు ఎలెక్ట్రానిక్ ఇంతిఫాదా, హారెట్జ్ పత్రికలూ, ఇజ్రాయిల్ ప్రచారం గురించి తెలుసోకోదలచిన వారు జెరుసలెం పోస్ట్, జెరుసలెం సెంటర్ ఫర్ పబ్లిక్ అఫైర్స్, ఆస్ట్రేలియా ఇజ్రాయిల్ అండ్ జువిష్ అఫైర్స్ కౌన్సిల్, మిడిల్ ఈస్ట్ ఫోరం సంస్థల వెబ్‌సైట్లు చూడగలరు.

*(టాన్య రేయిన్‌హార్ట్ స్మృతిలో)*

*(రచయిత పాత్రికేయులు, ఆస్ట్రేలియాలో సామాజిక కార్యకర్త)* వీ

మిగలడమో జరుగుతుంది.

గత శతాబ్దం మనకు వినిపించిన మహా అబద్ధాలన్నీ ఇప్పుడు స్పష్టమైపోయాయి. వాటిలో మొదటిదీ, అన్నిటికన్నా ముఖ్యమైనదీ అయిన అబద్ధం కొన్ని దేశాలలో సోషలిజాన్ని, భవిష్యత్తు సమాజాన్ని సాధించడం జరిగిందనేది. ప్రకృతి లాగానే భావజాలాలు కూడా శూన్యాన్ని అంగీకరించవు. పాలకవర్గాలు కొత్త శక్తిమంతమైన భావాల బలాన్ని పరీక్షించడానికి మతాన్ని అమ్మడానికి ప్రయత్నిస్తున్నాయి. ప్రత్యేకంగా కాథలిక్ మత విశ్వాసాలను ప్రచారంలో పెడుతున్నాయి.

'అభివృద్ధి నిరోధకమైన, ప్రతీఘాతుకమైన భావజాలం బలమైన, సమర్థమైన నిర్మాణం మీద ఆధారపడితే శతాబ్దాల మానవ అనుభవాన్ని దోపిడీ చేయగల శక్తిని సంతరించుకుంటుంది. అత్యాశాపరులైన, క్షుద్రమైన పెట్టుబడిదారీ వర్గం తన భావదారిద్ర్యాన్ని నింపుకోవడానికీ, నగ్నంగా కనబడుతున్న తన ప్రణాలను మాన్చుకోవడానికీ ఇటువంటి భావజాలం అవసరమవుతుంది.'

మార్క్సిస్టులంగా మనం విజ్ఞాన సర్వస్వకర్త డిడెరో రాసిన మాటలను మరిచిపోలేదు. ఆయన పెట్టుబడిదారీ వర్గపు విప్లవకర దశలో అత్యద్భుతమైన మేధావులలో ఒకరు. 'అంతులేని అడవిలో, చీకటి రాత్రి, తప్పిపోయిన నన్ను నడిపించడానికి చేతిలో చిరుదీపం తప్ప మరేమీ లేదు. అప్పుడు దారిలో ఒక ఆగంతకుడు కలిసి, 'మిత్రమా దారి కనిపెట్టడానికి నీకున్న మార్గం ఒకే ఒకటి. ఆ దీపం మలిపెయి' అంటాడు. ఆగంతకుడు మతవాది అని చెప్పనక్కర్లేదు' అని డిడెరో రాశాడు.

మనం ఇవాళ దీపాలు మలిపేయని యువకుల కోసం వెతకవలసి ఉంది. ఈ పోరాటం సాగించడానికి ధైర్యం ఉన్న యువకులను, అభినివేశం ఉన్న యువకులను వెతకవలసి ఉంది. ఎందుకంటే, ఇవాళ్టి ప్రపంచం మహత్తరమైన అల్లకల్లోలాల ప్రాంగణంలో నిలిచి ఉంది. ఇవాళ కావల్సింది భ్రమలనూ, పుక్కిటి పురాణాలనూ తోసిరాజనగల యువకులు. తమ జీవితాలకు తామే నాయకులు కాగలిగిన యువకులు.

ఇవాళ పెట్టుబడిదారీ వర్గం తన అగ్ర నాయకులను జాగ్రత్తగా ఎంపిక చేసి తీర్చిదిద్దుతుంది. కాని, ప్రజా రాశులలోని యువతరం దగ్గరికి వచ్చేసరికి మాత్రం అది వారిని ఏ పట్టింపు లేని వాళ్లుగా తయారు చేయడానికి ప్రయత్నిస్తోంది. దిగజారుడునూ, మాదక ద్రవ్యాల వాడకాన్నీ స్వేచ్ఛా చిహ్నాలుగా చూపెడుతోంది. ఇక్కడ ఈ సమస్యను నైతిక దృష్టితో చూడదల్చుకోలేదు. కానీ, మనం ఆడదలచుకున్న క్రీడకు ఒక స్పష్టమైన దృక్పథం కావాలి. అది ఒక్క తప్పును కూడా సహించ లేనిది. ప్రపంచాన్ని మార్చే కర్తవ్యం తమమీద పెట్టుకున్న వాళ్లకు ప్రకృతి ఇచ్చిన అన్ని శక్తులు, అంటే స్పష్టత, బలం, మేధో స్థాయి సంపూర్ణంగా ఉండాలి.

ప్రతి తరంలోనూ ఇటువంటి యువకులు ఉన్నారు. ఏ విషయమైనా వెంటనే గ్రహించగల చురుకైన యువకులు, లోకజ్ఞానం అనే పేరుతో తమకు అంది వచ్చే సమాధానాల పొట్లాలతో సంతృప్తి చెందని యువకులు. అధికార పరిరక్షకులకూ, మానవ జాతి సామూహిక ప్రయోజనాల పరిరక్షకులకూ మధ్య చిరకాలంగా సాగుతున్న పోరాటంలో పాలుపంచుకోదల్చుకున్న యువకులు.

ఈ పోరాటం మానవ జాతి చరిత్ర పొడవునా సాగుతూ వస్తున్నది. ఆ పోరాటమే మార్క్స్ – ఎంగెల్స్ కమ్యూనిస్టు ప్రణాళికలో చెప్పినట్టు 'తమ స్వార్థ ప్రయోజనాల లెక్కల శీతల జలాలలో ప్రతిదాన్ని ముంచివేయదల్చుకున్న పెట్టుబడిదారీ వర్గానికీ' 'ప్రతి ఒక్కరికీ వారి అవసరాలను బట్టి ప్రతిఫలం ఇవ్వదలచిన కమ్యూనిస్టులకూ' మధ్య పోరాటంగా ఇవాళ సాగుతున్నది.

పారిస్ కమ్యూన్‌లో శ్రామికులు కట్టిన అవరోధాల దగ్గర్నుంచి, అక్టోబర్ విప్లవం నాటి నుంచి, గత రెండు శతాబ్దాలలో ప్రపంచ వ్యాప్తంగా కార్మికులు పోరాడిన వేలాది యుద్ధాలలో నుంచి మనకు అర్థమయ్యేదేమంటే ఆ పోరాటాల అగ్రభాగాన ప్రతిసందర్భంలోను యువజనుల సమూహాలు నిలబడ్డాయి. వారే మన ప్రేరణ. వారే మన మార్గదర్శి. వారు, చరిత్ర మీద తమ ముద్ర వదిలిపోయారు.

ఇవాళ ఆ పోరాటమే ఒక కీలక మలుపు దగ్గర ఉన్నది. ఈ యుద్ధంలో నిద్రాణంగా ఉన్న మన శక్తి మహత్తరమైనది. ప్రపంచ బ్యాంక్ అంచనాల ప్రకారమే ప్రపంచ జనాభాలో 18 శాతం పదిహేను నుంచి ఇరవై నాలుగు సంవత్సరాల మధ్య వయస్సు ఉన్న యువకులు. అంకెలలో చెప్పాలంటే ఇది 120 కోట్ల మంది వ్యక్తులు. సామాజిక పరిస్థితులలో, సంస్కృతిలో, భాషలో, ఆయు ప్రమాణంలో వారి మధ్య తేడాలుండవచ్చు. కానీ, వారి వయస్సు వల్ల మాత్రమే కాక, ఇతర కారణాల వల్ల కూడా వారు ఏకమై ఉన్నారు.

వీరిలో ఆరు కోట్ల మంది యువకులు యూరప్‌లోని ప్రధాన నగరాలలో నివసిస్తున్నారు. చుట్టూరా భయంకరమైన ఆకలి ఇంకా కొనసాగుతున్న ప్రపంచ వాస్తవ స్థితి మధ్య సౌభాగ్యవంతమైన ఒయాసిస్‌లలో జీవిస్తున్నారు.

యూరప్‌లోని ఈ యువతరంలో అత్యధిక సంఖ్యాకులు ఇంకా విద్యాభ్యాసంలోనే ఉన్నారు. వీరిలో అత్యధికులు ప్రాథమిక, మాధ్యమిక విద్యాస్థాయిలో ఉండగా, ఫ్రాన్స్, ఇటలీ వంటి కొన్ని దేశాలలో మాత్రం ఈ వయో బృందంలో అరవై శాతం విశ్వవిద్యాలయాలకు వెళుతున్నారు.

అయితే, సాపేక్షికంగా వారు మెరుగైన స్థితిలో ఉన్నట్టు కనిపించవచ్చు కానీ, మనం నివసిస్తున్న సామ్రాజ్యవాద యుగంలో ప్రపంచమంతా వ్యాపించిన అనిశ్చిత స్థితి వాళ్లకు కూడా ఉంది. అదనపు విలువను ఉత్పత్తి చేయడానికి అవసరమైన చేతులుగా, మెదళ్లుగా ఈ యువకులు ఉద్యోగాల మార్కెట్‌లో ప్రవేశిస్తే, అక్కడ కోట్లాదిమంది వలస వచ్చిన కార్మికులను ఎదుర్కోవలసి వస్తుంది. వారినీ, వీరినీ కలగలిపే ఉమ్మడి సూత్రం పేరు 'దోపిడీ'. వీరందరూ ఒకే ఒక్క అంతర్జాతీయ వర్గానికి చెందినవారు. ఆ వర్గపు చారిత్రక కర్తవ్యం ఏమంటే, కొనసాగుతున్న పెట్టుబడిదారీ సమాజాన్ని కూలదోయడమే. వలస వచ్చిన యువ కార్మికులు సామాజిక నిచ్చెన మెట్ల వ్యవస్థలో అట్టడుగు మెట్టు మీద మాత్రమే కాలుపెట్టగలరు. ఇటీవలనే మిలాన్ నగర ఛాంబర్ ఆఫ్ కామర్స్ చేసిన అధ్యయనం ప్రకారం గత మూడు సంవత్సరాలలో నగరంలోకి వలస వచ్చిన నర్సింగ్ సిబ్బంది సంఖ్య మూడు రెట్లు పెరిగింది. అలాగే, ఇటలీ ఉత్తరాదిలో అనేక కర్మాగారాలలో కింది స్థాయి అర్హతలతో పనిచేసే ఉద్యోగాలనిండా వలస వచ్చిన కార్మికులే ఉన్నారు. ఈ గణాంకాలు యూరప్ మొత్తానికీ వర్తిస్తాయి.

ఫ్రాన్స్ ప్రతి సంవత్సరం రెండు లక్షల మంది వలస కార్మికులను ఆకర్షిస్తుంది. గ్రేట్ బ్రిటన్‌లో మొత్తం జనాభాలో పది శాతం వలస వచ్చిన వారే. జర్మనీలో 2001 నుంచి 2006 వరకు ఏడు సంవత్సరాలలో 13 శాతం వలస వచ్చినవారే. స్పెయిన్‌లో కేవలం లాటిన్ అమెరికా నుంచే పదిహేను లక్షల మంది వలస వచ్చారు.

'పారిశ్రామిక కార్మికవర్గపు సంఖ్యా, వారి దారిద్ర్యమూ అంతకంతకూ పెరిగిపోతూ ఉంటాయి. ఇంత నిర్ద్వంద్వంగా చెప్పడం కూడా నిజానికి సరియైనది కాదు. కార్మికుల సంఘటిత శక్తి, అంతకంతకూ పెరిగిపోయే వారి ప్రతిఘటన వారి దారిద్ర్యాన్ని ఏదో ఒక మేరకు తగ్గించడానికి ప్రయత్నించవచ్చు. కానీ, కచ్చితంగా పెరిగిపోయేదేమంటే, వారి మనుగడలోని అభద్రత. ఇది మాత్రం నేను నిర్ద్వంద్వంగా చెప్పగలను'.

ఈ మాట రాసింది ఎంగెల్స్. రాసిన సందర్భం 1891. దారిద్ర్యం పెరగడం గురించి జర్మన్ సోషల్ డెమోక్రట్‌లు చెప్పిన మాటను సవరిస్తూ ఆయన ఈ మాట అన్నాడు.

ఈ దృక్పథాన్ని ఇవాళ్టి ప్రపంచానికి వర్తింపజేయడానికి మనం ప్రయత్నిస్తే, ఇవాళ అన్ని ఖండాలలోని యువతరం ముందర ఉమ్మడిగా ఉన్న కచ్చితమైన అంశం ఈ మనుగడ గురించిన అభద్రతే అని అర్థమవుతుంది. ఇంకా స్పష్టంగా చెప్పుకుందాం : ఇవాళ భూగోళం మీద పుట్టిన వ్యక్తులలో అత్యధిక సంఖ్యాకులకు యవ్వన దశను ఎట్లా గడుపుకొస్తామా అనేదే అతి పెద్ద సమస్య.

యునిసెఫ్ 2008 నివేదిక ప్రకారం ఇవాళ్టి ప్రపంచంలో ప్రతి సంవత్సరం ఒక కోటి మంది ఐదు సంవత్సరాల కన్న తక్కువ వయసు ఉన్న పిల్లలు చనిపోతున్నారు. మీరీ వ్యాసం చదవడం మొదలు పెట్టినప్పటి నుంచి ఇప్పటికి రెండు వేల మంది చచ్చిపోయి ఉంటారు. ఈ చావులన్నిటినీ అతితక్కువ ఆర్థిక కేటాయింపులతో నివారించవచ్చును. ఈ చావులను నిరోధించాలంటే, టీకాలు వేయాలి. దోమ తెరలు వాడాలి. నీటిలో కొన్ని రకాల ఖనిజ లవణాలు కలిపి ఇవ్వాలి. కానీ, 2007లో కేవలం సైనిక వ్యయం కింద 1,20,400 కోట్ల డాలర్లు తగలేసిన ప్రపంచానికి ఈ అవసరాలకు మాత్రం వనరులు దొరకడం లేదు. 2015 నాటికి ఈ ఐదు సంవత్సరాల లోపు చిన్నారుల మరణాలను సాలీనా తొమ్మిది వేల స్థాయికి తగ్గించడానికి ఉద్దేశించిన పథకానికి అవసరమైన నిధులను అత్యాశాపూరితమైన, అసాధారణమైన ప్రయత్నం అని చెపుతున్నారు. ఇంతకూ, ఇటువంటి పథకాలు వాస్తవికంగా అనేక సార్లు విఫలమయ్యాయని కొత్తగా చెప్పనక్కర్లేదు.

మరొక చెప్పనక్కర్లేని విషయం ఏమంటే, పదిహేనేళ్ల లోపు పిల్లలను సైనికులుగా వాడుతున్న దేశాలు ఇరవై నాలుగు ఉన్నాయి. ముప్పై ఏళ్ల కింద జరిగిన ఇరాన్ - ఇరాక్ యుద్ధంలో ఎంత పెద్ద ఎత్తున మానవ హననం జరిగిందో ఇటీవలనే బయటపడింది. చిన్నారి పిల్లలను మందలుగా పోగేసి, ముందుకు సాగుతున్న సైనిక దళాలు వారిని తమకు రక్షణ కవచంగా మందు పాతరల మీద నడిపించాయి. మానవ జాతికి వ్యతిరేకంగా సాగిన నేరాలను విచారించే అంతర్జాతీయ న్యాయస్థానాన్ని 106 దేశాలు సంతకం చేసిన అంతర్జాతీయ ఒప్పందం ఏర్పాటు చేసింది. ఈ ఒప్పందం మీద సంతకాలు చేయని ముఖ్యమైన దేశాలలో అమెరికా, చైనా ఉన్నాయి. ఈ న్యాయస్థానం చెప్పిన ప్రకారం ఈరోజుకు కూడా సైనిక నిర్మాణాలలో భాగస్తులయిన చిన్నారి పిల్లల సంఖ్య మూడు లక్షలకు పైగా ఉంది. 2000లోనే కుదిరిన అంతర్జాతీయ ఒప్పందం ప్రకారం పిల్లలను సైనిక అవసరాలకు వాడుకోవడం మీద నిషేధం ఉంది. ఇవన్నీ మినహాయింపుగా కనబడే తీవ్రమైన పరిణామాలు కావచ్చు. కానీ, తమ బాల్యాలను, చాలా సందర్భాలలో తమ జీవితాలను సామ్రాజ్యవాద యుద్ధాలకు బలిచేసిన వాస్తవమైన వ్యక్తులు ఉన్నారు. ఇవి ఒక నిరాశాపూరితమైన, పాశవికమైన ప్రపంచంలో జరిగిన తీవ్రమైన పరిణామాలే కావచ్చు. కానీ, వాటిపట్ల మనం నిర్లిప్తంగా ఉండలేం. మన ఔదార్యం ఈ పరిస్థితిని మార్చదు. మన మానవతావాద సదుద్దేశాలు ఈ పరిస్థితిని మార్చవు. ఆయుధాలను ఉత్పత్తి చేసే, అమ్మే సామ్రాజ్యవాద దేశాలే ఏర్పాటు చేసిన న్యాయస్థానాలు కూడా ఈ పరిస్థితిని మార్చవు. ఎక్కువలో ఎక్కువ ఆ పనుల వల్ల ప్రపంచపు అంతరాత్మ సంతృప్తి చెందవచ్చు. లేదా, సులభమైన ప్రాచుర్యాన్ని కోరుకునే హాలీవుడ్ తార ఎవరో ఈ పరిస్థితి చూపి తన మీదికి దృష్టి కేంద్రీకరించవచ్చు.

మన ప్రపంచంలో ఇంతగా భాగమైన సంక్షోభాలు, యుద్ధాలు మన సమాజం నడుస్తున్న ఒక ప్రత్యేక యంత్రాంగం మీద ఆధారపడినవని మనకు తెలుసు. ఈ సంక్షోభాలు, యుద్ధాలు మనుషుల తప్పుడు అంచనాల వల్ల జరగడం లేదు. రాజకీయవేత్తల దురుద్దేశాల వల్ల జరగడం లేదు. ప్రస్తుత ప్రత్యేక సామాజిక వ్యవస్థ ఇదే విధంగా సాగితే దాని భవిష్యత్తు అనివార్యంగా ఎంత హింసాత్మక, రక్తపాత సహిత ఘర్షణగా ఉండబోతోందో మనం అర్థం చేసుకోవాలి. దీన్నే ఇవాళ్టి మన యువ కార్మికవర్గం పరిగణనలోకి తీసుకోవల్సి ఉంది. ఎందుకంటే, ఈ యుద్ధాన్ని ఎదుర్కోవల్సింది వారే. అధికారం మీద తన పట్టు వదులుకోకుండా ఉండడానికి ఎటువంటి అత్యాచారానికైనా తెగబడే పాలకవర్గంతో పోరాడవల్సింది వారే. మొదటి ప్రపంచ యుద్ధంతో, అక్టోబర్ విప్లవంతో ప్రారంభమైన యుద్ధాల, విప్లవాల యుగం ఇంకా నడుస్తూనే ఉంది. పెట్టుబడిదారీ అభివృద్ధితో, కొత్త సామ్రాజ్యవాద శక్తుల పుట్టుకతో ఈ యుగం ఒక కొత్త మలుపు తిరుగుతోంది.

గత ఇరవై సంవత్సరాలు మనం నివసిస్తున్న ప్రపంచాన్ని చాలా మార్చాయి. బెర్లిన్ గోడ కూలిపోయినపుడు, రష్యాలోనూ, యూరప్‌లోనూ సోషలిజం అనే పాత అబద్ధం అదృశ్యమైనపుడు ఇక చిట్టచివరికి ప్రపంచంలో శాంతి నెలకొన్నదనీ, ఒక కొత్త సహకార యుగం ప్రారంభమవుతున్నదనీ పాలకవర్గాల మేధావులందరూ నమ్మబలికారు.

బెర్లిన్ గోడ శిథిలాలు పూర్తిగా కూలిపోకముందే 1990-91 గల్ఫ్ యుద్ధం జరిగి 80 వేలకు పైగా చనిపోయారు. ఆ తర్వాత 1991-95లో పాత యుగోస్లావియాలో, 1992-93లో జార్జియాలో, 1994-2004 చెచెన్యాలో, 1999లో కొసావోలో యుద్ధాలు జరిగాయి. 2001లో అఫ్ఘనిస్తాన్‌పై అమెరికా, యూరోపియన్ సామ్రాజ్యవాద దురాక్రమణ జరిగింది. 2003లో కొత్త గల్ఫ్ యుద్ధం మొదలయింది. పాత సోవియట్ రిపబ్లిక్‌ల మధ్య ఎడతెగని ఘర్షణలలాగానే కొత్త గల్ఫ్ యుద్ధం కూడా ఇంకా ముగియలేదు. వీటికి పశ్చిమాసియాలో జరుగుతున్న ఘర్షణలు, ఆఫ్రికన్ యుద్ధాల రక్తపాతపు కొనసాగింపును, ప్రపంచ వ్యాప్తంగా అనేక ఇతర ఉద్రిక్త ప్రాంతాలను కలపవచ్చు. రెండో

ప్రపంచ యుద్ధం తర్వాత శాంతి కాలంగా చెప్పబడే ఈ సంవత్సరాలలో లక్షలాది మంది యువకులు మరణించారు. నిజం చెప్పాలంటే, పెట్టుబడిదారీ విధానపు శాంతియుత అభివృద్ధి సంవత్సరాలలో ఒక్క రోజు కూడా తుపాకులు మూగబోలేదు. ఆధిపత్య శక్తుల మధ్య మళ్లీ ఒకసారి భీకరమైన పోటీ తలెత్తితే, వాటి మధ్య సమతూకం మళ్లీ ఒకసారి భగ్నమైతే పాలకవర్గాలు మరింత పెద్ద ఎత్తున హత్యాకాండలకు దిగకుండా ఆగుతాయని మనం నమ్మగలమా?

ఈ వాస్తవికతను గ్రహించడం సులభమైన విషయమే. మనం మన టెలివిజన్ తెరల మీద ఎన్నెన్నో ప్రకృతి ఉత్పాతాలను, సామాజిక కల్లోలాలను చూడడానికి అలవాటు పడిపోయాం. యుద్ధం అన్నా, పేదరికం అన్నా, మనుగడ కోసం పోరాటం అన్నా అవన్నీ ఇంకెవరికో చెందినవిగా చూడడం మనకు అలవాటు అయిపోయింది. వాటిపట్ల ప్రేక్షకులుగా ఉండడమే మన సహజ స్థితి అనుకుంటున్నాం.

సోమరితనం, మనను చెడగొట్టే సంపన్న, సౌభాగ్య సమాజపు శక్తి, లోకజ్ఞానం అనబడేది అన్ని కూడా మనం నిజంగా ఏ బీభత్సాన్నీ ఎదుర్కోబోవడం లేదని మనను నమ్మిస్తున్నాయి. ఏదో ఒకరకంగా పరిష్కారం కనిపెడతామని మనకు చెపుతున్నాయి. చారిత్రకంగానే ఆలోచనాపరులు సాధారణంగా తీసుకునే వైఖరి ఏమంటే, ఈ గందరగోళం నుంచి ఏదో ఒకరకంగా వ్యక్తులుగా మనం బయట పడగలమనే.

ఇంగ్లిష్ చరిత్రకారుడు ఆర్నాల్డ్ టాయిన్ బీ మహారాణి విక్టోరియా సింహాసనాన్ని అధిష్టించిన అరవై సంవత్సరాలకు 1897 జూన్‌లో అయిదు రోజుల పాటు జరిగిన ఉత్సవాల గురించి రాశాడు. తన మేనమామ భుజాల మీద కూచుని ఎనిమిది సంవత్సరాల పిల్లవాడిగా ఆ సైనిక కవాతును తాను ఎలా చూశాడో ఆయన గుర్తు చేసుకున్నాడు. చుట్టూ ఒక సాధారణ ఉద్రేక వాతావరణం చెలరేగిందని ఆయన రాశాడు. 'నాకు ఆ వాతావరణం గుర్తొస్తుంది. 'మనం ప్రపంచాన్ని శాసిస్తున్నాం. మనం శిఖరం మీద ఉన్నాం. మనం అక్కడే ఎల్లకాలమూ ఉంటాం. సహజంగానే చరిత్ర అనబడేది ఒకటుంది. కాని, ఈ చరిత్ర అనబడే దురదృష్టకరమైన వ్యవహారం ఇతరులకే జరుగుతుంది. మనం మాత్రం ఇలాగే ఆ చరిత్రకు దూరంగా, సుఖ సౌఖ్యాలతో ఉండిపోతాం' అని ప్రతి ఒక్కరూ అనుకుంటున్న వాతావరణం అది. కాని, గ్రేట్ బ్రిటన్ కూడా చరిత్రలో భాగమే'.

ఈ సుఖ సౌఖ్యాల యుగం అనే స్వప్నాన్ని మొదటి ప్రపంచ యుద్ధం పాశవికంగా ముగించేసింది. లోకజ్ఞానాన్ని అనుసరించడం అంటే, భవిష్యత్తుకు తయారుగా ఉండకపోవడమే అని మొదటి ప్రపంచ యుద్ధం నాటకీయంగా రుజువు చేసింది. అయితే మరొక అవకాశం కూడా ఉంది. మనం నివసిస్తున్న సమాజపు వాస్తవాన్ని అర్థం చేసుకోవడం, దానిలోని వైరుధ్యాలను వివరించడం, మెరుగైన దానికోసం పోరాడడం అనే ఆ భిన్నమైన అవకాశాన్ని అక్టోబర్ విప్లవం చూపింది.

ఈ పుస్తకం ఈ కింది ప్రశ్నలకు సమాధానాలను వెతకడానికి ప్రయత్నిస్తుంది.

- సమాజపు వాస్తవికతను అర్థం చేసుకోవడానికి శాస్త్రీయ సంవిధానం అనేదేదైనా ఉందా?
- దాని విశ్లేషణలను మనం రుజువు చేయగలమా?
- రానున్న కొన్ని దశాబ్దాలలో ప్రపంచంలో ఏమి జరుగనుంది?
- చరిత్రలో జోక్యం చేసుకోవడానికి మన దగ్గర ఉన్న పరికరాలు ఏమిటి?
- మానవ జాతి ఉమ్మడి మంచి కోసం సహకరించుకోగలిగిన ఒక సమాజాన్ని రూపొందించగలమా?

మన యుగంలోని అతి ఘోరమైన చెడులను ప్రకృతి కల్పించలేదు. అవి విధి ఫలితాలు కావు. అవన్నీ కూడా మన సమాజం నిర్మించబడి ఉన్న పద్ధతి వల్ల తలెత్తినవే. మన సమాజం వర్గాలుగా విభజించబడి ఉంది. మన వర్గం లేదనుకోవడం, మన వర్గానికి వ్యతిరేకంగా పోరాడడం తెలిసి గానీ, తెలియక గానీ పాలకవర్గంతో కలిసిపోవడమే.

ఈ పోరాటంలో ఉండే ఇబ్బందులకు కమ్యూనిస్టులు తలవంచరు. ఎందుకంటే, 'కమ్యూనిస్టులు చరిత్ర లయను అర్థం చేసుకున్నారు. అంటే, వర్గ పోరాటపు గతితర్కాన్ని అర్థం చేసుకున్నారు. ఇది భౌతిక నియమమని గుర్తించి, తమ వ్యక్తిగత ప్రణాళికలను, కార్యక్రమాలను దానిలో లీనం చేశారు. చరిత్ర గతి సూత్రాలు తమ వ్యక్తిగత అభిరుచుల మీద ఆధారపడి ఉండవనే వాస్తవాన్ని, తమ నైతిక ప్రమాణాలకు లోబడవనే వాస్తవాన్ని గుర్తించి, నిరాశపడకుండా ఉండడం నేర్చుకున్నారు. వారు తమ వ్యక్తిగత ఆకాంక్షలను చరిత్ర చలన సూత్రాలకు అనుగుణంగా ఉంచడం నేర్చుకున్నారు. అతి శక్తిమంతులైన శత్రువులను చూసి భయపడకుండా ఉండడం ఎలాగో వాళ్లు నేర్చుకున్నారు... వారు ఏటికి ఎదురీదడం నేర్చుకున్నారు'.

కొన్ని ఆదర్శాలు ఉన్నాయనీ, వాటికోసం పోరాడడం అర్థవంతమైనదనీ మనం నమ్ముతాం. అందుకే, ముందే లెనిన్ ఉటంకింపులో చెప్పినట్టుగా ఆదర్శాలు అవసరమైనవారినీ, ఆదర్శాలు లేకుండా మంచి బతుకు బతకలేని వాళ్లనూ ఉద్దేశించి మనం మాట్లాడుతాం. మనం అమాయకమైన ఊహాస్వర్గవాదులం కాదు.

'బృహత్తరమైన సన్నాహక చర్యలు, వాటి స్వభావం వల్లనే అజ్ఞాతమైన చర్యలు, అవసరమవుతాయని' మనకు తెలుసు. కానీ, మన లక్ష్యం స్పష్టమైనదయితే ఈ పని చేయడానికి, క్రమబద్ధమైన నిబద్ధత కలిగి ఉండడానికీ, పోరాటంలో పాల్గొనడానికీ యువతరంలో ఏ ఒక్కరూ భయపడరు.

మనను యుద్ధమూ, బర్బరత్వమూ నిండిన భవిష్యత్తుకు సంసిద్ధం చేయడానికి పాలకవర్గం ప్రయత్నిస్తోంది. మరొక వంక కమ్యూనిజం మన ముందర మరొక ప్రపంచం కచ్చితంగా సాధ్యమని చూపుతోంది. ఆ ప్రపంచంలో శ్రమ విభజనకు వ్యక్తి బానిసలాగా లొంగిపోవడం జరగదు. తద్వారా మానసిక, శారీరక శ్రమల మధ్య ఏర్పడిన వైరుధ్యం రద్దయిపోతుంది. శ్రమ ఆ ప్రపంచంలో కేవలం జీవనాధారంగా మాత్రమే ఉండదు. అది జీవితపు అత్యున్నత ఆకాంక్ష అవుతుంది. ఆ ప్రపంచంలో ఉత్పత్తి శక్తులు అద్భుతంగా వికసించి, వ్యక్తి సర్వతోముఖాభివృద్ధి చెంది, సహకార సంపద నిర్నిరామంగా, అనంతంగా ప్రవహిస్తుంది. అప్పుడు మాత్రమే పెట్టుబడిదారీ హక్కు అనే సంకుచిత దిగంతాన్ని సంపూర్ణంగా అధిగమించడం జరుగుతుంది. అప్పుడు సమాజం తన పతాకాల మీద ఒక నినాదాన్ని రాసిపెడుతుంది: 'ప్రతి ఒక్కరి నుంచి వారి శక్తి మేరకు. ప్రతి ఒక్కరికి వారి అవసరాల మేరకు.' ■

ప్రకృతితో సంఘర్షణ క్రమంలో తొలినాటి మనిషికి ఎదురైన అనేక ప్రశ్నలకు జవాబుగా ఎదిగిన ఆధ్యాత్మిక చింతన తర్వాతి కాలాలలో రాజ్యాధిపత్యానికి తోడ్పడిందని అంటున్నారు **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# ప్రాచీన మతాల పెత్తనం

**నా**గరికత అనేది మొదలవకముందూ, ఆ తరవాతా ఎన్నోరకాల మతవిశ్వాసాలు ప్రాచుర్యంలోకి వచ్చాయి. వాటిలో అనేకం అంతరించి పోయాయి. కొన్ని రూపాంతరం చెంది కొనసాగుతున్నాయి. ఒక్కొక్క మతంలోనూ రకరకాల ధోరణులుంటాయి. వాటిలో కొన్ని ఆటవికంగా అనిపిస్తే మరికొన్ని సంస్కారవంతంగా అనిపిస్తాయి. నిజం చెప్పాలంటే అన్నీ తప్పులతో కూడుకున్నవే. ప్రకృతిలో తమకు అర్థంకానివీ, తికమక పెట్టే సంఘటనలు జరిగినప్పుడు మనుషులు వాటికి వివరణలిచ్చుకునే ప్రయత్నాలు చేశారు. రుజువులు అవసరంలేని ప్రతిపాదనలను జనం మూకుమ్మడిగా నమ్ముతారనేది తెలిశాక ముందు పూజారివర్గాలూ, ఆ తరవాత పాలకవర్గాలూ మతాలను ఉపయోగించుకుని బడుగు ప్రజలని అనేక పద్ధతుల్లో అణగదొక్కడం మొదలుపెట్టారు. ఏం జరుగుతోందో గ్రహించలేని అధిక సంఖ్యాకులు ఇప్పటికీ మతాల పేరిట దోపిడీకి గురవుతూనే ఉన్నారు.

మతవిశ్వాసాల్లో స్థానికంగా తేడాలుండేవి. ప్రాచీన కాలంలో చైనా వంటి ప్రదేశాల్లో అనేకరకాల దైవికశక్తులను ఆరాధించేవారు. ప్రకృతినీ, రకరకాల చెట్లనూ, జంతువులనూ (మనవాళ్లు పాములనూ, నందీశ్వరుణ్ణీ), తెగల చిహ్నాలనూ, దయ్యాలనూ, భూతాలనూ, తమ పూర్వీకులనూ, సంతానోత్పత్తిని సూచించే జననేంద్రియాల గుర్తులనూ (మనవాళ్లకు శివలింగం) అన్నిటినీ పూజించేవారు. కొద్దిపాటి తేడాలతో ఇలాంటి వైఖరులు ప్రపంచంలో చాలాచోట్ల తలెత్తాయని తెలుస్తోంది. కొన్ని తెగల్లో ఒక్కొక్క తెగకూ, ఒక్కొక్క కుటుంబానికీ, ఇంటికీ (ఇలవేలుపు) కూడా దేవతలుండేవారు. కొన్ని సందర్భాల్లో ఈ దైవిక శక్తులకూ, చనిపోయిన పూర్వీకులకూ సంబంధం ఆపాదించేవారు. ఈ శక్తులకు సామాన్యంగా కరుణ అనేది ఉండేదికాదు. అందుచేత వాటికి శాంతులు జరిపి మంచి చేసుకోవడం అవసరమని భావించేవారు. దేవతలకు కూడా మనలాగే ఆకలి ఉంటుంది కనక వాళ్లకు బలులూ, నైవేద్యాలూ ఇస్తూ ఉండాలి. మొత్తంమీద ప్రపంచం (అంటే ప్రకృతి) తమ అధీనంలో లేదనే భావన ప్రాచీన తెగలకు ఉండేది. ఆ పరిస్థితిలో మతవిశ్వాసాలూ, తంతులూ వారిని ఏకం చేసి, కొంత సాంత్వన కలిగిస్తూ ఉండేవి.

తరాలు గడుస్తున్నకొద్దీ ఈ తంతులు ఎలా మొదలయాయో, వాటివల్ల ఉపయోగమేమిటో ప్రశ్నించడం జరిగేదికాదు. గుడ్డిగా వాటిని అనుసరించడమే ఒక సంస్కారంగా రూపొందసాగింది. సుమేరియన్, ఈజిప్ట్ వంటి ప్రాచీన నాగరికతలు అవతరించేనాటికే ఈ పూజా కార్యక్రమాల తంతులు వ్యవస్థాపితమై, వాటికి ఎదురు లేకుండా పోయింది. పదులసంఖ్యలో ఉండిన ప్రజలు వందల, వేల సంఖ్యలో పాల్గొనే దశకు వచ్చేటప్పటికి మతవిశ్వాసాలకు ఎంతో బలం చేకూరడంతో ఎవరూ ఎదురు ప్రశ్నలు వేసే సాహసం చెయ్యలేదు. అయితే తెగలన్నీ కలిసి జాతులుగా ఏర్పడి, ఐకమత్యాన్నీ, బలాన్నీ పొందడానికి ఈ సామూహిక తంతులు చాలా దోహదం చేశాయి.

పశ్చిమాసియాలోని సుమేరియన్ నాగరికత ఆరంభమైన తరవాత ఈజిప్ట్, టర్కీ, మధ్యధరా సముద్ర ప్రాంతాలూ, ఇజ్రాయెల్, పర్షియా, గ్రీస్ మొదలైన దేశాలన్నిటిలోనూ నాగరికతలు తలెత్తాయి. ఈ ప్రాంతాలన్నిటి లోనూ పుట్టి పెరిగిన ఆదిమతెగలన్నీ పరస్పర ప్రభావాలకు లోనవుతూ, సమాజంలో వ్యవసాయం వంటి కొత్త పద్ధతుల వల్ల ఏర్పడిన ఆర్థిక సంబంధాల పరిణామాలకు స్పందిస్తూ నాగరికతలు నిర్మించుకున్నారు. వీటన్నిటిలోనూ తిండికీ, నీటికీ, నివాసాలకూ ఏర్పాట్లే కాక ఆరాధనా స్థలాల నిర్మాణం కూడా జరిగింది. ప్రజల్లో కాయకష్టం చెయ్యనవసరం లేనటువంటి వర్గాలు రూపొందాయి. వీటిలో అధికారమంతా పాలక, అర్చక వ్యవస్థలకు చెందిన వ్యక్తులదే. ఆదిమ తెగల్లో ఉండిన ఒకప్పటి సర్వమానవ సమానత్వం క్రమంగా తగ్గిపోయి, పాలకులూ, పాలితులూ ఏర్పడ్డారు.



మాల్టా దీవిలో టార్షియెన్ దేవాలయం, సంతానవతి విగ్రహం (ఎడమ)

ఆలయ వ్యవస్థల స్వరూపంకూడా కాలంతోబాటు మారుతూ వచ్చింది. మధ్యధరా సముద్రంలోని మాల్టా దీవిలో క్రీ.పూ. 2800 ప్రాంతాల నిర్మించిన టార్షియెన్ దేవాలయ శిథిలాలను ఇటీవల పునర్నిర్మించారు (పటం). దీనితో పోలిస్తే క్రీ.పూ.1244 ప్రాంతాల ఈజిప్టోని మొదలైన అబూ సింబెల్ దేవాలయ నిర్మాణం మెరుగైనదిగా కనిపిస్తుంది (పటం). అందులో అప్పటి చక్రవర్తి రామెసీస్ విగ్రహాలు

బ్రహ్మాండమైనవి ప్రతిష్ఠితమై కనిపిస్తాయి. అంటే రాచరికవ్యవస్థ బలమైనదిగా తయారవడమే కాక, దానికి మతాధికారుల అండదండలు పుష్కలంగా లభించేవని తెలుస్తుంది. ఇదొక సామాజిక పరిణామం. ఏ నాగరికతలోనైనా జరిగినదిదే. సామాన్యులను మతవిశ్వాసాలద్వారా లోబరుచుకోవడం, అవే మతవ్యవస్థలు పాలకులకు మద్దతునివ్వడం పరిపాటి. ప్రజలను మానసికంగానూ, భౌతికంగానూ కూడా భయ భ్రాంతులకు గురిచెయ్యడమే ఈ వ్యవస్థల లక్ష్యం. ఇది ఈనాటికీ విజయవంతంగా కొనసాగుతూనే ఉంది. అంతేకాక, మొదట్లో చిన్నవిగా, ప్రజల అవసరార్థం ఏర్పాటైన గుడులన్నీ క్రమంగా క్రీ.పూ. 1244నాటికే పెద్దవిగా, బ్రహ్మాండమైనవిగా, మనుషులు వాటిముందు తాము మరుగుజ్జులమని భావించే స్థితికి ఎదిగిపోయాయి. ఇవన్నీ వారిని మానసికంగా బలహీనపరిచే పద్ధతులే.



ఈజిప్ట్‌లోని అబూ సింబెల్ దేవాలయం

ఏ యుగంలోనైనా ప్రజలు తమచుట్టూ ఉన్న ప్రపంచాన్నీ, తమ జీవితపు సమస్యలనూ గమనించి అర్థంచేసుకునేందుకు ప్రయత్నిస్తూనే ఉంటారు. నెత్తిన రాయి పడితే దెబ్బతగులుతుందనే విషయం తెలియడానికి వివరించవలసిన అవసరం ఉండదు. స్పష్టమైన ఆధారాలు భౌతికంగా కనిపించనప్పుడే కనబడని కారణాలు వెతుక్కోవలసివస్తుంది. అలాంటివాటికి మతవిశ్వాసాలు కొంత తోడ్పడేవి. ప్రతి సమస్యనూ కులపెద్దవద్దకో, గణాచారివద్దకో తీసుకెళ్లడం పరిపాటి అయింది. తెగల్లో వారికి ప్రాముఖ్యత పెరగసాగింది. ఎటొచ్చీ కాలంతోబాటు మనుషులకు ప్రకృతి రహస్యాలు అవగతం అవుతున్నకొద్దీ వారిని మభ్యపెట్టేందుకు అర్చకవర్గాలు మరింత కష్టపడవలసివచ్చింది.

మనం చచ్చిపోయాక ఏమవుతుంది? పంటలెందుకు పండటం లేదు? అతివృష్టీ, అనావృష్టీ ఎందుకొస్తాయి? ఈ లోకంలో మనుషుల స్థానం ఎటువంటిది? కష్టసుఖాలు ఎందుకు కలుగుతాయి? రోగాలూ రొష్టులూ కొందరికే ఎందుకొస్తాయి? ఇటువంటి సందేహాలు కలుగుతూ ఉండేవి. వీటికి సమాధానాలు చెప్పేటప్పుడు అర్చకవర్గాలు పూజలనూ, శాంతులనూ ప్రస్తావించి ఆ తంతుల్లో తమకు ముఖ్యపాత్ర ఉండేట్టుగా జాగ్రత్త పడ్డాయి. తంతువల్ల సత్ఫలితం కలిగినట్టుగా తోస్తే వారి బలం పెరిగేది. అనుకున్నది జరగకపోతే మరేదో కారణం చెప్పేవారు. హేతువాదం, భౌతికవాదం బలపడితే మతాల ప్రాబల్యం తగ్గిపోతుందని వారికి తెలుసు. సామూహిక సంక్షేమం కోసం కొన్ని తంతులు యథావిధిగా జరగవలసిందేనని నిర్ణయించారు. వీటివల్ల పూజాది కార్యక్రమాలు తప్పనిసరి అనీ, అర్చక, ఆలయ వ్యవస్థలన్నీ జీవితానికి అత్యవసరమనీ ప్రజలు నమ్మసాగారు. ఇది అయిదు వేల ఏళ్లుగా ఈనాటికీ కొనసాగుతున్న వ్యవహారం. పైగా ఇదంతా ఒక్కొక్క ప్రాంతంలోనూ ఒక్కొక్క పద్ధతిలో మొదలవడంతో ఈ తంతులన్నిటికీ గుర్తింపు ఏర్పడింది. ఇదే సంస్కృతి అనీ, నాగరికత అనీ, తమ జాతికి నిర్వచనమనీ ప్రజలు నమ్మే స్థితికి చేరుకున్నారు.



ప్రాచీన ఈజిప్ట్ అర్చకులు

కాలం గడిచేసరికి ఈ తంతుల వ్యవహారమంతా సామాన్యుల మెడకు గుదిబండలాగా తయారయింది. ఆలయవ్యవస్థలు శాశ్వతం అయిపోయాయి. వాటి పోషణకై మడులూ, మాన్యాలూ అన్ని నాగరికతల్లోనూ ఉండేవి. దేవుడి విగ్రహాలు ఏమీ ఖర్చుపెట్టవు కనక అర్చకుల ఖర్చులన్నీ అలాగే తీరుతూ ఉండేవి. తిని కూర్చోవడమేకాక వారు రకరకాల సంప్రదాయాలను సృష్టించి, వాటితో నిత్యమూ ప్రజల సంరక్షణ నిర్వహిస్తున్నట్టు నటించడం పరిపాటి అయింది. వారికి శారీరకబలం ఉండేది కాదు కనక బలవంతుడైన పాలకుడి ఉనికికి వారు ఆధ్యాత్మికంగా మద్దతునిచ్చేవారు. వారి ధర్మమా అని పాలకులంతా దైవాంశ సంభూతులనే భావన ప్రతి నాగరికతలోనూ తప్పనిసరిగా ఉండేది. ప్రజలను అణచడానికి తగిన భౌతిక, ఆధ్యాత్మిక పునాదులన్నీ ఏర్పడ్డాయి.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

## వీక్షణం ఆగస్ట్ 2010 సంచికలో వచ్చిన ఆజాద్ వ్యాసం 'మావోయిస్టులు కోరేదేమిటి?'కి స్పందనగా

# కె. నరేంద్రమోహన్ చర్చా లేఖ

అమరుడైన మావోయిస్ట్ పార్టీ నాయకుడు చెరుకూరి రాజ్ కుమార్ రాసిన 'మావోయిస్టులు కోరేదేమిటి?' వీక్షణం, ఆగస్ట్ 2010 లో వచ్చిన వ్యాసం మీద సుదీర్ఘంగా చర్చ జరపవలసిన అవసరం ఎంతో ఉంది. వ్యాసం మొత్తంలో సాగిన ధోరణి (టోన్) చాలా ఆహ్వానించదగినది. 'సామ్రాజ్యవాద ఏజెంట్లు', 'పెట్టి బూర్జువా అవకాశవాదులు' వంటి పదజాలం వాడకుండా విషయాన్ని చర్చించారు. అదే సమయంలో ఈ సమాధానంలో పేర్కొన్న ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లి వ్యాసాలు, ఆ సంచికకు అటు ఇటుగా బాలగోపాల్ రాసిన మరొక వ్యాసం (ఫిజియోనమి ఆఫ్ వయలెన్స్, ఇ.పి.డబ్ల్యు., జూన్ 3, 2006) ప్రభుత్వానికి, మావోయిస్టులకు ప్రముఖులు రాసిన బహిరంగ లేఖలను కూడా ప్రచురించి ఉంటే వాదనకు రెండు పక్షాలను తెలుసుకునే వీలుండేది.

ఉద్యమ పరిజ్ఞానం ఉండి, మౌలిక మార్పు కోరుకునేవారు, రాజ్‌కుమార్ రాసిన చాలా విషయాలతో ఏకీభవించాలి. ముఖ్యంగా ఎన్.జి.ఒ.లు ద్వారా విస్తరిస్తున్న పోస్ట్ మోడర్న్ వాదం సమస్యలను కేవలం స్థానిక విషయాలుగా చూసే దృక్పథం, ప్రభుత్వ అణచివేతకు మావోయిస్ట్ పార్టీ చర్యలను కుంటి సాకుగా వాడుకుంటున్న వాస్తవం వంటివి. అణచివేతకు కారణం కేవలం హింసే అయితే రాయలసీమ ప్రాంతంలో గాని, గుజరాత్ మారణకాండ తరువాత గాని ఎంతో పెద్ద ఎత్తున అణచివేత ప్రయోగించి ఉండాలి. కాని అటువంటి హింస వలన ప్రస్తుత వ్యవస్థకు వచ్చిన ప్రమాదం ఏమీ లేదు కాబట్టి సిబిఐ కేసులతో, విచారణ కమిషన్‌లతో కాలయాపన జరపవచ్చు. మరో వైపు ఉద్యమాల మీద సాగిస్తున్న దురాగతాలను తీవ్రవాద వ్యతిరేక చర్యలుగా, ఎదురుకాల్పులుగా ప్రచారం చేయడం దేశ వ్యాప్తంగా జరుగుతున్నదే.

అదే సమయంలో వ్యాసంలో ప్రశ్నించవల్సిన విషయాల గురించి మౌనం వహించడం అంతిమంగా సమాజానికి, ఉద్యమ లక్ష్యాలకు నష్టం కలిగిస్తుంది. పౌర సమాజంతో సంభాషణ జరుపుతున్న రాజ్‌కుమార్ వంటి నాయకుని హత్య (ఇది నిజమైన ఎన్‌కౌంటర్ అంటే బడి పిల్లలు కూడా నమ్మరు) – కాల్పుల విరమణ, చర్చల ప్రయత్నాలు జరుగుతున్న తరుణంలో – చేయడం వెనుక ఉద్దేశం మావోయిస్ట్ పార్టీని సైనిక/టెరరిస్ట్ చర్యలకు పరిమితం చేసి రాజకీయ సమస్యగా ఎదగకుండా నివారించడం అని భావిస్తున్నాను. ఈ దేశంలోని ప్రభుత్వాలు ఉద్యమాలను ఆయుధాలపరంగా ఎదుర్కోగలవు గాని, మౌలిక ఉద్యమాలు వేసే రాజకీయ సవాళ్లను ఎదుర్కోలేవు. పర్యావరణం, సామ్రాజ్యవాదం, సాహిత్యం, తత్వశాస్త్రం, మానవ హక్కుల వంటి విషయాల విశ్లేషణ కంటే రాజకీయ ఆచరణ, విమర్శ ప్రధానం అనే భావనతో రాజ్‌కుమార్ రాసిన వ్యాసాన్ని, నాకు తెలిసిన విషయాల మేరకు, పరిశీలించే ప్రయత్నం చేస్తున్నాను.

ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ (జూలై 22,2006) సంచిక లోని మొత్తం తొమ్మిది మంది వ్యాస రచయితల్లో, సిపిఎం నాయకుడు ఏచూరి సీతారాం ఒక్కడినే రాజకీయ వ్యతిరేకిగా భావించవచ్చు. సుమంతా బెనర్జీ, మనోరంజన్ మొహంతి వంటి వారు నక్సలైట్ ఉద్యమ సమర్థకులు కాగా, బాలగోపాల్ వంటి వారు, సిద్ధాంతపరంగా విభేదించినా, సానుభూతిపరులు. మొత్తం మీద వ్యాసకర్తలెవరూ సంఘ్ పరివార్, కె.పి.ఎస్. గిల్ వంటి బద్ధ వ్యతిరేకులుకారు.

సాగర్ (ది స్ప్రింగ్ అండ్ ఇట్స్ థండర్) రూపంలో పోలికల ఆధారంగా ప్రకటించిన రాజకీయ కలగూర గంప వంటి భావాలను, తిలక్ గుప్త (మావోయిజం ఇన్ ఇండియా) అభివృద్ధి చెందిన ప్రాంతాల్లో మిగులు భూములు అట్టే లేవు అన్న అభిప్రాయాన్ని చాలా న్యాయంగానే ఖండించారు. 'అభివృద్ధి చెందిన' అనబడే ప్రాంతాలు అన్ని ఒకే రకంగా లేవు. చిన్న, మధ్య తరహా కమతాల నుండి వందల ఎకరాలు బినామీ గానో, తోటల కిందో, మత సంస్థల ఆధీనంలోనో ఉన్న భూములు ఆ ప్రాంతాల్లో ఉన్నాయి. గ్రామ సంఘాలు ఏర్పడితే ఎవరి ఆధీనంలో ఎంత భూమి ఉందో తెలుస్తుంది. అదే సమయంలో రాజ్‌కుమార్ వ్యాసంలో వ్యతిరేకించ వలసినవి 'స్ట్రా పర్సన్' వాదనా పద్ధతి, అంటే తాము వ్యతిరేకించే వాదనను తామే నిర్మించి దానిని ఖండించడం. రెండవది నిర్దిష్టమైన ప్రశ్నలకు నిర్దిష్టమైన జవాబులకు బదులుగా సాధారణ సూత్రాలు/అవగాహనలను సమర్థింపుగా ఉపయోగించడం. మొత్తం మీద ఈ రచనల మీద వ్యాసకర్త చేసిన విమర్శల/అభియోగాల సారాంశం ఇది.

- లిబరేషన్స్, కాను సన్యాల్ రివిజనిస్ట్ పార్టీలు, వాటి తోటి మావోయిస్ట్ పార్టీని మనోరంజన్ మొహంతి (ఛాలెంజెస్ ఆఫ్ రెవల్యూషనరీ వయలెన్స్) సమానం చేసారు. అన్ని మావోయిస్ట్–లెనినిస్ట్ గ్రూప్‌లు సమానమైన బలంతో ఉన్నయని శత్రువులు కూడా అనని మాట అన్నారు.
- సాగర్ ఎన్నికలను ఆదర్శీకరించారు. సాయుధ పోరాటానికి, ప్రజా కార్యాచరణకు పోటీ ఉన్నట్లు చూపారు. ఆదివాసీ సంస్కృతిని ఆదర్శీకరించారు. ఆ సంస్కృతి ప్రజాస్వామీకరణను వ్యతిరేకించారు. (సాగర్, ది స్ప్రింగ్ అండ్ ఇట్స్ థండర్) (బేలా భాటియా, ఆన్ ఆర్మ్‌డ్ రెసిస్టెన్స్).
- మరి కొందరు ఉద్యమంలోని లోపాలను ఎత్తి చూపుతూ మొత్తం మార్గాన్నే కొట్టివేయడానికి ప్రయత్నించారు. తిలక్‌గుప్త అంతర్జాతీయంగా మార్పులు వచ్చాయని సామ్యవాదం తిరోగమించిందని అన్నారు, కానీ సామ్రాజ్యవాదం మౌలికగా మారలేదు. జరిగిన ఈ మార్పులు విస్తారమైన, ఎక్కువ లోతైన సాయుధ ప్రతిఘటనను కోరుతున్నాయి.
- ఆయన మావోయిజం అనే మాట వాడకం మీద సందేహాలు వ్యక్తం చేసారు. మావోయిస్ట్ పార్టీ మౌలిక అవగాహననే ప్రశ్నిస్తునారు.
- బాలగోపాల్ వ్యాసంలో (మావోయిస్ట్ మూవ్‌మెంట్ ఇన్ ఎపి) అస్తిత్వవాద–ఐడెంటిటి పోలిటిక్స్ – (గుర్తింపు వాదం అనాలేమో, ఎగ్జిస్టెన్షియలిజంని అస్తిత్వవాదం అంటున్నాం) మీద కేంద్రీకరించే ధోరణి ఉంది. సాగర్, నందని సుందర్, బాలగోపాల్ వ్యాసాలు ఎన్.జి.ఒ. సంస్థలు ప్రచారం చేసే ఆధునికానంతర దృక్పథానికి సంబంధించినవి. విప్లవపోరాటం వల్ల ఎక్కువగా నష్టపోయేది ప్రజలే అని అన్నారు.
- ప్రజాస్వామికవాదులకు ఉందని చెప్పుకునే స్థలం నానాటికి కుంచించుకు పోతోంది. వేరే ప్రత్యామ్నాయం చూపకుండా మావోయిస్ట్ పార్టీ మార్గాన్ని వ్యతిరేకిస్తున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో పెరుగుతున్న దారిద్ర్యం, ఆత్మహత్యల గురించి ప్రస్తావనే లేదు. సుమంతా బెనర్జీ (బియాండ్ నక్సల్బరీ) మావోయిస్ట్ హింసను ఇస్లామిక్ ఛాందసవాద హింసను ఒకే గాటన కట్టారు.
- పౌర సమాజం (సివిల్ సొసైటీ) అనేది పోస్ట్ మాడర్నిస్ట్ భావం. అది వర్గ విభజనను విస్మరిస్తుంది. దీనివల్ల ప్రజలు మవోయిస్టులకు ప్రభుత్వానికి జరిగే పోరాటం మధ్య నలిగిపోతున్నారు అనే తప్పుడు భావన కలుగుతుంది. రచయితలు పీడకుల హింసను ఆపడానికి, ప్రజలు న్యాయం పొందడానికి మార్గం చూపలేదు. పొరపాట్లు జరిగినా వాటిని దాచడానికి మావోయిస్ట్ పార్టీ ఎప్పుడూ ప్రయత్నించలేదు.

ఇవి ప్రధానంగా కనిపించే విషయాలు. వివరాలు తరువాత చూద్దాం.

ఈ విమర్శలలో కొన్నిటిని పరిశీలించే ప్రయత్నం చేస్తాను. ఇతర విషయాల గురించి తెలిసినవారు రాస్తే జరగవలసిన మేధోమథనం కొంత మేరకైనా జరుగుతుంది. మనోరంజన్ మొహంతి పార్టీల గురించి రాసినది '... తొలి దశ నక్సలైట్ ఉద్యమంలోని విభిన్న, శకలాల స్వభావం ప్రస్తుతానికి తగినంత సంఘటిత రూపాలు ఉన్న మూడు పాయలుగా – సి.పి.ఐ. (ఎం.ఎల్.) (లిబరేషన్), సి.పి.ఐ. (మావోయిస్ట్), సి.పి.ఐ. (ఎం.ఎల్.)గా రూపొందాయి. ప్రతి ఒక్కదానికి వాటి ప్రత్యేక రాజకీయ కార్యక్రమాలు ఉన్నాయి...'

మూడు సంఘటిత నిర్మాణాలు ఉన్నాయి అని రాసారేగాని వాటి శక్తిసామర్థ్యాల గురించి రాయలేదు. మొహంతి మొత్తం ఉద్యమం గురించి చేసిన ప్రధాన విమర్శలు ఇప్పటికి నిర్మాణ పూర్వపు (ప్రీ–ఆర్గనైజేషనల్), భావజాల సమాంతరం (ఐడియలాజికల్ పారలలిజం), చైనా విప్లవ భావాలను (ఫార్ములేషన్స్) యాంత్రికంగా ఉపయోగించడం, విప్లవ వ్యూహాన్ని కుదించి రూపొందించడం అనే ధోరణుల గురించి.

ఆజాద్ ఈ విమర్శలను గుర్తించకుండా కేవలం హింస మీద కేంద్రీకరించారని అభియోగం మోపారు. రైతుల ఆత్మహత్యల ప్రస్తావన ఆ రచయితలూ చేయలేదు గాని నక్సల్ ఉద్యమానికి ఉన్న సామాజిక నేపథ్యంగా ఉన్న గ్రామీణ ఆర్థిక దోపిడీ, సామాజిక అణచివేత, వనరుల దోపిడీలను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వ్యాసకర్త లందరూ గుర్తించారు. వాటికీ జవాబుగా ఆజాద్ ప్రకటించిన విశ్లేషణ, రాజకీయ కార్యక్రమం మావోయిస్ట్ పార్టీకే పరిమితం కాదు. విశాలంగా అది నక్సలైట్ పార్టీల ఉమ్మడి అవగాహన. ఏచూరి సీతారాంను పక్కనబెట్టినా, మిగిలిన రచయితలెవరు ఈ కార్యక్రమాన్ని పెద్దగా ప్రశ్నించలేదు. చర్చ ప్రధానంగా నడిచింది, ఈ కార్యక్రమంలో మావోయిస్ట్ పార్టీ ఆచరణ మీద దానిలో భాగంగా, హింస మీద. మనోరంజన్ మొహంతి మిగిలిన నక్సలైట్ పార్టీల చరిత్ర, కార్యక్రమాల గురించి ప్రస్తావించగా, వాటిలో లిబరేషన్, కాను సన్యాల్ నాయకత్వంలోని ఎం.ఎల్. పార్టీలన్నిటిని రివిజనిస్ట్ పార్టీలుగా సాగర్ వర్ణించారు. రివిజనిజం అన్న పదానికి విస్తృత అర్థం వాడుకలో ఉన్న భావాలను ప్రశ్నించడం లేక తిరిగి రాయడం అని. కమ్యూనిస్ట్ రాజకీయాలలో ఉన్న నిందాపూరిత రూఢి అర్థం ప్రాథమిక అవగాహనలు తిరగతోడడం అంటే జర్మనీలో సోషల్ డెమోక్రాట్ నాయకుడు బెర్నిస్టిన్ ప్రతిపాదించిన, పార్లమెంట్‌లో సంస్కరణల ద్వారా సామ్యవాదం సాధ్యం అనే వాదన లేక కృశ్చేవ్ 'శాంతియుత పరివర్తన', 'ప్రజలందరి పార్టీ' వంటి భావాలు.

ఇక్కడ చూడవలసినది పార్టీలు విప్లవ పంథా నుండి కొంత పక్కదారి (డీవియేషన్) పట్టాయా అని కాదు, పూర్తిగా దారి మళ్లించాయా (డిపార్చర్) అన్నది. ఆ రెండు పార్టీల ఆచరణ గురించి మావోయిస్టుల అభిప్రాయం ఏదైనా కావచ్చు కాని, వాటిపై రివిజనిస్టులనే ముద్ర ఎలా వేయగలరనే ప్రశ్నకు సూత్రబద్ధమైన జవాబు ఏది లేదు.

ఇక సాగర్ ఎన్నికలను, ఆదర్శీకరించారనే అభియోగానికి కూడా ఆధారం కనిపించదు. ఎన్నికల గురించి సాగర్ రాసినది 'మావోయిస్టుల వైఖరికి సంబంధించిన మరొక చిక్కుముడి ఎన్నికల గురించి. ఎన్ని లోపాలూ, లొసుగులూ ఉన్నప్పటికీ ఎన్నికలనేవి భారత ప్రజలు వారి పాలకవర్గాల నుంచి లాక్కొన్న ఒక ప్రజాస్వామిక రాయితీ. అలాగే అవి వలసవాదానికి వ్యతిరేకంగా భారత స్వాతంత్ర్య పోరాట వారసత్వం'.

దానిలో లోపాలు, లొసుగులతో నిండి ఉన్నప్పటికీ ఎన్నికలు ప్రజలు సాధించుకున్న రాయితీ అన్న అభిప్రాయం సరైనదా కాదా అని విశ్లేషించవచ్చు కానీ మినహాయింపులు, పరిమితులు విధించి చేసిన ప్రకటన, ఎన్నికలను ఆదర్శీకరించడం ఎలా కాగలదు? ఆజాద్ చేయ వలసిన పని ఎన్నికల బహిష్కరణ అనేది ఒక శాశ్వత ప్రక్రియగా, వ్యూహంలో భాగంగా ఎలా సరైనది అని వివరించడం.

బాలగోపాల్ రచనలో అస్తిత్వవాద (గుర్తింపు) రాజకీయ ధోరణి ఉంది. అలాగే ఇతరులు వ్యక్తం చేసిన పౌర సమాజం (సివిల్ సొసైటీ) అనేది పోస్ట్‌మాడర్న్ భావాలు అని అనడం కూడా సరి కాదు.

బాలగోపాల్ తన రచనలో అస్తిత్వం (గుర్తింపు) గురించి 'రెండు పక్షాలలోనూ పునరాలోచన గురించి సూచనలు లేవు గనుక భవిష్యత్తు గురించి ఆశను వ్యక్తం చేసే పునాది ఏమీ లేదు. విషాదం ఏమిటంటే కులాలుగానూ, వర్గంగానూ సమాజంలోని అట్టడుగు శ్రేణులకు చెందిన లక్షలాది మంది ప్రజల జీవితాలు దీనిలో భాగమయ్యాయి... వారు తమ వర్గానికి చెందిన సజీవ నాయకులు. వారు తమ ఇష్టపూర్తిగా ఒక రాజకీయ మార్గాన్ని ఎంచుకున్నారు... ఆ ఎంపిక తప్పొప్పులను బట్టి ఆ సజీవ నాయకత్వ నిర్మూలన అనే విషాదాన్ని చర్చించలేం...'

సజీవ అంతర్భాగ (ఆర్గానిక్) నాయకులూ అనే భావం గ్రాంసీ నాటి నుండి మార్క్సిస్ట్ ఆలోచనా స్రవంతి లో ఉంది. వర్గేతర గుర్తింపుకు (కులం, తెగ) కూడా దీనిని వర్తింపచేయడం, వర్గ గుర్తింపును నిరాకరించడం కాదు, ఒక నిర్దిష్టతను (పర్టిక్యులారిటీని) ఆమోదించడం.

మొత్తం వ్యాసాలలో ఉన్న సాధారణ అంశం విప్లవాన్ని బలపరిచే వారిని ఆందోళన పరుస్తున్న మావోయిస్ట్ హింస, ప్రజా సమూహాలను ప్రేక్షకులుగా మిగిల్చే కార్యాచరణ మావోయిస్టులు చేపట్టారనే విమర్శ. దీనికి ఆజాద్ ఇచ్చిన జవాబు....'మా నమూనాలో ప్రజలదే ప్రధాన పాత్ర. వారి సృజనాత్మక. చొరవను సంపూర్ణ స్థాయికి విడుదల చేయడమే మా ఆకాంక్ష....' '...మావోయిస్టుల హింస అనేదేదైనా ఉంటే అది ఈ పీడకుల హింసకు జవాబుగా వస్తున్నదే...' ఆత్మరక్షణ కోసం కోవర్టులను, పోలీసు ఏజెంట్లను చంపవలసి వస్తుంది.

సాధారణ సూత్రాలుగా వీటితోటి ఇబ్బందిలేదు. కానీ నిర్దిష్ట ప్రశ్నలకు జవాబు కూడా నిర్దిష్టంగా ఉండాలి. బాలగోపాల్ వంటి వారు రాసిన సుదీర్ఘమైన రిపోర్ట్‌లలో కేవలం తమ మాట వినలేదని చంపిన ఉదాహరణలు, గతంలో పార్టీలో పని చేసి ఇప్పుడు పార్టీ పేరుతో వసూళ్లు చేస్తున్నందున చంపామని మావోయిస్ట్ పార్టీ స్వయంగా చేసిన ప్రకటనలు గాని, మల్హార్ రావ్, రాగ్యానాయక్ వంటి వారి హత్యలుగాని, ఆంధ్రప్రదేశ్‌లో (చెన్నారెడ్డి రెండవ ప్రభుత్వం ఏర్పడిన సందర్భంలో) ఎన్నికల ప్రచారం చేస్తున్న ఇతర విప్లవ పార్టీల కార్యకర్తలను నిర్బంధించడం, హింసించడం, ఎముకలు విరచడం, కాళ్లు చేతులు చివరికి తలలు నరకడం, ఇతర పార్టీ నాయకులను కూడా హత్య చేయడం, తమ ఉద్యమంలో చేరాలని వచ్చిన అమ్మాయిని గంటలకొద్దీ హింసించి చంపడం లాంటివి.

ప్రస్తుతం పోలీసు క్యాంపు వద్దకు వెళ్లారని, పోలీసులు ఇచ్చిన క్రీడా సామాగ్రి తీసుకున్నారు కాబట్టి ఇన్ఫార్మర్లని చంపడం, అలాగే ఈ.పి.డబ్ల్యూ. (ఓపెన్ లెటర్ టు ది గవర్నమెంట్ అండ్ మావోయిస్ట్స్, జూలై 8–15, 2006) ప్రచురించిన బహిరంగ లేఖలో పదముగ్గురిని చంపడం వంటి సంఘటనలకు ఈ సాధారణ సూత్రం ఎలా వర్తిస్తుంది? ఒకవేళ గతంలో దొంగ నక్సలైట్లను చంపామని చెప్పదలిస్తే, ఆ సంస్థలకు నాయకత్వ స్థానాల్లో ఉన్నవారితో కలిసే ప్రభుత్వంతో చర్చలు జరిపారుగదా?

మిత్రులుగా ఉండదగినవారి పట్ల కూడా శత్రుభావంతో వ్యవహరించే ఆచరణనే సుమంతా బెనర్జీ మత ఛాందసవాదులతోటి, ఎల్.టి.టి.ఇ. తోటి పోల్చారు. '...శత్రు దాడికి ప్రతీకారం తీర్చుకోవాలనే ప్రయత్నంలో వారు పోలీసుల స్థాయికి దిగజారితే (రైల్వే స్టేషన్‌లను, పాఠశాల భవనాలను పేల్చివేయడం, అమాయక గిరిజన ప్రజలను చంపడం) వంటి సులభమైన లక్ష్యాల మీద విచక్షణారహితమైన దాడులకు దిగితే, ఇటువంటి చర్యలవల్ల సాధారణ ప్రజానీకానికి ఎదురయ్యే ఇబ్బందుల పట్ల నిర్లక్ష్యం వహిస్తే, శ్రీలంకకు చెందిన లిబరేషన్ టైగర్స్ ఆఫ్ తమిళ్ ఈలం, పశ్చిమాసియాలోని అనేక ఇస్లామిక్ మతఛాందస సంస్థల వంటి ముఠాల దారుణమైన టెర్రరిస్ట్ చర్యలకూ, వీరి చర్యలకూ తేడా చెరిగిపోతుంది...'

'సారాంశంలో పోలీసు, ఎల్.టి.టి.ఇ. ఛాందసవాదుల స్థాయికి దిగజారవద్దు అని విజ్ఞప్తి చేయడం వాళ్లతో ఒకే గాటన కట్టడం ఎలా అవుతుంది ?

చివరిగా తిలక్ గుప్తా ప్రస్తావించిన అంతర్జాతీయంగా విప్లవాల తిరోగమనం దశాబ్దాలుగా కార్యకర్తలను, రాష్ట్ర, కేంద్ర కమిటీలలో పని చేసిన వారిని కూడా కలవరపరుస్తున్న విషయం. దీనికి మొత్తం ఎం.ఎల్. ఉద్యమంలో ఉన్న సమాధానం 'రివిజనిజానికి వ్యతిరేకంగా రాజీ లేని పోరాటం' అనే, ఆచరణకు దారిచూపని, ఒక సాధారణ సూత్రం. తిరోగమనానికి ఇస్తున్న వివరణ సోవియెట్ యూనియన్‌లో స్టాలిన్ నాయకత్వం తరువాత కృశ్చేవ్ వర్గం, మావో తరువాత చైనా నాయకత్వం ద్రోహం చేయడం. మావోయిస్ట్ పార్టీ కూడా ప్రాథమికంగా ఇదే అవగాహన కలిగి ఉంది. (ఆర్టికల్ 12, పార్టీ ప్రోగ్రాం) దీనిలో ఏమైనా ఉండవచ్చుగాని, భావజాలానికి మూలం వ్యక్తుల్లో కాకుండా సామాజిక సంబంధాల్లో చూసే చారిత్రక భౌతికవాదం మాత్రం లేదు.

సోవియెట్ యూనియన్ చైనాలో విప్లవం రాజ్యాన్ని (స్టేట్) క్షీణింప చేసే బదులు నిరంకుశాధికార వక్రీకరణ (బ్యూరోక్రాటిక్ డిఫార్మేషెన్) దిశలో ఎందుకు పయనించాయి? ఆ వక్రీకరణకు మూలాలు కృశ్చేవ్, డెంగ్ వర్గాల కుట్రలోనా, వారికి మునుపే సామాజిక సంబంధాల్లో ఉన్నాయా? సామాజిక అస్తిత్వం, చైతన్యాన్ని నిర్ణయిస్తుందని అంగీకరించే భౌతికవాదులమైతే, సామాజిక పరిస్థితులలో ఆ మూలాలు వెదకాలి, లేదా కార్ల్ పోపర్ వంటి అనుభవవాదులు (ఎంపిరిసిస్ట్/పొజిటివిస్ట్) వాదించినట్లు విప్లవం అనివార్యంగా నిరంకుశత్వానికి దారితీస్తుందని అంగీకరించాలి. ఆ సమస్యను లేవనెత్తిన వారు విప్లవమార్గాన్ని ప్రశ్నిస్తున్నారనడం విశ్లేషణ అనిపించుకోదు.

ఇక్కడ ముఖ్యమైనది ఆజాద్ రాసినదానిలో లోపాలు ఎత్తిచూపడం కాదు. మన సామూహిక అజ్ఞానం ఎంత మేరకు ఉందో గుర్తించడం. విప్లవ మార్గంలో నిరాపేక్షగా సత్యాన్వేషణ జరపడం బాలగోపాల్ మరణం తరువాత విప్లవాభిమానులను అంతగా కృంగదీసింది రాజ్‌కుమార్ హత్య. స్వయంగా పరిచయం లేనప్పటికి కాలేజిలో చదువుతున్న రోజులలో, మా ఊరి యూనివర్సిటీ విద్యార్థులు రాజ్‌కుమార్ గురించి చెబుతుండే వారు. అటువంటి ప్రతిభావంతులను చంపితేగాని ఈ బతకలేని వ్యవస్థను ఎంత త్వరగా కూలిస్తే అంత మంచిది. వీ

## అణు పరిహార బిల్లుకు ఆమోదం

అణు పరిహార బిల్లు-2010ని లోక్‌సభ ఆగస్టు 25న ఆమోదించింది. విపక్షాల కోరిక మేరకు ఈ బిల్లులోని నిబంధన 17(బి)లోని వివాదాస్పద పదజాలాన్ని కేంద్ర ప్రభుత్వం ఉపసంహరించుకోవడంతో ప్రతిపక్షాలు మద్దతు పలికాయి. బిల్లులోని 17(బి) నిబంధనలో మొదట పేర్కొన్న సరఫరాదారు గానీ, సరఫరాదారు ఉద్యోగులు గానీ అణు కర్మాగారంలో ప్రమాదానికి ఉద్దేశపూర్వకంగా కారకులైనప్పుడు మాత్రమే వారి నుంచి నష్ట పరిహారాన్ని కోరవచ్చన్న వాక్యంలో.. ప్రతిపక్షాల సూచనల మేరకు.. 'ఉద్దేశపూర్వక' అనే పదజాలాన్ని ప్రభుత్వం తొలగించింది. ఆ ఒక్క మార్పుతో, కేంద్ర మంత్రివర్గం చేసిన 18 సవరణలతో కూడిన బిల్లుని కేంద్ర సహాయ మంత్రి చౌహాన్ ప్రవేశపెట్టారు.

## పోలీసులపై నమ్మకం పోతోంది

కస్టడీలో వేధింపులు, బూటకపు ఎన్‌కౌంటర్ల వల్ల పోలీసులంటే ప్రజల్లో నమ్మకం పోతోందని జాతీయ పౌర హక్కుల కమిషన్ చైర్మన్ కెజి బాలకృష్ణన్ అన్నారు. ప్రజల పట్ల మరింత స్నేహపూర్వకంగా మెలగాలని పోలీసులకు సూచించారు. నేరస్తులను ఏరివేయడానికి ఎన్‌కౌంటర్లను ఉపయోగించుకుంటున్నారనే అభిప్రాయం ఉందని ఢిల్లీలో జరిగిన డిజిపి, ఐజిల మూడు రోజుల సదస్సులో ఆయన మాట్లాడారు. గడిచిన మూడేళ్లలో కమిషన్‌కు మానవ హక్కుల ఉల్లంఘనకు సంబంధించి లక్షకు పైగా ఫిర్యాదులు అందాయని, వాటిలో 212 బూటకపు ఎన్‌కౌంటర్లకు చెందినవి ఉన్నాయని ఆయన వివరించారు.

## భోపాల్ తీర్పు పై పునఃసమీక్ష

భోపాల్ గ్యాస్ లీక్ కేసులో ఇచ్చిన తీర్పులోని సెక్షన్లను మార్చిన సుప్రీం కోర్టు తన నిర్ణయాన్ని పునఃసమీక్షించాలని నిర్ణయించింది. 1984 నాటి భోపాల్ గ్యాస్ లీక్ కేసులో 1996లో సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఎఎం అహ్మదీ, జస్టిస్ ఎస్‌బి మజుందార్‌లతో కూడిన బెంచ్ సెక్షన్ 304 పార్ట్ -2ను సెక్షన్ 304ఎ గా మార్చింది. సెక్షన్ల మార్పుతో నిందితులకు రెండేళ్ల శిక్ష మాత్రమే విధించారు. 15 వేల మంది మరణించిన, 5 లక్షల మంది తీవ్రంగా అనారోగ్యం బారిన పడిన ఈ కేసులో నిందితులకు పడ్డ నామమాత్రపు శిక్షతో దేశవ్యాప్తంగా నిరసనలు వెల్లువెత్తాయి. కనీసం పదేళ్ల శిక్ష పడాల్సిన ఐపిసి 304పార్ట్-2 కింద కేసును పునరుద్ధరించాలంటూ సిబిఐ క్యూరేటివ్ పిటిషన్ దాఖలు చేసింది. ఈ పిటిషన్ పై సుప్రీం ధర్మాసనం ఏడుగురు నిందితులకు ఆగస్టు 2న నోటీసులు జారీచేసింది.

## తినడానికి గింజలు లేవు

రాజస్థాన్‌లోని ఫాగి గ్రామస్థులు ఇప్పటి వరకు ప్రభుత్వం నుండి ఉచితంగా గోధుమలు పొందలేదు. ఆ గ్రామస్థులకు ఇప్పుడు ఉచితంగా బిఎస్ఎన్ఎల్ మొబైల్ కనెక్షన్లు, ఫోన్లు ఇస్తున్నారు. మాకు ఏదైనా పనిగానీ, తినడానికి నాలుగు గింజలుగానీ కావాలి తప్ప, ఈ మొబైల్ ఫోన్లతో ఏం చేసుకోవాలని బిపిఎల్ కార్డుదార్లు అంటున్నారు. తమ కార్పొరేట్ సామాజిక బాధ్యతలో భాగంగా వెయ్యి మంది బిపిఎల్ కార్డుదార్లకు బిఎస్ఎన్ఎల్ ఉచిత కనెక్షన్లు ఇచ్చింది. గోదాముల్లో గోధుమలు కుళ్లిపోతుంటే ప్రభుత్వం వాటిని తమకు ఇవ్వకుండా ఈ ఫోన్లు ఇవ్వడమేంటని అంటున్నారు.

## ఏవి ప్రజలకు ఉపయోగపడేవి?

జమ్మూకాశ్మీర్‌లోని లేహ్‌లో ఆగస్ట్‌లో కురిసిన భారీ వర్షాల కారణం వరదలొచ్చి అక్కడి ప్రజలు తీవ్ర ఇబ్బందులకు, భయాందోళనలకు గురయ్యారు. వారికి తక్షణ అవసరాలు తీర్చడానికి సాంకేతిక వ్యవస్థను, రవాణాను పునరుద్ధరించాల్సిన సమయంలో ప్రైవేట్ విమానయాన సంస్థలు, టెలికాం సంస్థలు సహాయ సహకారాన్ని అందించలేదు. కాని, ప్రభుత్వ రంగ సంస్థ బి.ఎస్.ఎన్.ఎల్. వరద సంభవించిన 24 గంటల్లోనే 35 శాటిలైట్ ఫోన్‌లను అందుబాటులోకి తెచ్చింది. లేహ్ నుంచి మిగతా ప్రపంచానికి సమాచారం అందించడంలో ఇది చాలా తోడ్పడింది. అదే సమయంలో లేహ్‌లో చిక్కుకున్న ప్రజలను అక్కడి నుంచి ఢిల్లీ తరలించేందుకు ప్రైవేట్ విమానయాన సంస్థలు టికెట్ ధరలను భారీగా పెంచాయి. సర్వీసులను కూడా తగ్గించాయి. కానీ, ప్రభుత్వ ఆధ్వర్యంలో నడుస్తున్న ఎయిర్ ఇండియా వేగంగా పనిలోకి దిగి, ఆందోళనకు గురవుతున్న ప్రయాణికులను అతితక్కువ ధరల్లో సేవలందించింది. ప్రకృతి వైపరీత్యాలు సంభవించినపుడు ప్రభుత్వ రంగ సంస్థలు మాత్రమే తమ సామాజిక బాధ్యతలు నెరవేరుస్తున్నాయి. ప్రైవేట్ సంస్థలు అన్ని సమయాల్లో లాభాలే ధ్యేయంగా నడుస్తున్నాయి.

## కుల గణనకు ఆమోదం

వివిధ రాజకీయ పార్టీల ఒత్తిడి మేరకు కుల ప్రాతి పదికన జనాభా లెక్కలు సేకరించాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఈ కుల గణన జనాభా లెక్కలతో సంబంధం లేకుండా నిర్వహిస్తారు. 2011 జూన్ నుండి సెప్టెంబర్ వరకు సాగుతుంది. సెప్టెంబర్ 9న జరిగిన కేంద్ర కేబినెట్ సమావేశ వివరాలను హోంమంత్రి పి. చిదంబరం వెల్లడించారు. చివరిసారిగా 1931లో మాత్రమే కుల ప్రాతిపదికన జనాభా లెక్కలను సేకరించారు.

## అయోధ్య భూ వివాదం

అయోధ్యలోని వివాదస్పద భూమి యాజమాన్య హక్కులకు సంబంధించి, అరవై ఏళ్లనాటి వ్యాజ్యాలపై అలహాబాద్ హైకోర్టు లక్నో ధర్మాసనం సెప్టెంబర్ 24న వెలువరించనున్న తీర్పును.... సెప్టెంబర్ 28కి వాయిదా వేసింది. అయోధ్య తీర్పును వాయిదా వేయాలని సుప్రీం కోర్టులో ప్రజా ప్రయోజనాల దృష్ట్యా స్పెషల్ లీవ్ పిటిషన్ దాఖలు చేశారు. ఫిర్యాదు దారుల వాదనలు వినడానికి తీర్పును సెప్టెంబర్ 28కి వాయిదా వేయాలని సుప్రీం కోర్టు అలహాబాద్ హైకోర్టుకు ఆదేశాలు జారీ చేసింది. మూడు అంశాలపై న్యాయస్థానం తీర్పు వెలువరించనుంది. 1) వివాదాస్పద స్థలంలో 1538 కంటే పూర్వం దేవాలయం ఉందా? 2) 1961లో బాబ్రీ కమిటీ దాఖలు చేసిన వ్యాజ్యం.. చట్టం నిర్దేశించిన కాల వ్యవధికి లోబడి ఉందా? 3) ఆక్రమణ ద్వారా స్థలాన్ని అధీనంలో ఉంచుకోవడం వల్ల ముస్లింలకు యాజమాన్య హక్కు సంక్రమించిందా?

## పెరిగిన ఎంపిల జీతాలు

పార్లమెంటు సభ్యుల జీతాలు గతంలో నెలకు 1లక్ష ఉండగా, ఇప్పుడు అవి ఏకంగా 4 లక్షలకు పెరిగాయి పెన్షన్ కూడా 8 వేల నుండి 20 వేలకు పెరిగాయి. ఈ జీతాల పెంపుదల 2009 నుండి వర్తిస్తుంది. ప్రస్తుత లోక్‌సభలో 543 మంది ఎంపిలకు గాను, 315 మంది కోటీశ్వరులు ఉన్నారు. వీరిలో 40 మంది మహిళలు ఉన్నారు. 2004 లోక్‌సభలో కోటీశ్వరులు 156 మంది ఉంటే, ప్రస్తుతం వీరి సంఖ్య 102 శాతం పెరిగింది.

## కాశ్మీర్ ఫార్ములా

కాశ్మీర్‌లో వంద రోజులకు పైగా కొనసాగుతున్న అల్లర్లను నివారించడానికి, చక్కదిద్దేందుకు కేంద్ర రక్షణ క్యాబినెట్ కమిటీ 8 అంశాలతో కూడిన కాశ్మీర్ ఫార్ములాను ప్రకటించింది. కాశ్మీర్‌లోని అన్ని వర్గాలతో చర్చలు జరిపేందుకు మధ్యవర్తుల బృందాన్ని ఏర్పాటు చేయడం. భద్రతా దళాల మోహరింపు అంశాన్ని సమీక్షిస్తామంది. కొన్ని ప్రాంతాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించడంపై సమీక్షించాలని రాష్ట్రప్రభుత్వానికి సలహా ఇవ్వనున్నట్లు కేంద్ర హోం మంత్రి చిదంబరం తెలిపారు. వీ

## పెరుగుతున్న రాజకీయ ఖైదీలు

ప్రపంచ వ్యాప్తంగా రాజకీయ ఖైదీల సంఖ్య పెరుగుతోంది. ప్రజా సమస్యలపై పాలకులను ప్రశ్నించినందుకు, వారికి వ్యతిరేకంగా పోరాడినందుకు, రాసినందుకు, ప్రజలను చైతన్యపరిచినందుకు ప్రజలను, జర్నలిస్టులను, పోరాట ఉద్యమ నాయకులను బంధించి హింసిస్తున్నారు. ఇటీవలి వరల్డ్ ప్రిసన్ పాప్యులేషన్ లిస్ట్ ప్రకారం ఆఫ్రికాలో 61 శాతం, అమెరికాలో 68 శాతం, ఆసియాలో 87 శాతం, యూరప్‌లో 65 శాతం, ఓషియానాలో 50 శాతం రాజకీయ ఖైదీల సంఖ్య పెరిగింది. టర్కీలోనే దాదాపు ఎనిమిది వేల మంది రాజకీయ ఖైదీలు జైళ్లలో మగ్గుతున్నారు. అండర్ ట్రయల్, శిక్షపడని వారే ఎక్కువగా ఉన్నారు. తీవ్రమైన చిత్రహింసలకు, దూషణలకు గురవుతున్నారు.

## ప్రజాపోరాట విజయం

మొజాంబికలోని మపూటో నగరంలో రొట్టెల ధరలను పెంచడంతో ప్రజలు ఆందోళన చేపట్టారు. తీవ్ర ఆర్థిక సంక్షోభంలో ఉన్న ప్రజలు 30 శాతం ధర పెరగడంతో ఆందోళనకు దిగారు. సెప్టెంబర్ మొదటివారంలో ప్రజలు నిరసన చేపట్టగా పోలీసులు కాల్పులు జరిపారు. ఈ కాల్పుల్లో 13 మంది వరకు మరణించారు. నాలుగు వందలకు పైగా గాయపడ్డారు. వెంటనే ప్రభుత్వం ధరలను తగ్గించింది. దీంతో పాటు ప్రభుత్వాధికారుల జీతాలు పెంచే ఉత్తర్వులను కూడా రద్దు చేసింది. తిండిగింజలు దిగుమతి చేసుకోవాల్సి రావడంతో ధరలను తగ్గించడం కష్టమవుతుందని ప్రభుత్వం తెలిపింది. ఆగ్నేయ ఆఫ్రికాలో 54 శాతం నిరుద్యోగం ఉంది.

## అమెరికా యుద్ధ ఖర్చు

అమెరికా ఇరాక్ యుద్ధంలో ఖర్చు పెట్టిన దానికంటే అఫ్ఘానిస్తాన్ యుద్ధంలో ఎక్కువ ఖర్చు పెడుతోంది. ఇరాక్‌లో ప్రతి నెలా 5.5 బిలియన్ డాలర్లు ఖర్చు పెట్టిన అమెరికా ఇప్పుడు అఫ్ఘానిస్తాన్‌లో 6.5 బిలియన్ డాలర్లు ఖర్చు పెడుతోంది. లక్షకు పైగా సైనికులు అఫ్ఘానిస్తాన్‌లో యుద్ధం చేస్తున్నారు. ఐక్య రాజ్య సమితి ప్రకారం జనవరి నుంచి జూన్ వరకు 1271 మంది సామాన్య ప్రజలు మరణించారు. రెండు వేల మంది గాయపడ్డారు. ఇందులో చాలా మంది మహిళలు, వృద్ధులు, చిన్న పిల్లలు ఉన్నారు. రోజు రోజుకూ అమెరికా యుద్ధ ఖర్చును ఇంకా పెంచుతోంది.

## ఇరాక్‌లో విచారణ ఖైదీలు

ఇరాక్‌లో సుమారు ముప్పై వేల మంది ఖైదీలు ఎలాంటి విచారణ లేకుండా జైళ్లలో ఉన్నారు. ఖైదీలకు సరైన వైద్య, న్యాయ సదుపాయం అందడం లేదని ఆమ్నెస్టి ఇంటర్నేషనల్ ఇటీవల విడుదల చేసిన నివేదికలో తెలిపింది. ఖైదీలను రహస్య జైళ్లలో ఉంచి తీవ్ర నిర్బంధాలకూ, చిత్రహింసలకూ గురిచేస్తున్నారనీ తెలిపింది. ఈ చిత్రహింసలు తాళలేక ఇప్పటికే చాలా మంది మరణించారనీ తెలిపింది. ఖైదీల శరీర సున్నిత భాగాలపై కరెంట్ షాక్‌లివ్వడం, వేళ్లు తొలగించడం, గోళ్లు పీకడం, దూషించడం వంటి చిత్రహింసలకు పాల్పడుతున్నారని తెలిపింది.

## తప్పకున్న ప్రచండ

నేపాల్ ప్రధాన మంత్రికి జరిగిన పోటీలో నేపాల్ మావోయిస్టు పార్టీ అధ్యక్షుడు పుష్ప కమల్ దహల్ ప్రచండ మరోసారి ఓటమి పాలయ్యారు. ఆయనకు అనుకూలంగా 252 ఓట్లు వచ్చాయి. దీంతో ఆయన ప్రధాని ఎన్నికల నుంచి తప్పుకున్నారు.

## ఆస్ట్రేలియా ప్రధాని జూలియా గిలార్డ్

ఆస్ట్రేలియాలో మైనారిటీ ప్రభుత్వం ఏర్పడింది. 150 పార్లమెంట్ సీట్లలో 74 సీట్లున్న లేబర్ పార్టీకి ఇద్దరు ఇండిపెండెంట్లు మద్దతు ఇవ్వడంతో సీట్ల సంఖ్య 76కు పెరిగింది. దీంతో ఒక్క సీటు ఆధిక్యంతో జూలియా గిలార్డ్ మైనారిటీ ప్రభుత్వం ఏర్పాటయింది. 1943 తర్వాత మైనారిటీ ప్రభుత్వం ఏర్పడడం ఇదే తొలిసారి.

## యుద్ధం ముగిసింది (?)

ఇరాక్‌లో యుద్ధం ముగిసిందని అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా సెప్టెంబర్ 1న ప్రకటించారు. 2003లో జార్జి బుష్ మొదలుపెట్టిన ఇరాక్ యుద్ధం ఏడేళ్లు సాగిందనీ, దీనికి అమెరికా భారీ మూల్యం చెల్లించిందని చెప్పారు. ఇరాక్ నుంచి దాదాపు లక్ష మంది సైనికుల్ని వెనక్కు పిలిచినట్టు చెప్పారు. కాని వాస్తవానికి ఇరాక్‌లో ఈ ఏడు సంవత్సరాలలో పదమూడు లక్షల మందికి పైగా మరణించారు. ఎంతో మంది క్షతగాత్రులయ్యారు. మూడు కోట్లున్న దేశ జనాభాలో మూడింట రెండు వంతుల మంది యుద్ధ పరిణామాలను ఎదుర్కొన్నారు. లక్షలాది మంది నిర్వాసితులయ్యారు. కాగా ఇరాక్‌లో ఇంకా యాభై వేల మంది అమెరికా సైనికులు తమ కార్యకలాపాలు కొనసాగిస్తున్నారు. ఈ యుద్ధం కోసం అమెరికా పెట్టిన ఖర్చు మూడు ట్రిలియన్ డాలర్లు. ఈ యుద్ధంలో సంయుక్త దళాల సైనికులు మరణించిన సంఖ్య 4500.

## ఫోన్సెకాకు జైలు శిక్ష

శ్రీలంక మాజీ ఆర్మీ చీఫ్, ప్రస్తుతం ప్రతిపక్ష పార్లమెంటేరియన్ శరత్ ఫోన్సెకాకు ఆయుధ కొనుగోలు అవినీతి కేసులో కోర్ట్ మార్షల్ మూడేళ్ల జైలు శిక్ష విధించింది. 18 సెప్టెంబర్‌న ఈ తీర్పు వెలువడింది. దీనిపై రెండవ కోర్టు మార్షల్ సిఫారసును దేశ అధ్యక్షుడు మహింద రాజపక్షేకు పంపుతారు. ఆయన ఆమోదం తర్వాతే ఫోన్సేకాపై శిక్షను అధికారికంగా ప్రకటిస్తారు.

## పరువు హత్యలు

ప్రపంచ వ్యాప్తంగా 'పరువు' హత్యల పేరుతో ప్రతి సంవత్సరం ఇరవై వేల మంది మహిళలను హత్య చేస్తున్నారు. ఇది ఒక వెనుకబడిన దేశాలలో, లేదా ముస్లిం దేశాలలోనే కాదు అభివృద్ధి చెందిన దేశాలు అమెరికా, బ్రిటన్, ఆస్ట్రేలియా తదితర దేశాలలో కూడా జరుగుతున్నాయి. మహిళలను పరువు పేరుతో అతి దారుణంగా శిక్షించి హత్య చేస్తున్నారు. ఎంతో మంది మహిళలు తమ తప్పు లేకుండానే శిక్ష పేరుతో అత్యాచారాలకు, ఆసిడ్ దాడులకు, హత్యలకు గురవుతున్నారు. ఈ హత్యల నివారణకు ప్రభుత్వాలు ఏ చర్యలు తీసుకోకపోవడంతో వీటికి మరింత ప్రోత్సాహం లభిస్తోంది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 ఆగస్ట్ 2010 నుండి 20 సెప్టెంబర్ 2010 వరకు అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1498)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 2 | 8 | – | 22 | 34 | 10 | 9 | 6 | 2 | 3 | – | – | 2 | 2 | 23 | 33 | – | – | – | 3 | 6 |
| హైదరాబాద్ | – | – | – | 11 | 8 | – | 1 | – | 1 | 7 | 1 | 9 | – | – | 44 | 26 | – | – | – | 8 | – |
| కరీంనగర్ | 2 | – | – | 27 | 35 | 22 | 34 | 2 | 1 | 9 | 2 | 4 | 4 | 18 | 27 | 56 | – | – | – | 4 | 1 |
| ఖమ్మం | – | 4 | – | 13 | 15 | 21 | 31 | 16 | 2 | 9 | 2 | 8 | 4 | 5 | 24 | 12 | – | – | 1 | – | 8 |
| మెదక్ | – | 4 | – | 7 | 12 | 4 | 14 | 3 | 1 | 2 | 2 | 5 | 2 | 14 | 29 | 26 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | – | – | 9 | 11 | 1 | 4 | 1 | – | 2 | 6 | 4 | 5 | 6 | 18 | 14 | – | – | – | – | – |
| వరంగల్ | – | – | – | 3 | 2 | – | – | 2 | – | 2 | – | 1 | – | 2 | 3 | 3 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 18 | 16 | 2 | 6 | – | 3 | 2 | 4 | 9 | – | – | 30 | 7 | – | – | – | – | 1 |
| కర్నూలు | – | 8 | – | 13 | 5 | 2 | 2 | 5 | 5 | 4 | 2 | 8 | 3 | 7 | 27 | 29 | – | – | – | 5 | 2 |
| తూర్పు గోదావరి | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| గుంటూరు | – | – | – | 3 | 7 | 18 | 10 | 1 | – | 1 | 2 | 2 | 1 | 4 | 32 | 15 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 10 | 7 | 4 | 2 | – | 2 | 4 | 5 | 4 | 4 | 6 | 28 | 22 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 8 | 5 | 12 | 9 | 12 | – | – | 6 | 11 | – | 3 | 19 | 8 | – | – | – | – | – |
| విశాఖపట్నం | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| విజయనగరం | – | – | – | 4 | 5 | 2 | 3 | 5 | 3 | 4 | 1 | 2 | 2 | 1 | 18 | 6 | – | – | – | – | 2 |
| **మొత్తం** | **4** | **24** | **–** | **148** | **162** | **98** | **125** | **53** | **20** | **49** | **33** | **67** | **27** | **68** | **322** | **257** | **–** | **–** | **1** | **20** | **20** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; వరంగల్ – ఎ.కుమార్; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; విశాఖపట్నం – కె.వి. అరుణ; విజయనగరం – డి. సుధాకర్

# విద్యార్థులకు వ్యాసరచన పోటీ

## వ్యాసరచనలో కృషి చేయదలిచారా?
## రండి, వీక్షణం సహకారం తీసుకోండి!

**ఒ**కరికి ఉండే భావాలను నలుగురితో పంచుకోవడానికీ, వివరించడానికీ, నిర్ధారించడానికీ, ప్రచారం చేసి వ్యాపింపజేయడానికీ, విశ్లేషించడానికీ, భిన్నమైన భావాలు గలవాళ్లతో వాదించడానికీ, చర్చించడానికీ, వాళ్ళను తమ భావాలవైపు ఆకర్షించడానికీ అత్యవసరమైనది వ్యాస ప్రక్రియ. వ్యాసం సమాచారాన్ని, వాస్తవికతను, వివరణను, వాదనలను, తర్కాన్ని, చర్చను, విశ్లేషణను, సూటిదనాన్ని ఆశ్రయిస్తుంది. అంటే వ్యాసం ద్వారా రచయితలు తాము చెప్పదలచుకున్న భావాలను భిన్నమైన అర్థం రావడానికి అవకాశం లేకుండా సూటిగా వివరించడానికి, చదువరులను ఒప్పించడానికి ప్రయత్నించవచ్చు. ఆధునిక వచనరచనా ప్రక్రియలన్నిటిలోకీ అతి ముఖ్యమైనదీ, ప్రభావశీలమైనదీ, సమర్థమైనదీ, ప్రయోజనకరమైనదీ వ్యాసప్రక్రియ.

తెలుగులో అత్యవసరమైన రాజకీయార్థిక, సామాజిక అంశాలను చర్చించడానికి ఏర్పడిన వేదిక, **వీక్షణం** సామాజిక శాస్త్ర పత్రికగా పూర్తిగా వ్యాసాలతోనే వెలువడుతున్నది. ప్రతినెలా పన్నెండునుంచి పద్నాలుగు వ్యాసాలతో గత తొమ్మిది సంవత్సరాలలో దాదాపు పదహారు వందల వ్యాసాలు ప్రచురించింది. ఈ వ్యాస రచయితలలో అప్పటికే వెయ్యి తిరిగిన, ఎన్నో వ్యాసాలు రాసినవారూ ఉన్నారు. **వీక్షణం** లోనే తమ మొదటి వ్యాసం అచ్చయి, వ్యాసరచనలోకి ప్రవేశించిన వారూ ఉన్నారు. వ్యాసరచయితలను తయారుచేసుకోవడంలో, ఉన్న వ్యాసరచయితల రచనాశైలిని మెరుగుదిద్దడంలో, వ్యాసరచనకు అవసరమైన నైపుణ్యం అందించడంలో తగిన సహకారం అందించడం తన బాధ్యతగా **వీక్షణం** భావిస్తున్నది. తగిన కృషి జరగకపోవడం వల్ల లోపాలబారినపడిన ఒక ముఖ్యమైన ప్రక్రియను మెరుగుపరిచే ప్రయత్నం ఇది. భవిష్యత్ వ్యాస రచయితలను తయారు చేసే ప్రయత్నం ఇది. ఇందులో భాగంగా వ్యాసరచయితలకు, వ్యాసరచయితలు కాదలచుకున్నవారికి ఉపయోగపడే అధ్యయన తరగతిని **వీక్షణం** గత మూడు నెలలుగా నిర్వహిస్తున్నది.

ఈ కృషిలో భాగంగానే **కళాశాలల, విశ్వవిద్యాలయాల విద్యార్థులకు వ్యాసరచన పోటీని** నిర్వహించాలని వీక్షణం భావిస్తున్నది. విద్యార్థులు తమకు అభిరుచి ఉన్న ఏదైనా అంశం పైన ఎనిమిది ఫుల్ స్కేప్ పేజీలకు మించకుండా వ్యాసం రాసి వీక్షణం చిరునామాకు డిసెంబర్ 1 లోపు పంపించాలి. విజేతల వ్యాసాలు వీక్షణంలో అచ్చవుతాయి. విజేతలకు తగిన, విలువైన పుస్తకాల రూపంలో బహుమతులుంటాయి. వీటితో పాటు విజేతలు వీక్షణం వ్యాసరచయితలలో భాగస్తులవుతారు. వారికి అభిరుచి ఉన్న అంశాల మీద వీక్షణం కు క్రమం తప్పకుండా వ్యాసాలు రాసే అవకాశం దొరుకుతుంది.

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

**VEEKSHANAM** Telugu Monthly Journal of Political Economy and Society - 111 - October 2010

● RNI Regn.No.APTEL/2003/11482● Published on 29/09/2010 ● Postal Regn. No. LII/RNP/HD/1100/2008-10

# మహాత్ముని ఆశయాలను నెరవేరుస్తూ...
# ప్రజలకు చేరువవుతున్న అభివృద్ధి, సంక్షేమం





అకుంఠిత దీక్షతో కలసి పనిచేద్దాం.
"అతి నిరుపేదకు సైతం ప్రగతి ఫలాన్ని
అందించేదే నిజమైన స్వరాజ్యం"
అన్న మహాత్మాగాంధీ
నిర్వచనాన్ని నిజం చేద్దాం.

మీ
కె. రోశయ్య
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

## రాష్ట్రంలో విజయవంతంగా అమలవుతున్న ప్రభుత్వ పథకాలు

### రాజీవ్ ఆరోగ్య శ్రీ

### వై.యస్.ఆర్. అభయహస్తం

### కిలో రెండు రూపాయల బియ్యం

### జలయజ్ఞం

### పావలావడ్డీ

### జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం

### ఇందిరమ్మ ఇళ్ళు

### ఇందిరమ్మ పింఛన్లు







R.O.No. 922/Sou/Advt.I/2010-11 Dt. 04-09-2010

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao